




ముఖచిత్రం అజూర్ చేసిన ప్రతిమాసుందరి

చిత్రకారుడు వడ్డాది పాపయ్య




యువ సాలుచందా రూ. 24-00

దీపావళి సంచికతో రూ. 30-00

యువ, హైదరాబాదు - 500001




సినిమాతారల ముఖచిత్రాలు చూసి చూసి బోర్ కొట్టే మాలాంటి పాఠకులకు నెలనెలా 'యువ' మీద ప్రచురిస్తున్న వడ్డాదిపాపయ్యగారి ముఖచిత్రాలు ఎంతో రిలీఫ్‌గా వుంటున్నాయి

ఆగస్టు యువతో పూర్తయిన 'షేమ్' సులోచనాగారికథ సమాజానికోదర్పణం బాయ్‌మీట్ గరల్ లాంటి కథలుకాకుండా సమాజంలో జరుగుతున్న దుష్కార్యాలను చక్కగా వివరించినందుకు ఆమెకు ధన్యవాదాలు ఈ నెలనుండి ప్రారంభమైన 'బృందావనం' కౌసల్యాదేవిగారి సీరియల్ మొదట్లోనే హుషారు అందుకున్నది ఆమెవ్రాసే కథకంటే కథనం బాగుంటుంది శైలి ఆ కథకు ప్రాణం కథల్లో "ఇది కథకాదు," "ఒప్పందం" బాగున్నాయి సాకి చాలా చాలా బాగున్నాయి. వీటిని గురించి యింకా రాస్తే మరీ పొగడ్తలై పోతాయి. థీమ్స్ బాగున్నాయిముఖ్యంగా

—వి. వి. సుబ్బారావు బి కాం.
గుంటూరు-3

'మృత్యుసీమలో స్వర్గధామం' ముఖచిత్రం చాలా బాగున్నది.

ఆలేటి నాగమణిగారి 'ఛాయ' నవల, శ్రీరాజ్ గారి 'ఒప్పందం', కమలామణి గారి 'ఇది కథ కాదు' కథానికలు, కృత్తిక, రోహిణిలు కనులవిందుగా ఉన్నాయ్.

— కచర్లపల్లి కృష్ణకుమారి
కోడూరు

నేడే చూడండి! నేడే చూడండి!!

ఎమ్కె ఎస్బి వారి

# నోము

( ఈస్టమన్ కలర్ )




సాగర్ టాకీస్, హైదరాబాద్.
మీరా టాకీస్, ఖైరతాబాద్, హైదరాబాద్.
అప్సరా టాకీస్, లాల్ దర్వాజా, హైదరాబాద్.
లక్ష్మి టాకీస్, వరంగల్.
అంజలి టాకీస్, సికింద్రాబాద్.
రమేశ్ టాకీస్, నిజామాబాద్.
సిటీ టాకీస్, రాయచూర్.
భారత్ టాకీస్, కరీంనగర్.
అశోక టాకీస్, మహబూబ్‌నగర్
అంబే పిక్చర్‌ప్యాలెస్, ఖమ్మం

—విజయా సురేష్ రిలీజ్

"మృత్యుసీమలో స్వర్గధామం" ముఖ చిత్రంతో వెలువడిన ఈనెల "యువ"కి నాగమణిగారి "ఛాయ" నవల వన్నె తెచ్చింది యద్దనపూడి సులోచనారాణి గారి "షేమ్" కథ వండర్‌ఫుల్ "నలుగురు వకీర్లు," సీరియల్స్ ఫైన్, ఫైన్. మా అభిమాన రచయిత్రి ఆరెకపూడి కౌసల్యాదేవిగారి "బృందావనం" సీరియల్ ప్రారంభించినందుకు మీకు ధన్యవాదాలు.

—వి. పార్వతీశరావు
బొబ్బిలి

మృత్యుసీమలో స్వర్గధామం" ముఖ చిత్రంతో ఈ నెల యువ అందంగా ముస్తాబై మా చేతికి అందింది మనిషి దేనికైనా అతీతుడు కాగలడు, కాని పొగడ్తకి అతీతుడు కాలేడన్న నగ్న సత్యాన్ని 'గొడుగు' కథ ద్వారా చాలా చక్కగా తెలియజేశారు యద్దనపూడి సులోచనారాణి గారి 'షేమ్' ఒక మంచి వెరైటీ కథ. నిజం. ఛాయ (నవల) ఒక మధురమైన కలలా ఎల్లప్పుడూ మా హృదయంలో ఛాయలా నిండిపోయి వుంటుంది. మిగతా కథలన్నీ బావున్నాయి. కార్టూనులు సంఖ్య ప్రతినెలా తగ్గించేస్తున్నారు.

—వి. జగన్నాధస్వామి
భువనేశ్వర్









Forhan's
Forhan's

సెప్టెంబరు నెల

# భావపరిచయ పోటీ

## బహుమతి పొందిన వ్యాఖ్య



అల్పుడయినవాని నణగఁద్రొక్కుటకును
గొప్ప విద్యలేల గోటఁబోవు
మూషికమును చంప మూపున మోసెడి
మారణాస్త్రమేల వీరపురుష!

మేడిశెట్టి వీర వెంకట సత్యనారాయణ
విశాఖపట్నం-3

# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 30 | సెప్టెంబరు-1974 | సంచిక 3


అక్టోబరు నెల

## భావపరిచయ పోటీ

బహుమానం రూ 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.



# దోసిట్లో అవకాశాలు

రెడ్డిగారు అతనివంక వింతగా చూశాడు "నువ్వు కథలు జెబుతావా? నరే కానీ" అన్నారు.

సుబ్బారాజు సిగ్గుపడ్డాడు "అబ్బే. నా కతగాదు. అదే ఆయనజెప్పిపొయ్యాడే అది ఓ కుర్రోడు ఆకలికేడుస్తా తిరిగి తిరిగి ఓ సత్రం అరుగుమీద స్తంభాన్ని కావిలించుకుని నిలబడి ఉన్నాట్ట. ఇంకో కుర్రోడు దారంట పోతాపోతా ఈణ్ని జూసి ఎందుకన్నాడు ఆకలేస్తుందన్నా డీడు ఆడిదగ్గర సంచిలో పేలాలున్నాయి పట్టెడు దీసిచ్చాడు కుర్రోడు దోసిలిబట్టాడు దోసిట్నిండా పేలాలుబోసి ఆడిదార్నాడు బొయ్యాడు ఈ కుర్రాడు స్తంభాన్ని కావలించుకున్నాడు గదా? అదేమో లావుపాటిది మోరచాచి నాలికెంత సాగదీసినా దోసిట్లో పేలాలు అందిసావలేదు. ఆడికేం పాలుపోలేదు కాసిని పేలగింజ లొగ్గేసి పిడికళ్లు ముడిచి చేతులెనక్కి దీసుకుంటే రెండు గుప్పిళ్ళు నోటి కందుతాయిగాని ఆడికి మనసొప్పలే ఆకలి మూలాన ఆబగా ఉన్నాడు ఆటి కేసే అలాచూస్తా ఏడుస్తా నిలబడిపోయ్యాడు గోదా రోడ్డు సత్రవేమో గాలి జోరుగావుంద గాలికి పేలాలు ఎగిరిపోతున్నాయి చూస్తావుండగానే పెద్ద గాలేసి ఒక్కసారిగా అన్నీ ఎగిరి దుమ్ములోపడి కొట్టుకుపొయ్యాయి కుర్రాడు మళ్ళీ ఓ ఏడుపేడిచి ఆ స్తంభాన్నే కావలించుకొని అలాగే నిలబడిపోయాడట ..."అని కథ ఆపాడు సుబ్బారాజు

రెడ్డిగారు పకపకనవ్వారు ముందుకు వంగి సుబ్బారాజు భుజం తట్టాడు.

"బాబూ, ఈ కత జెప్పింది నువ్వుగాబట్టూరుకున్నాను. చౌదరి మరోడిచేత ఇలాటిది చెప్పించినా, అదే వచ్చి చెప్పినా ఏంజేసేవోణ్ణో నాకు తెలియదు నాగ్గావాల్సిన పేలాలు నా గుప్పిట్లోనే గాదు, జోళీలో గూడా ఉన్నాజెప్పు చౌదరి కసలు మాట్టాడం చేతగాదు. ఎత్తిపొడుపులూ ఎత్తుపైఎత్తులూ ఏం వేస్తాడు?" *

*ముళ్ళపూడి వెంకటరమణ*




గడియారం ఎనిమిది కొట్టింది.

జగదీశ్ లేచి "ఇంక నేను వెళ్ళాలి!" అన్నాడు.

"అప్పుడేనా?" రావు, రాజు, నాయుడు ఏకకంఠంతో అన్నారు.

'ఇదంతా నాకు తెలును' అన్నట్లు చిరునవ్వు నవ్వి వెళ్ళిపోయాడు జగదీశ్

అతడు అలా కదలగానే మిగిలినవాళ్ళు ఒకరి ముఖాలు మరొకరు చూసుకుని పకపక నవ్వుకున్నారు

"పాడులోకం! ఇలాంటివాళ్ళు కూడా ఉంటారయ్యా! మంత్రిపదవిలో ఉన్నాడు—సొంత ఆస్తి ఒక్క పిసరుకూడా సంపాదించుకోలేదు!"

"బోడిపేరు సంపాదించుకున్నాడుగా — కరప్షన్ సాగనియ్యడని...చాలా మందిని అరెస్టుచేసాడు!"

"ఏడిశాడులే! అదిసరేకాని ఈ మహానుభావుడు మన వెనక ఎందుకు పడుతున్నాడయ్యా!"

"అది నాకూ అర్థంకావటంలేదు పొమ్మనలేంకదా!"

"ఇంకా నయం! రానియ్యి—స్నేహంగానే ఉంటున్నాడుగా!"

"స్నేహంకాక!...ఎంతైనా మంత్రి! చూద్దాం!"

"జాగ్రత్త! మన గుట్టుమట్లు అతనికి తెలియనీయకండి!"

"ఎవరికి చెపుతున్నావయ్యా? ఇక్కడ పసివాళ్లెవరూ?"

ఘొల్లున నవ్వుకున్నారు—జగదీశ్ అక్కడినుంచి కదిలేవరకూ రాని విస్కీ బాటిల్స్ అక్కడికి వచ్చాయి—అవి ఖాళీ అవుతున్నాయి అందరూ మహోత్సాహంలో మునిగితేలుతున్నారు—ఒక్క నాయుడిముఖమే కళావిహీనంగా ఉంది.

"అలా ఉన్నారేం నాయుడుసాబ్!" అన్నాడు రాజు మత్తుగా...నాయుడు సమాధానం చెప్పేలోగానే, అతడి కుడిచెయ్యి, నమ్మకమైన బంటు కేశవులువచ్చి "బాబుగారూ! అబ్బాయిగారి ఆచూకి దొరికింది!" అన్నాడు.

ఉలికిపడి కూర్చున్నాడు నాయుడు. "దొరికిందా? ఎక్కడున్నాడు?"

"పోలీసులు వెంటపడితే తప్పించుకుని పారిపోయి యువజన సంఘంలో దాక్కున్నాడట! సంగతేమిటో తెలియక ఇంతవరకూ యువజన సంఘంవాళ్ళు ఊరుకున్నారు. రమేష్‌బాబుగారు ఇప్పుడే వచ్చారు విషయం తెలుసుకుని అబ్బాయిగారిని పోలీసులకు పట్టిచ్చారు..."

నాయుడి ముఖం పాలిపోయింది కేశవులు చెప్పినది విన్న మిగిలిన వాళ్ళలో కుతూహలం పెరిగింది

"ఏం జరిగింది నాయుడుసాబ్?" అన్నాడు సానుభూతితో రావు

రావు, నాయుడు ప్రాణస్నేహితులు - రావుకు జరిగింది చెప్పటానికి నాయుడికేమీ అభ్యంతరంలేదు

"మా వాడు మరీ అదుపు తప్పిపోతున్నాడు రావుసాబ్! కాపీలు కొట్టనియ్యలేదని పిల్లలంతా ఎదురుతిరిగారట! కొందరు స్టూడెంట్స్ ప్రిన్సిపాల్ మీద రాళ్ళు రువ్వారు. మావాడు విసిరినరాయి ప్రిన్సిపాల్ తలకి బలంగా తగిలింది. ఆఫీస్‌లో వాళ్ళు పోలీసులను పిలిపించారు వాడు భయపడి పారిపోయాడు ప్రిన్సిపాల్ హాస్పిటల్‌లో ఉన్నారు. పరిస్థితి ప్రమాదంగా ఉందని అంటున్నారు..."

జరిగింది విని చాలా నొచ్చుకున్నాడు రావు

"ఈ కాలం పిల్లలు ఎందుకిలా తయారవుతున్నారో అర్థంకాదు! ఎందుకింత రాద్ధాంతం! ఏదో రాసి ఇవతలికొస్తే ఆ తరువాత విషయం మనం చూసుకునే వాళ్ళంగా!"

"అదే నేనూ చెప్పాను వింటాడా? పెద్ద హీరోలాగ పోజు కొట్టొద్దూ? వాడికి

ఫస్ట్‌క్లాస్ కావాలన్నా తెప్పిద్దును; యూనివర్సిటీఫస్ట్ కావాలన్నా ఇప్పిద్దును; కానీ ఇలా బయటపడి పోలీసులచేతుల్లో చిక్కుకుపోయాక ఏంచెయ్యగలను?''

"ఇప్పుడైనా ఏదైనా చెయ్యగలిగేవాళ్ళం; అవతల ఆ పెద్దమనిషి చావు బతుకులమీద ఉండటం వచ్చింది చిక్కు!''

ఇలా ఆ పెద్దలిద్దరూ కుర్రవాడి బాగోగులు గురించి చర్చించుకుంటుంటే రాజు ఒక్కసారి ఆవులించి ''ఇంకెవరిమీదయినా ఈ నేరం తోసెయ్యడానికి లేదూ?'' అన్నాడు.

నాయుడు నిరుత్సాహంగా "ఎలా? బహిరంగంగా అంతమందిలో కొట్టి నప్పుడు " అన్నాడు.

ఇలాంటి విషయాలు ఆలోచించటంలో ఆరితేరిన రావుబుర్రలో మెరుపు మెరిసింది..

"మీ అబ్బాయి పోలీసులకు ఎక్కడ దొరికాట్ట?''

"యువజన సంఘంలో...అక్కడ వాడికెవరో ఫ్రెండ్స్ ఉన్నారట; ఈ దౌర్భాగ్యుడి కందరూ ఫ్రెండ్సే;..."

"తొందరపడకండి; ఎవరి స్నేహం ఎలా ఉపయోగపడుతుందో ఎవరు చెప్ప గలరు?''

"ఏం ఉపయోగం? రమేశ్ పోలీసులకు పట్టిచ్చిన తరువాత..."

"ఇంకేం? ఆ యువజనసంఘం వెనక ఉండి ఇలా విద్యార్థులను రెచ్చగొట్టి అల్లరులను చేయిస్తోంది అభం, శుభం తెలియని విద్యార్థులు ఇలాంటి సంఘంవల్ల పాడయిపోతున్నారు. "

"వాట్?..." సంతోషంతో నోరు వెళ్ళబెట్టాడు నాయుడు

"రమేశ్ లాంటి వ్యక్తులు ఈ నాటకమంతా నడిపిస్తారు తప్పివస్తే చిన్న పిల్లల్ని అరెస్ట్ చేయిస్తారు. న్యాయానికి అరెస్ట్ కావలసింది రమేశ్‌లాంటివాళ్ళ ...ఒక్క రమేశ్‌మూలంగా వందలాది పసివాళ్ళు పాడయిపోతున్నారు..."

"వాట్...వాట్..." సంబరంతో మతిపోతోంది నాయుడికి...

"అలా మీనమేషాలు లెక్కపెట్టకండి. త్వరగావెళ్ళి పోలీస్‌రిపోర్ట్ ఇవ్వం

నాయుడు రావుని కౌగలించుకుని రెండు చేతులూ పట్టుకుని ఊపేసాడు.

పోలీస్ యువజనసంఘంపైన రెయిడ్ చేసింది. రమేశ్‌ను అరెస్ట్ చేసింది.. యువజనసంఘ సమావేశభవనాన్ని సోదా చేసినపుడు పోలీసులకు కొన్ని ఉత్తరాలు దొరికాయి. అవన్నీ "దీనబంధు" అనే సంతకంతో ఉన్నవి.

రమేశ్‌కు రాసినవి రాజ్యాంగంలో అక్రమాలు జరుగుతున్నట్లుగా అనుమానం తోచిన సందర్భాలన్నీ వివరిస్తూ దీనబంధు ఎప్పటికప్పుడు రమేశ్‌కు రాసిన ఉత్తరాలవి ఆ అక్రమాలను నిరూపించటానికి తగిన సాక్ష్యాలను సేకరించమనీ, అందుకు తన సహకారం ఉంటుందనీ రాసాడు దీనబంధు. ఈ వార్త అన్ని పత్రికలలోనూ వచ్చింది జనం నివ్వెరపోయారు. ఇటీవల అనేక అన్యాయాలూ, అక్రమాలూ సడన్‌గా బయటపడటంలో అసలు రహస్యం అర్థమయింది. అంతకంటె నివ్వెరపాటు కలిగించినది దీనబంధు ఆదేశాల ప్రకారం రమేశ్ నడుచుకుంటున్నాడనే రహస్యం...

దీనబంధు బతికే ఉన్నాడా?

అప్పటికి పదిసంవత్సరాల క్రిందట యువజన సంఘాన్ని దీనబంధు స్థాపించాడు. ప్రధానంగా మైనారిటీస్ సమస్యలను పరిష్కరించటమే దీనబంధు ధ్యేయం ... 'దీనబంధు' అతని అసలు పేరుకాదు. కూలిజనం భక్తితో పెట్టుకున్న పేరు. చివరకు అదే స్థిరపడిపోయి అసలు పేరు మరచిపోయారు

రావుగారు, దీనబంధు మంచి స్నేహితులు. దీనబంధు తెలివితేటల్నీ, చాకచక్యాన్నీ రావుగారు చాలా మెచ్చుకునేవారు రావుగారి ఒక్కగానొక్క కూతురు జానకి దీనబంధును ప్రేమించింది రావుగారు కూడా ఆ పెళ్ళికి ఒప్పుకున్నారు.

ఆ రోజుల్లోనే కొందరు గూండాలు దుర్గాబేంక్ మీద ఆయుధాలతో వచ్చిపడి దోచుకున్నారు. ఆ సందర్భంలో ఒక హత్యకూడా జరిగింది. ఆ తరువాత జరిగిన ఆచూకీలో ఆ దోపిడీ దీనబంధు చేయించినట్లు తేలింది దీనబంధు పోలీసులను తప్పించుకుని పారిపోయాడు పోలీసులు అతనికోసం గాలించసాగారు. ఒక సందర్భంలో పోలీసులను తప్పించుకునే ప్రయత్నంలో దీనబంధు టాక్సీకింద పడి చచ్చిపోయాడు ఈ వార్త అన్ని పత్రికలలోనూ వచ్చింది దీనబంధు మరణవార్త వినగానే జానకికి మెంటల్‌షాక్ వచ్చింది ఆవిడ గతంలోనే జీవిస్తుంది. వర్తమానంతో ఏమీ సంబంధంలేనట్లు ఈ లోకానికి సంబంధించని మనిషిలా ప్రవర్తిస్తుంది.

ఈ సంఘటనలతో రావుగారు చాలా కృంగిపోయారు జానకిని మళ్ళీ మామూలుమనిషిని చెయ్యాలనే ఆయన ప్రయత్నాలు ఏవీ ఫలించలేదు

ఇన్నాళ్ళకి ఈనాడు మళ్ళీ దీనబంధు ప్రస్తావన...ఆ 'దీనబంధు' ఈ దీనబంధు ఒకరేనా? ఎలా సాధ్యం? చచ్చిపోయిన దీనబంధు ఎలా బతికి రాగలిగాడు? ^మేశ్‌కీ దీనబంధుకూ ఎలాంటి పరిచయం?

దర్యాప్తు జరిగింది యువజనసంఘంపైన ఆరోపించదగిన నేరం ఒక్కటి కూడా లేదు. ఆ సంఘం మైనారిటీస్ అభివృద్ధికి పాటుపడటంతప్ప ఏనాడూ అక్రమచర్యలు చెయ్యలేదు. ఎవ్వరినీ ఏవిధంగానూ రెచ్చగొట్టలేదు రమేశ్‌ను గురించి కూడా అన్నివిధాల మంచి అభిప్రాయాలే తప్ప ఏ రకంగానూ మరొక మాట వినిపించలేదు అయినా వీటినన్నిటినీ మించిన అభియోగం రమేశ్‌పైన పడింది. అది దీనబంధుతో అతనికున్న సంబంధం...

కస్టడీలో ఉన్న రమేశ్‌ని కలుసుకున్నాడు రావు.

దీనబంధును గురించి గుచ్చి గుచ్చి అడిగాడు. కాని తనకేమీ తెలీదని రమేష్ అన్నాడు

రమేశ్ మాటలు నమ్మాలో, నమ్మకూడదో అర్థం కాలేదు రావుకి.

## 2

రూపుదాల్చిన శోకదేవతలాగ ఉంది సుగుణ మల్లేశ్‌ని చూడగానే చటుక్కున ముఖం తిప్పుకుంది సుగుణ దుఃఖానికి, తనమీది కోపానికికూడా కారణం తెలుసు మల్లేశ్‌కి అందుకే 'అలా ఎందుకున్నావని' భార్యను అడగలేదు ఆ కారణం సుగుణ నోటవిని సహించేశక్తిలేక...

అబ్బ! ఒక్కరోజులో.. కాదు—కొన్ని గంటలలో ఎంత మారిపోయింది! ఎంత ఆవేదన! ఆ ఆవేదనచూస్తే జాలి కలగడంలేదు. ఏదో కసి రగులుతోంది! ఏదో జ్వాల మనసును మాడ్చేస్తోంది!

మల్లేశ్‌ని చూడగానే మామూలుగా భోజనం వడ్డించింది సుగుణ...ఎంతమంది నౌకర్లున్నా మల్లేశ్‌కి మొదటినుండీ సుగుణ తనే వడ్డించేది ఇది ఆశ్చర్యాన్నీ, సంతోషాన్నీ కూడా కలిగించేది మల్లేశ్‌కి. .ఆ రోజు కూడా తనకు స్వయంగా భోజనం వడ్డిస్తోన్న సుగుణను మనసులో మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు.

మౌనంగా భోజనంచేయసాగాడు సుగుణ మాట్లాడుతుంది మాట్లాడక తప్పదు...

చాలసేపు మల్లేశ్‌ని చూస్తూ కూచన్న సుగుణ చటుక్కున అడిగేసింది.

"రమేశ్‌కు ఎలాంటి శిక్షపడుతుంది?"

"చెప్పలేం! పెద్దపెద్దవాళ్ళంతా అతనికి వ్యతిరేకంగా ఉన్నారు!"

"మీరు వాళ్ళతరపునే వాదిస్తారుగా!"

"ఎప్పటిలాగానే జరుగుతుంది. ఇవాళ కొత్తగా ఎందుకు మార్పు రావాలి?"

"అవును! మార్పు ఎందుకు రావాలి! ఎప్పటికీ.., ఎప్పటికీ ఒక్కలాగానే

ఉండాలి!.. అదే మీకోరిక! కానీ లోకంలో అందరూ మీలాంటివాళ్ళే అయితే అందరూ మీలాగే మార్పురాకూడదని అనుకునిఉంటే మీ రీపాటికి. .''
ఆగిపోయింది సుగుణ-మల్లేశ్ ముఖం పాలిపోయింది. తినడం ఆపి సుగుణ ముఖంలోకి సూటిగా చూస్తూ ''ఆగిపోయావేం? పూర్తిచెయ్యి నే నీపాటికి...'' అన్నాడు.

మల్లేశ్ అలా కవ్విస్తున్నట్లు మాట్లాడినా సుగుణ సమాధానం చెప్పలేదు. క్రింది పెదవి పళ్ళకింద వలగ్గొడుతూ కూచుంది...

మల్లేశ్ కేదో కక్షగా ఉంది సుగుణను మరింత రెచ్చగొట్టాలని ఉంద.

"పాపం! రమేశ్‌కి శిక్ష పడుతుందని బాధగా ఉందా?''

చివ్వున తలెత్తింది సుగుణ! మల్లేశ్ కళ్ళలో వెక్కిరింత అర్థమయింది. పకాలున నవ్వింది

"ఎంతమాత్రం లేదు బాధ దేనికి? మీకు మరో కొన్ని వేలొస్తాయి. అవిపెట్టి నేనింకా బోలెడన్ని నగలు చేయించుకోవచ్చు. మిద్దెలు కట్టుకోవచ్చు. కార్లలో ఊరేగవచ్చు..."

"కరెక్ట్! ఇవ్వన్నీ చెయ్యవచ్చు ఆ డబ్బుతో ఇవన్నీ తేలిగ్గా కొనుక్కోవచ్చు. ఒక్క చిరునవ్వు తప్ప!''

"అది అర్థమయిందా?"

''అయింది ''

"నేను నమ్మను! అసలు చిరునవ్వుకు అర్థమేమిటోకూడా అర్థం కాదు మీకు ..."

'సుగుణా! అంత మూర్ఖుణ్ని అనుకోకు! నీకు ఇప్పుడే ఒక చిరునవ్వు సంపాదించిపెడతాను ఈసారి నేను రమేశ్ తరఫున పనిచేస్తున్నాను..."

సుగుణ ముఖం వెలిగిపోయింది ఆమె ముఖంలో చిరునవ్వు

"చూశావా? నాకు తెలుసు..," కష్టంగా అన్నాడు.

ఎర్రబడిన ఆ ముఖాన్ని కళ్ళలో కదిలే అణచుకుంటున్న ఆవేదననీ పరిశీలనగా చూసింది సుగుణ చిరునవ్వుతో ''నీకు తెలిసింది చాలా కొంచెం మల్లేశ్! ఇంకా చాలా చాలా తెలుసుకోవాలి! నీ అంతట నువ్వు తెలుసుకుంటావని నేను చెప్పటంలేదు!'' అంది.

అవును! తను తెలుసుకోవలసింది చాలా ఉంది ఆ విషయం ఆ రోజు ఉదయం మాస్టారిని కలుసుకున్న తరువాతే తెలిసింది...



ఎన్నిరోజుల తర్వాతనో మాస్టారిని కలుసుకున్నాడు. మాస్టారితో మాట్లాడిన తరువాతే రమేష్ తరఫున వాదించాలనే నిశ్చయానికొచ్చాడు. ఆ నిశ్చయానికి రాక తను చెయ్యగలిగిందేమీ లేదు. కొన్ని కొన్ని నిజాలంతే! తెలుసుకోకుండా ఉండలేము. తెలుసుకొని భరించలేము.

మంచంమీద పడుకుని ఆలోచిస్తున్నాడు మల్లేశ్.

తను రమేష్ తరఫున వకాల్తా తీసుకోవటం సామాన్యమైన విషయంకాదు. రావుగారికి తప్పకుండా కోపం వస్తుంది ఇకమీదట తనను లాయర్‌గా ఉంచుకోకపోవచ్చును. . . ఫరవాలేదు! ఇప్పుడు లాయర్‌గా తనకు మంచి పేరు ప్రఖ్యాతులొచ్చాయి. రావుగారు తమ కంపెనీలకు లాయర్‌గా ఉంచుకోకపోయినా తన సంపాదనకు లోటుండదు! ఏమో చెప్పలేము! రావుగారు తనమీద కూడా పగబడితే...కక్ష సాధించాలనుకుంటే...ఆయన ఏమైనా చెయ్యగలడు! కానీ తను రమేష్ తరఫున వాదించక తప్పదు. మాస్టారి మాటలు విన్నాక మరో నిర్ణయానికి అవకాశంలేదు.

మల్లేశ్ పడుకున్న మంచంమీద చేతులానించి కొద్దిగా ముందుకు వంగింది సుగుణ! ఎంత అందమైంది సుగుణ! కనుముక్కుతీరుకు అతీతమైన అలాంటి అందం చాలా కొద్దిమందిలో మాత్రమే ఉంటుంది

"నువ్వు నిజంగా రమేష్ తరఫున వాదిస్తున్నావా?" నమ్మలేకపోతోంది సుగుణ ఇప్పటికీ!

అవును!

సుగుణ చటుక్కున మల్లేశ్ మీదకు వంగి అతని పెదవులు గట్టిగా ముద్దుపెట్టుకుంది.

ఎంత మాధుర్యం సుగుణ చుంబనంలో... కానీ, ఇంత ఆవేశం... ఇంత మాధుర్యం...అంతా తను రమేష్ తరఫున వాదించబోతున్నాడనే సంతోషంలో వచ్చినవి!

మాధుర్యం! విషం కలిపిన మాధుర్యం! ఒకే క్షణంలో అంతులేని పారవశ్యాన్ని భరించలేని బాధని కలిగించే అనుభూతి!

సుగుణ మొదటినుంచీ ఇంతే! తన గుండెల్లో నిండి మెరుపులు విరజిమ్ముతుంది. తనకు అందరానంత దూరానికి ఎగిరిపోయి బాకులు దూస్తుంది

## 3

గొడ్లదావడి ఊడుస్తూ ఎదురుగా ఉన్న ప్లేగ్రౌండ్ వైపే అసహనంగా చూస్తున్నాడు మల్లేశ్. ఆడపిల్లలంతా తెల్లటి ఫ్రాక్స్ వేసుకున్నారు మొగపిల్లలంతా తెల్లటి నిక్కర్లు, తెల్లటి బనియన్లు వేసుకున్నారు. అందరూ తెల్లటి మేజోళ్ళు, తెల్లని కేన్వాస్ షూస్ వేసుకున్నారు. లోకంలో ఉత్సాహమంతా ఆ ముఖాలలో తాండవిస్తుంది. ఊడవటం పూర్తిచేసి గొడ్లని గుంజలకి కట్టేసి వాటి ముందు గడ్డిమోపులు పడేసి ఉస్సురని నిట్టూర్చాడు మల్లేశ్. ఈ జన్మకి తనూ వాళ్ళలా ఆడగలడా? ఏనాటికైనా తనూ వాళ్ళలో ఒకడు కాగలడా?

తన ఈడువాళ్లు తమ కులంవాళ్ళు చాలామంది ఆడుకుంటారు ఈ రకం ఆటలు కావు. బిళ్ళంగోడి, కోతికొమ్మచ్చి మొదలైనవి. ఆ ఆటలకి ఇలాంటి ముచ్చటైన బట్టలక్కర్లేదు. నిక్కర్లు చాలు, గోచీ గుడ్డలు చాలు! కానీ, తను అలాటి ఆటలు కూడా ఆడటానికి నోచుకోలేదు. మాస్టారు చెప్పారు. "నువ్వు తెలివైనవాడివిరా! చదువుకుంటే పైకొస్తావు" అని. అప్పటినుంచీ చదువుకోవాలనే తపన ఒక్కటే తనకు మిగిలింది పని చెయ్యకపోతే తమకు కుదరదు "పాటడకపోతె, కూడెట్టా ఒస్తదిరా! కూకుంటావు, దొరనాగ..." అని కసురుతాడు తండ్రి. అది నిజం! ఉదయంనుండి సాయంత్రంవరకు తండ్రి రెక్కలు ముక్కలు చేసుకున్నా, కుటుంబానికి సరిపోదు తను కష్టపడవలసిందే! బడికెళ్ళటం-ఇంటికిరావటం, పనిలో పడటం...మల్లేశ్ కి ఆడుకునే తీరికే ఉండదు...పోనీయ్! ఈనాడు చిన్నతనంలో వాళ్ళతో కలిసి ఆడుకోలేకపోయినా, రేపు పెద్దవాడయ్యాక వాళ్ళందరినీ మించిపోలేడా? అది సాధ్యమేనా?

చక్రపాణిగారిది పెద్ద ఆవరణ, ఆ ఆవరణలోనే ఆయన ప్రత్యేకం పిల్లలకోసం గేమ్స్‌కోర్ట్ తయారుచేయించారు. ఆ ఇంట్లో పాలేరుగా పనిచేసే వెంటయ్య కొడుకు మల్లేశ్‌కు ఆ గ్రౌండ్‌లో పిల్లలను చూడటం ఆవేదనతో కూడిన వదులు కోలేని దినచర్య.

చక్రపాణిగారి ఇంటిముందు పూలమొక్కలు కూడాఉన్నాయి. ఆ మొక్కలకు రోజూ నీళ్లు పోసేది కూడా మల్లేశే! ఆ మొక్కల మధ్య వొత్తుగా పెరిగిన గడ్డిమధ్య కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ, చదువుకుంటూ, నవ్వుకుంటూ ఆడుకునేది మాత్రం సుగుణా రమేష్‌లు. వాళ్ళిద్దరినీ ఎప్పుడుచూసినా మనసులో భయం ఏదో మండినట్లవుతుంది మల్లేశ్‌కి కానీ, ఎప్పుడూ వాళ్ళనే చూడాలని పిస్తుంది. తమనిలా ఒక ప్రాణి అహర్నిశమూ అసహనంతో గమనిస్తోందని సుగుణా రమేష్ లిద్దరకూ తెలియదు

సుగుణా రమేష్ లిద్దరూ లెక్కరాక తాపత్రయపడుతున్నారు. అది చూసాడు మల్లేశ్. వాళ్ల దగ్గరగా వచ్చి "అది నేను చేయగలను" అన్నాడు

"నీ మొహం!"...అన్నాడు రమేష్ తిరస్కారంగా...

"పోనీ చెయ్యనియ్యరాదు!" అంది సుగుణ...అంటూనే లెక్కల పుస్తకం, పేపర్, పెన్ మల్లేష్ కిచ్చింది మల్లేష్ ఆ లెక్క చేసాడు. ఆన్సరొచ్చింది.

"నువ్వు కూడా లెక్కలు బాగా చేస్తావు!" చిత్రంగా చూస్తూ ఆశ్చర్యంగా అంది సుగుణ.

రమేష్ కూడా వింతగా చూసాడు ఆ ఆశ్చర్యం చూస్తే కోపం వచ్చింది మల్లేశ్‌కి. తను లెక్క కరెక్టుగా చేయటం అంత వింత విషయమా? తను వాళ్లకంటే తెలివైనవాడు కావటం అంత విభ్రాంతి కలిగిస్తోంది

సుగుణ ఆప్యాయంగా మల్లేశ్ చెయ్యిపట్టుకుని "ఇవాళనుండీ మనం ముగ్గురం జట్టు!" అంది

ఆ స్నేహంలో తన కోపమంతా మరిచిపోయాడు మల్లేశ్ ఆనందంగా_అదే సమయంలో బెదురుగా నవ్వాడు

"ఛీ! ఛీ! నీ చేతికంతా మట్టి అంటుకుంది!"

నవ్వుతూనే సుగుణ చేతికి మల్లేశ్ చేతినుండి అంటుకున్న మట్టిని చూపిస్తూ హేళనచేసాడు రమేష్ సుగుణ తన చెయ్యి చూసుకుని ముఖం చిట్లించి, "అవును! వాసన కూడా!" అంది. మల్లేశ్ ముఖంలో నవ్వు ఎగిరిపోయింది కానీ సుగుణ అంతలోనే మల్లేశ్ భుజంమీద చెయ్యివేసి "కొంచెంసేపటికే

చికాగ్గా ఉంది. పాపం! అంత పని నువ్వెలా చేస్తున్నావో!" అంది ఆ సానుభూతి మల్లేశ్ అతి ప్రయత్నంమీద అణచుకుంటున్న బాధనంతా తవ్వి పైకి తీసింది తలతిప్పుకుని వెళ్ళిపోయాడు.

సుగుణ, రమేష్, మల్లేశ్ ముగ్గురూ ఒక్క స్కూల్లోనే చదువుతున్నా అంత వరకూ సుగుణా రమేష్‌లూ మల్లేశ్‌ను గురించి పట్టించుకోలేదు. మల్లేశ్ మాత్రమే కాదు, మరికొంతమంది పాలేర్ల పిల్లలు కూడా అదే స్కూల్లో చదువుతున్నారు. గొప్పవాళ్ళ పిల్లలెప్పుడూ పాలేర్ల పిల్లలతో కలిసిమెలిసి ఆడుకోరు కానీ మల్లేశ్ లెక్కచేసిననాటినుంచీ సుగుణా రమేష్‌లు మల్లేశ్‌ని తమ జట్టులో కలుపుకున్నారు. మల్లేశ్ ఆనందానికి అంతులేదు.

ఆ రోజు మామూలుగా పిల్లలందరూ గేమ్స్ ప్రారంభించగానే సుగుణ మల్లేశ్ దగ్గరగా వచ్చి "నువ్వూ మాతో ఆడుకుందువుగాని రా!" అంది

తన కల...ఎన్నాళ్ళుగానో కంటోన్న కల! అసంభవమని అనుకున్న కల... నిజం కాబోతోంది! ఒక్కక్షణం మల్లేశ్‌కి ఆనందంతో ఒళ్ళు తెలియలేదు. కానీ, అంతలోనే తెలివి తెచ్చుకున్నాడు.

"నాకు పనుంది! గొడ్లొస్తాయి-కట్టేయ్యాలి! మేతపడేయ్యాలి—ఇంకా..."

మల్లేశ్ చెయ్యవలసిన పనులన్నీ వినే ఓపిక సుగుణకు లేదు. చెయ్యి పట్టుకుని లాగి "రద్దూ!" అంది. ఇంక నిగ్రహించుకోగలిగేశక్తి మల్లేశ్‌కి లేకపోయింది. బ్రతుకు బరువు ఎంత పెద్దవాడిని చేసినా అతనింకా పసివాడే! వెళ్ళి ఆటలలో చేరిపోయాడు తనను తను మరిచిపోయాడు. ఇళ్ళకు మళ్ళిన గొడ్లను కట్టేసే వారు లేకపోయారు అవి పోయి ఇతరుల పొలాల్లో పడ్డాయి అక్కడినుంచి బందెలదొడ్లోపడ్డాయి చక్రపాణిగారు జరిమానా కట్టి వాటిని విడిపించుకో వలసి వచ్చింది మల్లేశ్‌గాడి ఈ కండకావరాన్ని సహించలేకపోయారు స్తంభానికి కట్టి గొడ్డునుబాదినట్టు బాదసాగారు కెవ్వున అరిచింది సుగుణ.

"అతనిది తప్పులేదు నాన్నా! నేనే ఆటలలోకి రమ్మని బలవంతం చేసాను. అంది ఏడుస్తూ

"అయితేమాత్రం! చిన్న పిల్లవి నువ్వేదో అంటే వాడి బుద్ధేమయింది?" అన్నారు చక్రపాణిగారు

తనకూ మల్లేశ్‌కూ వయసులో వారడి ఎంతో తను చిన్నపిల్ల అయితే మల్లేశ్ బాధ్యతగల పెద్దమనిషి ఎలా అవుతాడో! ఇవన్నీ అర్థంకాలేదు సుగుణకి ఎంత

ప్రయత్నించినా మల్లేశ్‌కి తండ్రిచేతిలో దెబ్బలు తప్పించలేకపోయింది ఏడుస్తూ అడ్డుపడబోతున్న సుగుణని పనిమనిషి లోపలికి ఈడ్చుకుపోయింది.

వంటినిండా దెబ్బలతో ముడుచుకుపోయి పడుకున్న మల్లేశ్ దగ్గిరికి ఆయింట్‌మెంట్‌తో వచ్చింది సుగుణ మల్లేశ్‌కి శారీరకంగానూ, మానసికంగానూ కూడా భరించరానంత బాధగా ఉంది

''వద్దు! వద్దు! అమ్మాయిగారు! నా దగ్గిరికి రాకండి!"

"లేదు! రాయనియ్యి. నీకోసంకాదు — నాకోసం! లేకపోతే సుఖంగా నిద్రపోలేను...."

సుగుణ మాటలెప్పుడూ బాగుంటాయి మల్లేశ్‌కి. ఇప్పుడు మందుకంటే సుగుణ మాటలే బాగున్నాయి

"నన్ను క్షమించు మల్లేశ్! నేను చాలా తప్పుచేసాను..." కన్నీళ్ళతో అంది సుగుణ.

"అవును! నన్ను మీతో ఆటలకు పిలవటం పెద్దతప్పు!'' కష్టంగా అన్నాడు మల్లేశ్ అతని కష్టం సుగుణకు అర్థమయింది. ఇప్పుడిప్పుడే ఆ లేత మనసు కూడా కష్టాన్ని అర్థంచేసుకుంటోంది

"అదికాదు. నేను చేసినపనికి బాధ్యత వహించగలిగేశక్తి లేకుండా సాహసించాను. అందుకే బాధపడుతున్నాను. ఇప్పుడు ఓడిపోయాను! కానీ ఏదో ఒక నాటికి...ఇలాటిపనే అనాడు చేసినప్పుడు .. ఇలా బాధపడవలసిన అవసరం రాదేమో! ఆ శక్తి సంపాదించగలనేమో! తప్పకుండా సంపాదిస్తాను."

సుగుణమీద ఎంతో గౌరవం కలిగింది మల్లేశ్‌కి

ఆ మరునాడు మల్లేశ్ పనిలోకి వచ్చేసరికి ఎదురుగా నెట్ లేదు. ప్లేగ్రౌండ్ లేదు పిల్లలూ లేరు. ఆశ్చర్యం కలిగింది మల్లేశ్‌కి సాయంత్రం ఏడింటికి ఎక్కడినుంచో బాట్‌తో వస్తున్న రమేష్‌ని "మీరు ఇక్కడ ఆడుకోవటంలేదా?" అని అడిగాడు

''లేదు సుగుణ ఆటలు మానేసింది. ఈకాంపౌండ్‌లో గేమ్స్ కోర్ట్ ఉండటానికి వీల్లేదంది. మేమంతా మైదానంలో ఆడుకుంటున్నాం మావయ్య మాతో ఆడినందుకు నిన్ను కొట్టాడు. అంత జరిగాక నీ కళ్ళముందు ఏమి జరగనట్లు ఆడలేనంది సుగుణ. . నేను మాత్రం ఆటలు మానలేను. అందుకు సారీ!"

క్షమించమన్నట్లు నవ్వాడు రమేష్ మల్లేశ్ మనసుకు సుగుణ దేవతలాగే తోచింది. సుగుణ ఆటలు మానేసాక రోజు పొలాలమీదకు షికారుగా వెళ్లేది.

అక్కడ పనిపాటలు చేసుకునే కూలిజనాన్ని పరిశీలనగా చూస్తూ నిలుచునేది. తనలో తానే ఏదో మథనపడేది. సుగుణ మల్లేశ్, రమేశ్‌ల మధ్య సాన్ని హిత్యం పెరిగింది. మల్లేశ్ తెలివి సుగుణతోపాటు రమేష్‌ని కూడా ఆకర్షించింది. ఒకసారి మల్లేశ్ ''అమ్మాయిగారూ!'' అని ఏదోచెప్పబోతుండగా సుగుణ అడ్డుపడి "నన్ను అలా పిలవకు మల్లేశ్! సుగుణా అని పిలు" అంది

మల్లేశ్ సందేహించాడు. సుగుణ చిరునవ్వు నవ్వుతూ నిలబడింది రమేష్ మల్లేశ్‌ని ప్రోత్సహిస్తూ "పిలు మల్లేశ్! నేను పిలవటంలా? సుగుణా!అంతే! సింపుల్?" అన్నాడు

మల్లేశ్ సుగుణా' అన్నాడు. కానీ మల్లేశ్ నోట ఆ పిలుపు 'సింపుల్'గా రాలేదు. ఏదో 'ఆడ' గా వినిపించింది. మల్లేశ్ అలా పిలిచి ఏదో తప్పుచేసిన వాడిలా తల వంచుకున్నాడు. ''మళ్ళీ పిలు!'' అంది సుగుణ

మళ్ళీ మళ్ళీ పిలిపించింది మొదట ఏదో అస్వాభావికంగా అనిపించిన ఆ పిలుపు అయిదారుసార్లు పిలిచేసరికి అత్యంత సహజమైపోయి 'రమేష్ పిలిచి నప్పటిలాగే తోచసాగింది. కిలకిల నవ్వింది సుగుణ ఏదో సాధించిన తృప్తి ఆ ముఖంలో ...అంతవరకు తెలియని కొత్త విషయమేదో పరిశోధించి తెలుసు కున్న లాంటి గర్వం

పదోక్లాను పాసయ్యాక కాలేజీకి ఆ ఊరు వదిలి వెళ్ళాలి!

"చదివింది సాల్లే! పొరుగూరు పంపి సదివిస్తావేటి?'' అని కసిరాడు తండ్రి మల్లేశ్‌ని

అప్పుడప్పుడే ఓణీలు వేసుకుంటుంది సుగుణ ఆరోజు కొంచెం దిగాలుగా ఉంది.

"అలా ఉన్నావేం?" అన్నాడు మల్లేశ్

"ఇబ్బందులు!"

"ఇబ్బందులా?"

"అవును! డబ్బు ఇబ్బందులు! మా పెద్దబావ అర్జంటుగా స్కూటర్ కావాలని అలిగి కూచున్నాడు. చిన్నక్కయ్యకు రవ్వల నెక్లేస్ కావాలట! కొనమని పేచీ పెడుతోంది. అన్నయ్యలు చదువుల వంకతో తలొకఊళ్ళోనూ జల్సాలు చేస్తూ డబ్బు పంపమని ఉత్తరాలమీద ఉత్తరాలు రాస్తున్నారు. పాపం నాన్న ఈ ఇబ్బందుల మధ్య నలిగిపోతున్నాడు......."

పకాలున నవ్వాడు మల్లేశ్.

"నవ్వుతున్నావా?"



"అవును! మాలాటివాళ్ళ ఇబ్బందులు తలుచుకుంటే ఏడుపొస్తుంది. మీలాటి వాళ్ళ ఇబ్బందులు వింటుంటే నవ్వొస్తుంది."

"ఒక రకంగా నవ్వు రావటం సహజమే! అయినా ఇవి ఇబ్బందులు కావనటానికి వీల్లేదు. ఇవన్నీ కొనితెచ్చుకున్న ఇబ్బందులని కదూ నీ ఊహ! ఆమాటకొస్తే మీ ఇబ్బందులు మీరు తెచ్చుకునేవే! లేనిపోని ఆడంబరాలకు పోకపోతే మీకు ఇబ్బందులుండవు. మీ పరిస్థితి మీరు గుర్తించి మీ హక్కులకోసం పోట్లాడి అవి సంపాదించుకో గలిగితే మీకు ఇబ్బందులుండవు!"

సుగుణ మాటలన్నీ వింతగా వినిపిస్తున్నాయి మల్లేశ్‌కి ... తనను మించి ఎదిగిపోయి మాట్లాడుతోందనిపిస్తుంది "నేను నీకు సాయం చెయ్యగలిగితే బాగుండును," చటుక్కున అనేశాడు మల్లేశ్.

"నువ్వా!! నీకే కాలేజీలో చేరడానికి డబ్బులేక అవస్థపడుతూ..." ఏదో అనబోయి మల్లేశ్ ముఖంచూసి ఆగిపోయింది సుగుణ.

మల్లేశ్ తల బాగా క్రిందకు దించుకున్నాడు

'మల్లేశ్! బీదరికం పాపంకాదు! అభిమానంగా భావించవలసిన సంగతికాదు

నువ్వలా తల దించుకోకు!' అనుకుంది సుగుణ తనలో తను. కానీ, మల్లేశ్ ముఖంచూస్తూ పైకి ఏమీ అనలేకపోయింది.

మొదటినుంచీ మల్లేశ్‌ని అభిమానిస్తున్న మాస్టారు మల్లేశ్‌కు అభయ మిచ్చారు. "నువ్వు చదువుకో మల్లేశ్! నీ ఖర్చులు నేను భరిస్తాను" అన్నారు. మల్లేశ్ ఆనందానికి పట్టపగ్గాలు లేవు. సుగుణ, రమేష్, మల్లేశ్ ముగ్గురూ కాలేజీలో చేరడానికి బయలుదేరారు. రైలు వచ్చేవరకూ సుగుణా రమేశ్‌తో కలిసి వెళ్తున్నానని పొంగిపోయిన మల్లేశ్ హృదయం రైలు రాగానే ఒక్క సారిగా కృంగిపోయింది. సుగుణా రమేష్‌లు ఫస్ట్‌క్లాస్‌లో కూచున్నారు మల్లేశ్ థర్డ్‌క్లాస్‌లో కూచోవలసి వచ్చింది రైలు కదిలింది.

## 4

థర్డ్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో నిలబడటానికి కూడా చోటులేకుండా కిక్కిరిసి పోయి ఉన్నారు నోరుగలవాడిది రాజ్యం తోసుకుని లోపలికెళ్ళి సీట్ సంపాదించుకుని కూర్చున్నాడు మల్లేశ్...అతని మనసంతా ఎలాగో ఉంది తన పక్కనే ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో ప్రయాణం చేస్తోన్న రమేశ్, సుగుణ చీటికీ మాటికీ గుర్తొచ్చి మరింత చికాకుపెడుతున్నారు. ఏదో స్టేషన్‌లో రైలాగింది తలా గెడ్డం మాసి, నలిగిపోయిన బట్టలతో బికారిలా ఉన్న మనిషి రైలెక్కాడు. అతని ముఖం చాలా అలసటగా ఉంది. నిలబడలేనట్లుగా తూలుతున్నాడు. మల్లేశ్ దగ్గిర నిలబడి "ప్లీజ్! నిలబడలేకుండా ఉన్నాను కొంచెంసేపు మీ సీటిస్తారా?" అన్నాడు మల్లేశ్ కంపరంగా చూసాడు. "సారీ! నేనూ నిల బడలేను," అన్నాడు చికాగ్గా...ఆ వ్యక్తి మరేమీ మాట్లాడలేదు అనుకోకుండా క్రిందకు చూసిన మల్లేశ్ అక్కడ రక్తం చారికలు చూసి తెల్లబోయాడు. ఆ రక్తం ఆ వ్యక్తి కాలునుండే స్రవిస్తోంది

"మీ కాలునుండి రక్తం..." అన్నాడు కంగారుగా...ఆ వ్యక్తి స్థిరంగా నిలబడి నిర్లక్ష్యంగా నవ్వుతూ "అవును, దెబ్బలు తగిలాయి" అన్నాడు.ఆ వ్యక్తి ఆకారం ఎంత బికారిగా ఉన్నా ఆ ముఖంలో ఏదో ధీరత్వం ఉట్టిపడుతూ ఉండటం మొదటిసారిగా గమనించాడు మల్లేశ్. చటుక్కున లేచి నిలబడి "కూచోండి!" అన్నాడు. ఆ వ్యక్తి వెంటనే కూచోకుండా "ఫరవాలేదు. నేను కష్టం ఓర్చుకోగలను. కూచోండి!" అన్నాడు మల్లేశ్ చాలా సిగ్గుపడ్డాడు. "నేను మీ గాయాన్ని చూడలేదు. చూస్తే అలా మాట్లాడేవాడిని కాను" అన్నాడు.

ఆ వ్యక్తి ఆదరంగా నవ్వాడు. కూచున్నాడు. "ఏమీ అనుకోకండి!" అన్నాడు మల్లేశ్ మళ్ళా నొచ్చుకుంటూ...

ఆ వ్యక్తి నవ్వి "కొందరు మొదట తెలుసుకోలేరు నిదానంగా అర్థంచేసు కుంటారు మీ రాజాతికి చెందిన మనిషిలా కనిపిస్తున్నారు" అన్నాడు

తరవాత యాధాలాపంగా "ఎక్కడికి వెళ్తున్నారు" అని అడిగాడు ఆ వ్యక్తి...

"మా నాన్న పాలేరు అయినా నా అదృష్టంబాగుండి నన్ను బళ్ళోవేశాడు. నాకు బాగా చదువు అబ్బింది. ఇంకా ఇంకా పైకి చదవాలని ఆశకలిగింది. కానీ డబ్బులేదు సహాయం చేసేవాళ్ళు లేరు. ఒక మాస్టార్ సహాయంతో ప్రస్తుతం కాలేజీలో చేరబోతున్నాను. ముందు ముందు ఏమవుతుందో?''

ఆ వ్యక్తి కొంచెంసేపు ఆలోచించి "మీ దగ్గర పేపర్, పెన్ ఉంటే ఇవ్వండి" అన్నాడు. మల్లేశ్ తన సంచిలోంచి ఒక కాగితమూ జేబులోంచి పెన్ తీసిఇచ్చాడు... ఆ వ్యక్తి ఏదో రాసాడు ఆ ఉత్తరం మల్లేశ్ చేతిలో పెట్టి "దీనిని హైదరాబాదులో రావుగారి అమ్మాయి జానకికి ఇవ్వండి మీకు తప్పకుండా సహాయం లభిస్తుంది. ఎంతవరకైనా చదువుకోగలరు" అన్నాడు రావుగారు వ్యాపారస్థుడనీ...బాగా డబ్బున్నవాడనీ చెప్పి అతని అడ్రస్ కూడా ఇచ్చాడు మల్లేశ్‌కు అంతా అయోమయంగా తోచింది...ఇంత బికారిలా ఉన్న ఈ వ్యక్తికీ కోటీశ్వరుడు రావుగారి అమ్మాయికీ సంబంధమేమిటో? అంతటి ఆత్మీయమైన సంబంధమే ఉంటే ఇతను ఇలా ఎందుకుండవలసి వచ్చింది? 'తనకు దూర కంతలేదు కాని మెడకొక డోలన్నట్లు' దీనమైన స్థితిలో థర్డ్‌క్లాస్‌లో ప్రయాణంచేస్తున్న ఈ వ్యక్తి రికమెండేషన్ తనను ఉద్ధరిస్తుందా? మల్లేశ్ అనుమానాలు అర్థంచేసుకున్నట్లు ఆ వ్యక్తి మల్లేశ్‌భుజంపై చెయ్యివేసి నవ్వుతూ "లేనిపోని అనుమానాల్లోపడి ఆ ఉత్తరం పారేసుకోకండి! ప్రయత్నించి చూడండి! నష్టమేముందీ?" అన్నాడు. కొంత నిర్లక్ష్యంగానే ఆ ఉత్తరం జేబులో పెట్టుకున్నాడు మల్లేశ్...ఎవరో లేవటంతో ఆ చోట్లో కూచు న్నాడు కొద్దిగా కునుకుపట్టింది మల్లేశ్‌కు. మెలకువ వచ్చేసరికి ఆ వ్యక్తి లేడు.

రావుగారి అడ్రస్ ప్రకారం వెతుక్కుంటూ ఆ ఇంటికి వెళ్ళాడు మల్లేశ్... ఇంద్రభవనంలాంటి ఆ ఇల్లూ, ఆ ఇంట్లో అడుగడుగునా తొణికిసలాడే ఐశ్వర్యం చూసి అతనికి మతిపోయింది. ఎవరో నౌకరు గద్దిస్తున్నట్లు "ఏం కావాలి?" అనేసరికి నిలువునా వణుకుతూ "జానకిగారి కోసం!" అన్నాడు...

ఆ నౌకరు మల్లేశ్‌ని ఒకసారి ఎగాదిగా చూసి "కూచో!" అని లోపలికి వెళ్ళాడు అంత పెద్దఇంట్లో సోఫామీద కూచోడం మల్లేశ్‌కి అదే మొదటి సారి అతనికేదో వింతగా తోచింది మొదట ముడుచుకు కూచున్నాడు. ఆ తరువాత ఆ సోఫామెత్తదనం అతణ్ని ఆకర్షించింది. ఆ మెత్తదనాన్ని మనసారా అనుభవిస్తూ ఒక్కసారి ఎగిరి మళ్ళీ కూచున్నాడు అప్పుడే ఇంట్లోంచి దగ్గిర దగ్గిర ముప్ఫైయేళ్ళ యువతి బయటకు వచ్చింది. తన చర్య చూసిందేమోనని మల్లేశ్ సిగ్గుపడ్డాడు కాని, ఆవిడ అదేదీ గమనించినట్లులేదు. ఆవిడ చూపులు ఈ లోకంతో నిమిత్తం లేని దేనినో వెతుకుతున్నట్లుగా ఉన్నాయి.

"నాతో ఏంపని మీకు?" అంది నెమ్మదిగా...ఆవిడే జానకి అని అర్థం చేసుకున్నాడు...కంగారుగా జేబులో ఉత్తరం తీసి ఇచ్చాడు .. ఆ ఉత్తరం చదువుతూండగానే జానకిముఖంలో కోటికాంతులు మెరిసాయి. "ఈ ఉత్తరం మీ కెవరిచ్చారు? ఎప్పుడిచ్చారు?" అంది. మల్లేశ్ చెప్పాడు జానకి ఒక్క నిట్టూర్పు విడిచింది లోపలికెళ్ళి రెండు వందలు తెచ్చి మల్లేశ్ చేతిలో పెట్టి "ఇది తీసికెళ్ళు నేను నీకు సహాయంచేస్తాను కానీ లెక్క చెప్పాలి! ఎందుకు ఖర్చుపెడుతున్నావో చెప్పాలి!" అంది

ఆశ్చర్యంతో, ఆనందంతో తల మునకలయిపోతూ తల ఊపాడు మల్లేశ్

"నువ్వు ఈ ఇంటికి ఎప్పుడైనా రావచ్చును!" మళ్ళీ తల ఊపాడు

"నువ్వు చేసిన మేలు మరిచిపోలేను!"

"నేనేం చేసాను?" అన్నాడు తడబడుతూ...

"నువ్వేంచేసావో నీకు తెలియదు. నాకుతెలుసువెళ్ళు!"అన్నది జానకినవ్వుతూ.

మల్లేశ్ ఆనందానికి అంతులేదు తనకు అండ లభించింది తను చదువుకో గలడు

సుగుణ ఆడపిల్లల కాలేజీలో చేరింది కాలేజీ హాస్టల్లోనే ఉంటుంది. మల్లేశ్ కావాలని రమేష్ చేరిన హాస్టల్లోనే చేరాడు. కాలేజీ కూడా ఇద్దరిదీ ఒకటే! మల్లేశ్ ఆశించినట్లు రమేష్ ఆశ్చర్యపోయాడు కానీ ఆ ఆశ్చర్యంలో ఆనందం కూడా ఉంది

"మల్లేశ్! నువ్వు కూడా ఇదే హాస్టల్లో చేరటం నాకు చాలా సంతోషంగా ఉంది నా పుస్తకాలూ, అవీ, ఏం కావాలన్నా నీకిస్తాను" అన్నాడు స్నేహంగా.

మల్లేశ్ నిర్లక్ష్యంగా, పొగరుగా "థాంక్స్! కానీ నాకు ఏ అవసరమూ లేదు. కావాలంటే నేనే నీకు సహాయం చెయ్యగలను" అన్నాడు. రమేష్ తెల్లబోయి

చూశాడు. ఆ ఆశ్చర్యం గమనించి కసిగా నవ్వుకున్నాడు మల్లేశ్. రమేష్ అంతలోనే తేరుకుని "థాంక్యూ !" అని మల్లేశ్ చేతిని స్నేహంగా ఊపి వెళ్ళిపోయాడు. మల్లేశ్ కేదో వెలితిగా తోచింది తను ఎందుకో రమేష్‌లా ఉండలేక పోతున్నాడు.

ఒకరోజు మల్లేశ్ చదువుకుంటూ ఉండగా రమేష్ వచ్చి "నిన్ను సుగుణ అడిగానని చెప్పమంది" అన్నాడు మల్లేశ్ కుతూహలంగా "నువ్వు సుగుణ దగ్గిరకు వెళ్ళావా ?" అన్నాడు.

"అదేమిటి ? నేను సుగుణ దగ్గిరకు వెళ్ళకుండా ఎలా ఉంటాను ? ప్రతివారం వెళ్తాను." అతి మామూలుగా అన్నాడు రమేష్. మల్లేశ్ మళ్ళీ మాట్లాడలేదు. "నేను కూడా సుగుణని చూడటానికి వస్తాను" అనలేకపోయాడు.

మరొక రోజు రమేష్ ఏవేవో మిఠాయిలు తెచ్చి "ఇవి నీకు ?" అన్నాడు మల్లేశ్‌తో. మల్లేశ్ పెడసరంగా "నాకు అక్కర్లేదు." రమేష్ కొంచెం నొచ్చుకొని "పాపం, సుగుణ బాధపడుతుంది !" అన్నాడు ఆ మాటలు వినగానే మల్లేశ్ ముఖభంగిమలు మారిపోయాయి... "ఇవి సుగుణ పంపిందా ?" అన్నాడు ఆప్యాయంగా అవి అందుకున్నాడు. రమేష్ విచిత్రంగా చూశాడు "వచ్చే ఆదివారం సుగుణ దగ్గిరికి నువ్వు రాకూడదూ !" అన్నాడు

తబ్బిబ్బైపోయాడు మల్లేశ్. "నేనూ రావచ్చునా ?" అన్నాడు

"ఎందుకు రాకూడదూ ? మనం ముగ్గురం స్నేహితులమేగా !" అన్నాడు ఆశ్చర్యంగా రమేష్...

రమేష్ మాటలు...అతి సహజంగా రమేష్ మాట్లాడే మాటలు తన కెందుకు వింతగా వినిపిస్తాయో అర్థంకాదు మల్లేశ్‌కి

తనను ఒక్కసారిగా అయిదువందలు అడుగుతోన్న మల్లేశ్‌ని ఆశ్చర్యంగా చూసి "ఎందుకూ ?" అంది జానకి మల్లేశ్ చాలా సిగ్గుపడ్డాడు జానకి చాలా దయగా ఉంటుంది. అడిగినప్పుడంతా కాదనకుండా సహాయం చేస్తోంది ! అయినా ఆ దయను దుర్వినియోగం చేసుకోలేదు మల్లేశ్...ఇప్పుడు జానకి ఇలా అడుగుతుంటే కారణం చెప్పటానికి అతనికి చాలా సంకోచం కలిగింది.

"సూట్ కుట్టించుకోవాలనుకుంటున్నాను !" జానకి నవ్వుతూ "ఏమిటంత సూట్ వేసుకోవలసిన సందర్భం ?" అంది.

"ఒక స్నేహితుణ్ని కలుసుకోబోతున్నాను" జానకి పకపక నవ్వింది ..

' స్నేహితుడి దగ్గిరకయితే సూట్ అక్కర్లేదు స్నేహితురాలి దగ్గిరకయి ఉండాలి."

వంచిన తల ఎత్తలేకపోయాడు మల్లేశ్... జానకి డబ్బు తెచ్చి ఇచ్చింది. డబ్బు అందుకుని ఆ ప్రసన్నమందహాసం చూస్తూ చేతులు జోడించాడు మల్లేశ్...

ఫుల్‌సూట్‌లో తయారయిన మల్లేశ్‌ని వింతగా చూసాడు, మామూలు కాటన్ పేంట్‌లో ఉన్న రమేష్ ఆ చూపులు చాలా హాయిగా అనిపించాయి మల్లేశ్‌కి..."నువ్వూ సూట్ వేసుకోరాదూ!" అన్నాడు హుషారుగా...రమేష్‌కు నాలుగయిదు సూట్లు ఉన్నాయని మల్లేశ్‌కి తెలుసు...

"దేనికైనా తగిన సందర్భం ఉండాలి! సుగుణదగ్గిరకి వెళ్తూ సూట్‌దేనికి?"

ఈ మాటలతో మల్లేశ్ పొంగుమీద కొంతవరకు చన్నీళ్ళు జల్లినట్లయింది.

సుగుణ రమేష్‌నీ, మల్లేశ్‌నీ ఇద్దరినీ ఎంతో ఆదరంగా ఆహ్వానించింది. మామూలు వాయిల్ చీరలో అతి నిరాడంబరంగా ఉంది...సుగుణ కూడా మల్లేశ్ సూట్‌వంక ఒకటికి రెండుసార్లు విచిత్రంగా చూసింది. ఈసారి ఆ చూపులు మల్లేశ్‌కి ఆనందం కలిగించలేదు ముడుచుకుపోయేలాగ చేసాయి... హాస్టల్లో రూంకి రాగానే సూట్ విప్పేసి దానికేసి చూస్తూ పడుకున్నాడు. దీనిని చూస్తున్నకొద్దీ తన మూర్ఖత్వం మరింత, మరింతగా ప్రత్యక్షమవుతున్నట్లు తోచసాగింది అయిదువందల రూపాయలు! తనటోటివాడి దగ్గిర ఆ డబ్బు ఎన్ని అవసరాలకు ఆదుకునేది!

బి ఏ ఫైనల్ ఇయర్‌లోకి వచ్చాడు మల్లేశ్. అప్పటివరకూ అతనికి హాయిగానే గడిచింది. సరిగ్గా పరీక్షలు దగ్గిరపడుతున్న రోజులలో జానకికి మెంటల్ షాక్ వచ్చింది తల్లిలేని పిల్ల అని జానకిని అతి గారాబంగా పెంచుతున్న రావుగారు దీనికి తట్టుకోలేకపోయారు...జానకి ట్రీట్‌మెంట్ కోసం జానకితో సహా విదేశాలకు వెళ్ళిపోయారు

మల్లేశ్ దగ్గర డబ్బులేదు. ఆదుకునేవారు లేరు. ఫైనల్ ఇయర్‌లో చదువాగిపోతే చదివినదంతా వృధా! అతి కష్టంమీద ట్యూషన్లు కుదుర్చుకున్నాడు కానీ ఆ డబ్బు ఏ మూలకి! అయిదు వందలకి కొన్న సూట్ అతి కష్టంమీద నూరు రూపాయలకి అమ్మగలిగినప్పుడు...అతనికి నవ్వూ ఏడుపూ ఒక్కసారిగా



వచ్చాయి. ఒక్క క్షణం దర్జాకోసం అయిదు వందలు ఖర్చుపెట్టాడు...ఇప్పుడు తన అవసరానికి వందరూపాయలు సంపాదించుకోలేకపోతున్నాడు!

పరీక్ష ఫీజ్ కట్టాలి! ఎంత ప్రయత్నించినా డబ్బు సంపాదించలేకపోయాడు. రమేష్‌ని అడిగితే ఇస్తాడు. కానీ తనకు తానై సహాయంచేస్తానని వచ్చిన వ్యక్తిని పొగరుగా తిరస్కరించాడు ఇప్పుడు ఏ ముఖం పెట్టుకుని అడగగలడు ?

ఫీజ్ కట్టవలసిన ఆఖరు తేదీ దాటిపోయింది. మల్లేశ్ కృంగిపోయాడు. అతని ఆశలన్నీ నీరుకారిపోయాయి సరిగ్గా ఆ సమయంలో మనియార్డరు, మాస్టారి ఉత్తరమూ వచ్చాయి. "నువ్వు ఇబ్బందులలో ఉన్నట్టు తెలిసింది ప్రస్తుతం నా దగ్గిరా ఎక్కువ డబ్బులేదు. పరీక్ష ఫీజ్‌కి సరిపడినంత పంపుతున్నాను. పరీక్ష ఫీజ్ కట్టి పరీక్షకి కూచో..." అని

పరీక్ష ఫీజ్ మాత్రమే కాదు ఫైన్ కూడా కట్టాలి. యాభై మందిని అప్పడిగితే, అయిదుగురు దయతలిచి ఇచ్చారు పరీక్షకి కూచోగలిగినప్పుడు... పరీక్షలు చక్కగా రాస్తునప్పుడు...మాస్టారికి కొన్ని కోట్లసార్లు మనసులో నమస్కారం చేసుకున్నాడు మల్లేశ్.

పరీక్షలయిపోగానే మల్లేశ్, రమేష్,సుగుణ ముగ్గురూ స్వగ్రామం చేరుకున్నారు

అప్పటికి పరిస్థితుల్లో చాలా మార్పులు వచ్చాయి...చక్రపాణిగారి కుటుంబం లేనిపోని దర్జాలకు పోయి బాగా చితికిపోయింది ఈ వార్త విన్నప్పుడు మల్లేశ్‌కి సంతోషమే కలిగింది తనలో కలిగిన ఈ సంతోషాన్ని మాత్రం అణచుకోలేకపోయాడు

కావాలనే చక్రపాణిగారి ఇంటికి వెళ్ళాడు మల్లేశ్ చక్రపాణిగారు బోళా మనిషి... "రా! రా! ఎంతవాడియ్యావ్!" అంటూ ఒకలా అభిమానంగా మాట్లాడారు. ఆయన ఎంత అభిమానంగా మాట్లాడినా మల్లేశ్ మనసులో మెదులుతున్నది మాత్రం ఆనాడు తనను స్థంభానికి కట్టేసి కొడుతున్న దృశ్యమే! సాధ్యమయినంత పొగరుగా అహంకారంగా మాట్లాడాడు! పాపం, చక్రపాణిగారు అదేదీ అర్థంచేసుకోలేదు సుగుణ లోపలినుంచి కాఫీ తీసుకొచ్చి మల్లేశ్‌కి అందించినప్పుడు మాత్రం అప్రయత్నంగా సిగ్గుపడ్డాడు

రమేష్ మళ్ళీ హైదరాబాద్ వెళ్ళి లా చదవటానికి నిర్ణయించుకున్నాడు సుగుణ బి. యిడి. లో చేరాలనుకుంది. కుటుంబ పరిస్థితు లలా వచ్చాయి చక్రపాణిగారు చితికిపోయారని విన్నప్పుడు కలిగిన ఆనందం సుగుణ తప్పని సరిగా బి. యిడి. చదువుతోందని తెలిసినప్పుడు కలగలేదు మల్లేశ్‌కి...మల్లేశ్ కూడా రమేష్‌లాగే లా చదవలనుకున్నాడు రమేష్ కంటే గొప్ప లాయర్‌నని నిరూపించుకోవాలి! అదీ అతని తపన. కానీ డబ్బు? మళ్ళీ మాస్టారినే అడిగాడు మామూలు మధ్యతరగతి కుటుంబీకుడయిన మాస్టారు ఒక పరాయి వ్యక్తికి ఇంత సహాయం ఎలా చెయ్యగలరనే ఆలోచన రాలేదు! అతని స్వార్థం అలాంటిది!

మల్లేశ్ ఆలోచన విని మాస్టారు తెల్లబోయాడు "బి. ఏ. పాసయ్యావు కదా! ఏదైనా ఉద్యోగంలో చేరరాదూ!" అన్నాడు.

"నేను చదవాలి మాస్టారూ! నేనూ లా చదవాలి. అందరికంటే గొప్ప లాయర్‌నని రుజువుచేసుకోవాలి!"

''ఇప్పుడే ఏంచెప్పలేను ప్రయత్నిస్తాను" అన్నారు మాస్టారు

మాస్టారి సమాధానంకోసం నిముష మొకయుగంగా ఎదురు చూసాడు మల్లేశ్

"మల్లేశ్! నేను సాయంచేస్తాను. కానీ నువ్వు చాలా జాగ్రత్తగా గడుపుకోవాలి!'' అన్నారు మాసారు.

పట్టరాని ఆనందంతో మాస్టారి కాళ్ళమీద వాలిపోయాడు మల్లేశ్
మాస్టారు ఏదో అస్పష్టంగా ఆశీర్వదించారు.

## 5

రావుగారు, జానకి వచ్చారని విని ఎంతో ఆనందంతో జానకిని చూడటానికి వెళ్ళాడు మల్లేశ్...కానీ జానకి స్థితి చూడగానే అతనికి కళ్ళలో నీళ్ళు తిరిగాయి-జానకి ఈ లోకంలో లేదు ఆవిడకు వర్తమానంతో ఏవిధమయిన సంబంధమూలేదు. అహర్నిశమూ గతంలోకే జారిపోయింది ఆ కళ్ళు మధుర లోకాలలో తేలిపోతున్నట్లు అరమోడ్పులుగా ఉంటాయి తనలో తను నవ్వు కుంటుంది. ఉండుండిమాత్రం ఏదో భయపడినట్లు ఉలికిపడుతుంది. యాంత్రికంగా కాలకృత్యాలు నిర్వహించుకుంటుంది. అంతే! ఎదుటిమనుష్యుల్ని గుర్తించలేదు-ఎవరు ఏంమాట్లాడినా ఆవిడ మనసుకెక్కదు తనలో తను ఏవేవో మాట్లాడుకొంటుంది

"చూడు! నన్ను వదిలి ఉండనన్నావు! ఎందుకు వెళ్ళిపోయావు? మళ్ళీ ఎప్పుడొస్తావు?"

"నాకు తెలుసు నువ్వు వస్తావని! మాట తప్పడం నీ లక్షణం కాదు! వస్తావు! తప్పకుండా వస్తావు? ఎప్పుడు? ఎప్పుడు? ఎప్పుడు?..."

ఇలా ఎవరికీ అర్థంకాని మాటలు మాట్లాడుతుంది. తన ఒక్కగానొక్క కూతురి దురవస్థ చూసి రావుగారు చాలా కృంగిపోయారు మల్లేశ్ రావుగారినే సహాయం కోరాలనుకున్నాడు కాని, నౌకరు అతనిని రావుగారి దరిదాపులకు రానియ్యలేదు అసలు రావుగారిని కలుసుకోవటమే సాధ్యం కాలేదు మల్లేశ్‌కి.

మల్లేశ్ చాలా శ్రద్ధగా చదవసాగాడు-సహజంగా తెలివైనవాడు దానికి తోడు పట్టుదల, శ్రద్ధ అంచేత చదువులో బాగా రాణించగలుగుతున్నాడు మాస్టారు డబ్బు పంపుతున్నారు దానిని అతి జాగ్రత్తగా వాడుకుంటున్నాడు

రమేష్ కూడ తెలివైనవాడే! కానీ అతడు చదువుతోపాటు ఇతర కార్యకలాపాలు కూడా పెట్టుకున్నాడు యువజన సంఘంలో చేరాడు ఆ సంఘం ముఖ్య కార్యకర్తలలో ఒకడయ్యాడు మైనారిటీస్ తరఫునా, బలహీనర్గాల తరఫునా పనిచెయ్యటం ఆ సంఘ ప్రధానోద్దేశం......

కూలీలతరఫున మేనేజ్‌మెంట్‌ను ఎదుర్కొని అన్యాయాలు జరగకుండా చూడటం...అలగాజనంలో అంతటా చదువు సంస్కారాలు అభివృద్ధి పొందేలా చూడటం...ఇలాంటివన్నీ యువజనసంఘ కార్యక్రమాలు ఇంతేగాక సంఘంలో

జరిగే అన్యాయాలను బయటపెట్టడంలో కూడా యువజన సంఘం శ్రద్ధ తీసుకుంటుంది అది ఒక పత్రికకూడా నడుపుతోంది. దీనిపేరు స్వాతంత్ర్య దీపిక...ఏ షాపులో ఏ ఆహార పదార్థాలలో కల్తీ ఉందో ఏ యే మందుల కంపెనీలు కల్తీ మందులు అమ్ముతున్నాయో, ఎక్కడెక్కడ ఎవరెవరు ఎలాంటి అక్రమ వ్యాపారాలు చేస్తున్నారో, ఏయే ఆఫీసర్లు ఏయే విధానాలలో లంచాలు పడుతున్నారో-అన్నీ ఆ పత్రికలో వస్తాయి. యువజనసంఘ కార్యకర్తలు ఔత్సాహికులయిన యువకులు. సంఘంలో అన్యాయాలను నిర్మూలించాలని కంకణం కట్టుకున్న వాళ్ళు...ముఖ్యంగా సమాజంలో ఉన్న ఆర్థిక వ్యత్యాసాలను తొలగించే అందరికీ కనీసం కనీసావసరాలు తీరేలా చూడాలని పాటుపడుతున్న వాళ్ళు...

మల్లేశ్ యథాలాపంగా రమేష్‌ని "మీ 'యువజన సంఘం' ఏం సాధించాలనుకుంటోంది?" అని అడిగాడు...రమేష్ ఉత్సాహంగా తమ సంఘం ఆదర్శాలన్నీ వివరించి "నువ్వూ చేరరాదూ!" అన్నాడు మల్లేశ్‌తో

మల్లేశ్ ముఖం చిట్లించి "సారీ! నాకంత తీరుబడి లేదు నేను చదువుకోవాలి!" అన్నాడు.

రమేష్ ఆశాభంగం పొందినట్లు "నువ్వు తప్పకుండా మాతో చేరతావని ఆశపడ్డాను" అన్నాడు

మల్లేశ్ ముఖం జేవురించింది

"ఎందుకూ? నేనుకూడా కూలివాణ్నే గనుక...కదూ!..."

రమేష్ మల్లేశ్‌ని ఆశ్చర్యంగా చూసాడు...

"కాదు! ఆ మాటకొస్తే మా సంఘంలో పనిచేసేవాళ్ళలో చాలామంది గొప్ప కుటుంబాలలోని యువకులే! మంచి, మానవత్వం ఉన్నవారందరూ మా సంఘానికి అండగా నిలబడతారనే నమ్మకం నాకుంది అంచేత నువ్వూ మాతో చేరతావని అనుకున్నాను..."

మల్లేశ్ మాట్లాడలేకపోయాడు. రమేష్ మాట లెప్పుడూ ఇంతే! మల్లేశ్ అంతరాంతరాలలో దేనినో స్పృశించి లేపుతాయి. మల్లేశ్‌ను ముడుచుకుపోయేలాగ చేస్తాయి.

రమేష్‌తో సంఘంలో చేరనని చెప్పినా, సంఘ కార్యక్రమాలలో భాగం తీసుకోవాలని లేకపోయినా, మల్లేశ్‌లో యువజన సంఘంపట్ల ఏదో కుతూహలం

పెరగసాగింది. ఒకసారి రమేష్‌తో "నేనూ మీ సంఘానికి వస్తాను'' అన్నాడు. రమేష్ సంతోషంగా తీసికెళ్ళాడు.

మల్లేశ్ రమేష్‌లు సంఘానికి వెళ్ళేసరికి అక్కడి యువకులతో మాట్లాడుతూ మంత్రి జగదీశ్ కూడా ఉన్నాడు మల్లేశ్ ఆశ్చర్యంగా "మంత్రి జగదీశ్!" అన్నాడు...రమేష్ నవ్వి "అంత ఆశ్చర్యం దేనికి? మంత్రి జగదీశ్‌గారు 'ఇందుగలడందులేడని...' సందేహం లేకుండా సర్వత్రా ఉంటారు. మాతో ఉంటారు, కూలీలతో ఉంటారు, వ్యాపారస్థులతో ఉంటారు. క్లబ్బులలో ఉంటారు. గుళ్ళలో ఉంటారు. గుడిసెల్లో ఉంటారు. ఎక్కడ చూసినా ఆశ్చర్య పడక్కర్లేదు!" అన్నాడు...

మల్లేశ్ జగదీశ్‌గారిని చూస్తూ అలాగే నిలబడిపోయాడు. జగదీశ్‌గారి కథ అంతా విచిత్రంగా చెప్పుకుంటారు. జగదీశ్ తండ్రి కూడా గొప్ప వ్యాపారస్థుడు, లక్షాధికారి. కానీ జగదీశ్ చిన్నప్పటినుండే తండ్రి చెప్పుచేతల్లో ఉండకుండా అల్లరి చిల్లరగా తిరిగేవాడు. తండ్రి బుద్ధి చెప్పబోయినా వినిపించుకోలేదు చివరకు తండ్రికి చెప్పకుండా జగదీశ్ ఇంట్లోంచి పారిపోయాడు. దగ్గర దగ్గర పది సంవత్సరాలు తండ్రికి దొరక్కుండా తప్పించుకు తిరిగాడు బికారిలా. చివరికు బుద్ధి తెచ్చుకుని తండ్రి దగ్గిరకే చేరుకున్నాడు. కానీ, అప్పటికే జగదీశ్‌కి ఏక్సిడెంట్‌లో రెండు కళ్ళు దెబ్బతిన్నాయి అతి దగ్గిరవి తప్ప చూడలేడు ఎండ అసలు పడదు. లావుపాటి నల్ల కళ్ళద్దాలు అతని ముఖంలో సగం భాగాన్ని కప్పివేస్తూ ఉంటాయి. కంఠం కూడా దెబ్బతింది. అతని మాటలు సహజంగా పలుకుతున్నట్లుగా ఉండవు...గెడ్డాలూ మీసాలతో ముఖం మాత్రం మహర్షి ముఖంలా ఉంటుంది. మిగిలిన వేషమంతా ఆధునికమే! తండ్రి పలుకు బడితో...అండదండలతో రాజకీయాలలో చేరి త్వరలోనే మంత్రి కాగలిగాడు. మంత్రి అయిన తరువాత రాజకీయ చరిత్రనే మార్చివేసాడు. అంతటి సమర్థు డయిన మంత్రి లేడనిపించుకున్నాడు. రెండు కళ్ళు కనపడని ఆ వ్యక్తి చూడ లేని సంగతంటూ లేదు. జగదీశ్ బయటపెట్టిన అన్యాయాలను కాదనలేక ఎంత మందో ఆఫీసర్లు చడీచప్పుడు లేకుండా రాజీనామాలు చేసారు. జగదీశ్ రుజువుచెయ్యగలిగిన నేరాలను తప్పనిసరిగా ఒప్పుకుని ఎందరో వ్యాపారస్థులు జరిమానాలు చెల్లించుకున్నారు మరెందరో కస్టడీలలోకి తీసుకోబడ్డారు. పాంచ భౌతికమయిన శరీరం కంటె మనోదృఢము ఎంత గొప్పదో నిరూపించే ప్రత్యక్ష నిదర్శనం జగదీశ్. సాధారణంగా ఎవరైనా మంత్రి అయితే సొంత ఆస్తి పోగు

చేసుకుంటారు. జగదీశ్ అలా చెయ్యకపోగా తన తండ్రి సంపాదించినదానిని సహితం తన కార్యకలాపాలకు ఖర్చుపెట్టసాగాడు. కొందరు స్వార్థపరులు ద్వేషించినా మొత్తంమీద జనులందరికీ జగదీశ్‌వట్ల అంతులేని గౌరవాదరాలున్నాయి

రమేష్ దగ్గిరగా వెళ్ళి జగదీశ్‌తో "నమస్కారమండీ!" అన్నాడు

జగదీశ్ ఆదరంగా నవ్వి రమేష్ భుజం తట్టాడు. రమేష్ "ఇతడు నా మిత్రుడు. మల్లేశ్," అని మల్లేశ్‌ని పరిచయం చేసాడు.

జగదీశ్ "ఓహ్!" అని మాత్రం అన్నాడు.

సుగుణ బి. యి డి. పూర్తిచేసి టీచర్‌గా ఉద్యోగంలో జాయినయింది చక్రపాణిగారి పరిస్థితి బాగా చితికిపోయింది...సుగుణను రమేశ్ కియ్యాలని మొదటినుంచీ అనుకుంటున్నదే! అయినా రమేష్ తలిదండ్రులు పదివేలు కట్నం అడిగారు. చక్రపాణిగారు ఆ మాత్రం కూడా ఇచ్చుకోలేని దశకు దిగజారిపోవటంతో సుగుణా రమేశ్‌లకు పెళ్ళి జరగలేదు.

మల్లేశ్, రమేష్‌లు 'లా' పూర్తిచేసారు. రమేష్ 'యువజన సంఘం' కార్యకర్తల్లో ఒకడుగానే ఉండి యువజనసంఘం తరఫున లాయర్‌గా ఉండటానికి నిశ్చయించుకున్నాడు డబ్బుకోసం చూడకుండా కూలీలకూ, యువజనులకు వచ్చే కేసుల్లో కూలీల తరఫున పనిచేసి వాళ్ళకు అన్యాయం జరగకుండా చూడటానికి పూనుకున్నాడు.

కట్నంకోసం మొదటినుంచీ అనుకున్న సుగుణను చేసుకోనన్న రమేష్ డబ్బుకు ఆశించకుండా కూలీల తరఫున పనిచెయ్యటం విడ్డూరంగానే తోచింది మల్లేశ్‌కి

మల్లేశ్ ఆశలు వేరు. తనకు తెలివితేటలున్నాయి సామర్థ్యం పొంది, గొప్ప లాయర్ కాగలడు తాను గొప్ప లాయర్‌నని నిరూపించుకునే అవకాశం రావాలి ఏ రంగంలోనైనా ప్రతిదీ చాలాభాగం 'పేరు' మీద ఆధారపడి ఉంటుంది. డబ్బు పెట్టుబడి పెట్టగలవాళ్ళు సాధారణంగా పేరు ప్రఖ్యాతులున్న పెద్ద లాయర్లదగ్గిరకు వెళ్తారు కాని తనబోటి కొత్త లాయర్ దగ్గిరకు రారు.

మల్లేశ్ ఒక మంచి లీడింగ్ లాయర్ దగ్గిర జూనియర్‌గా చేరాడు. ఆ లాయర్ మల్లేశ్ తెలివిని బాగా మెచ్చుకుంటున్నాడు. అయినా తాను కలలు

కనే జీవితం...చక్కని బంగళా...కారు. నౌకర్లు. అదిమాత్రం అప్పటికీ సుదూరంలోనే ఉంది మల్లేశ్ కి

బోనస్ విషయంలో వర్కర్స్ కు మేనేజ్ మెంట్ కి మధ్య వచ్చిన తగాదా ఒకటి మల్లేశ్ దగ్గరకొచ్చింది మేనేజ్ మెంట్ వర్కర్స్ కి బోనస్ ఇస్తానని వాగ్దానం చేసింది మేనేజర్ చదువురాని కూలీల దగ్గరనుంచి బోనస్ ఇచ్చినట్లుగా వేలిముద్రలు తీసుకున్నాడు, బోనస్ ఇయ్యలేదు ఇచ్చేశానన్నాడు. కూలీలు గోలపెట్టారు. కేస్ పెట్టాలనుకున్నారు మల్లేశ్ దగ్గరకొచ్చారు.

ఇది రుజువు చెయ్యటం కష్టమే! కానీ అక్కడ ఒక్క సంతకం కూడా లేదు అన్నీ వేలిముద్రలే అందరూ ఏకగ్రీవంగా మాకు బోనస్ ముట్టలేదంటున్నారు కేవలం ఈ సంఘబలమే ఆధారంగా కోర్టులో నిలబడాలి! మల్లేశ్ మేనేజ్ మెంట్ కి లీగల్ నోటీస్ పంపించాడు. ఇట్లాంటి విషయాలు బయటపడి అల్లరయితే కంపెనీ పరువుపోతుందని మేనేజ్ మెంట్ భయపడింది ఎవరికియ్యవలసినది వాళ్ళకియ్యటానికి సిద్ధపడింది ఇలాంటిది జరుగుతుందని ఊహించిన మల్లేశ్ ముందుగానే కూలీలను హెచ్చరించాడు "ఒకసారి లీగల్ గా నేను నోటీస్ పంపాక మీరు వాళ్ళకు లొంగిపోకూడదు ఇలాంటి అన్యాయాలు మళ్ళీ మళ్ళీ జరగకుండా కోర్టులో నిలబడాలి!" అని. అందరూ తలలూపారు కానీ డబ్బు చూసేసరికి అందరూ అన్నీ మరిచిపోయారు. మేనేజ్ మెంట్ డబ్బు ఇస్తానంటుంది! ఇయ్యవలసినదానికంటె ఇంకా ఎక్కువ ఇస్తానంటుంది. మరెందుకు తగాదా! అందరూ మల్లేశ్ తో సంప్రతించకుండానే డబ్బు తీసుకుని మేము కోర్టుకు రామని చెప్పేసారు. తీసుకోనిది ఒక్క చంద్రయ్య మాత్రమే!

ఆ మరునాడు చంద్రయ్య దీనమైన ముఖంతో మల్లేశ్ ముందు నిలబడ్డాడు

"మీరు డబ్బు తీసుకోవద్దన్నారు గదయ్యా! నేను తీసుకోలా! మల్లా మల్లా ఇట్టాంటియ్యి జరక్కుండా సూడాలంటే తీసుకోవద్దన్నారు. నేను వద్దన్నాను మిగిలినోళ్ళంతా తీసుకున్నారు నాకీ కాగితం ఇచ్చి పనిలోకి రావద్దన్నారు"

ఆ కాగితం తీసుకుని చదివాడు మల్లేశ్. . చంద్రయ్య ప్రవర్తన సరైనది కాకపోవటంవల్ల ఉద్యోగంలోంచి తీసేస్తున్నామని ఆర్డర్...

చంద్రయ్య ముఖంలోని నిజాయితీని, ఆ నిజాయితీని అంటిపెట్టుకుని ఉన్న దీనమైన నవ్వునూ చూస్తోంటే మల్లేశ్ మనసు కరిగిపోయింది

"చంద్రయ్యా! నీకేం ఫరవాలేదు నీ తరఫున కేసు వాదిస్తాను!" అన్నాడు

చంద్రయ్య ముఖం వికసించింది.

"ఇది చాలా వీక్ కేస్. వదిలెయ్యి." అన్నాడు సీనియర్. "ప్రయత్నిస్తాను సార్!" అన్నాడు మల్లేశ్ మల్లేశ్ ఆలోచనలో పడ్డాడు. ఈ కేస్‌వల్ల తనకు డబ్బు రాదు కానీ గెలిస్తే తనకు చాలా మంచిపేరు వస్తుంది, ఓడిపోయినా తన నెవరూ తప్పు పట్టరు.

మల్లేశ్ కేస్ స్టడీ చెయ్యటం మొదలుపెట్టాడు ఇదివరకు సంఘబలమైనా ఉండేది ఇప్పుడు అదికూడా లేదు. ఏమైనా ఈ కేస్ సాధించి తీరాలి

చంద్రయ్యను పిలిపించి వివరాలు సేకరించటం మొదలుపెట్టాడు... చంద్రయ్య చెపుతూ చెపుతూ మధ్యలో దిగాలుగా "ఆ రాములుగాడు బోనస్‌ను తలుచుకుంటూనే సచ్చాడయ్యా బోనస్ వస్తే కొడుక్కియ్యమన్నాడు. దొంగ సచ్చినోళ్ళు సచ్చినోడి నోట్లో కూడా మన్నుకొట్టారు!" అన్నాడు

ఈ వార్త వినగానే హుషారొచ్చింది మల్లేశ్‌కి...పరిశీలించాడు వేలి ముద్రలు తీసుకున్న లిస్ట్‌లో చచ్చిపోయిన రాములు పేరుకూడా ఉందని తెలుసుకున్నాడు ఆ ఒక్క పాయింట్ ఆధారంగా చంద్రయ్యను కోర్టులో గెలిపించాడు అందరూ మల్లేశ్‌ని ఎంతో ప్రశంసించారు. రమేష్ కంగ్రాట్యులేట్ చేసాడు.

ఆ రోజు మల్లేశ్ ఉంటున్న చిన్న అద్దె గదిలోకి వెతుక్కుంటూ వచ్చాడు మంత్రి జగదీశ్.

ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు మల్లేశ్......

"కంగ్రాట్స్! నీకు అద్భుతమైన ప్రజ్ఞ ఉంది దానిని వెనుకబడ్డ వాళ్ళకోసం వినియోగించగలిగే వివేకమూ ఉంది నువ్వు సంఘానికి ఎంతైనా మేలు చెయ్యగలవు!" ఆప్యాయంగా మల్లేశ్ భుజం తడుతూ అన్నాడు జగదీశ్

జగదీశ్ కంఠం సహజంగా లేకపోయినా ఆ కంఠంలో ఎంతో ఆదరం ధ్వనించింది.

ఒకనాడు జగదీశ్ ఆదరపూర్వకమైన నవ్వుకోసం తపించాడు మల్లేశ్ ఈనాడు అది అనుచితంగా లభించినా ఎందుకో ముడుచుకుపోతున్నాడు.

తను చంద్రయ్యకు సహాయంచేసింది వెనుకబడిన వాళ్ళను ఉద్ధరించటానికా. కాదు. ఆ రకంగా పేరు సంపాదించుకోవటానికి! ఆ పేరు ఆధారంగా తను కలలుగన్న గొప్ప జీవితం సాధించటానికి!

జగదీశ్ మన్నన అతనికి గర్వం కలిగించలేదు. దొంగ సన్యాసి వేషంలో కపట భక్తుడు అందుకునే పూజలా తోచి మరింత చిన్నబుచ్చింది.

కూలీలకూ యాజమాన్యానికి సంబంధించిన మరికొన్ని కేసులుకూడా మల్లేశ్ చాలా సమర్థంగా నిర్వహించాడు. రమేష్ ఈర్ష్య పడకపోగా ఎంతో మెచ్చుకున్నాడు. మల్లేశ్ బాగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు కొంత డబ్బు కూడా సంపాదించాడు

ఒకరోజు చక్రపాణిగారు కలిసారు. మల్లేశ్‌ను పొగుడుతూ బోళాగా మాట్లాడారు తన కష్టసుఖాలన్నీ చెప్పేసుకున్నారు.

"ఏమిటోనోయ్! ఒకప్పుడంత బతుకు బతికి చివరకు ఇలా చితికిపోయాను ...చివరకు సుగుణకు పెళ్లి చెయ్యలేనిస్థితికి వచ్చాను." అన్నాడు.

"మీకు అభ్యంతరం లేకపోతే సుగుణను నేను పెళ్ళి చేసుకుంటాను!" అన్నాడు మల్లేశ్...

చక్రపాణిగారిని ఎప్పుడు చూసినా అతడు తనను స్తంభానికి కట్టేసి కొట్టిన దృశ్యమే గుర్తుకొస్తుంది మల్లేశ్‌కి. . .ఆనాటి అవమానానికి ప్రతీకారం తీర్చుకోగలిగితే. . . .

మల్లేశ్ మాటలకు తెల్లబోయారు చక్రపాణిగారు.

"నువ్వు . .మా అమ్మాయిని చేసుకుంటావా?"

"ఏంటే?" తీక్షంగా అడిగాడు మల్లేశ్ . .

చక్రపాణిగారు చురుగ్గా ఆలోచించారు. ఈ మల్లేశ్ ఒకప్పుడు తమ ఇంట్లో నౌకరు. అయితేనేం? బుద్ధిమంతుడు. బాగా చదువుకుని వృద్ధిలోకి వచ్చాడు. ఇప్పటి పరిస్థితుల్లో సుగుణకి తను ఇంతకంటె మంచి సంబంధం తేగలడా?

"అలాగేనోయ్! నాకు మాత్రం నీలాంటి అల్లుడు ఎక్కడ దొరుకుతాడు?"

ఎంత సంబరంగా అనాలని ప్రయత్నించినా ఆయన కంఠంలో ఏదో వ్యథ ధ్వనించింది. నిట్టూర్పు కూడా అణచుకోలేక పోయాడు. లోలోపల రగులుతోంది మల్లేశ్‌కి.

"సుగుణను అడిగి మరీ చెప్పండి!" అన్నాడు.

"అలాగే! అలాగే! అది వప్పుకోకుండా ఎలా? ఉత్తరం రాస్తాను " అన్నారు చక్రపాణిగారు. .

కొంచెం రోజులలోనే సుగుణ కూడా ఒప్పుకుందనీ సాధ్యమయినంత త్వరలో పెళ్ళికి ముహూర్తం పెట్టిస్తున్నాననీ ఉత్తరం వచ్చింది చక్రపాణి గారి దగ్గరనుంచి.

ఆ ఉత్తరం చదువుకోగానే మల్లేశ్‌కి కలిగింది కేవలం సంతోషం మాత్రమే కాదు. . లోలోపల ఏదో సన్నని అపరాధ భావన కూడా అంతరాత్మను సలిపింది.

తను కేవలం చక్రపాణిగారిని అవమానించటానికే ఈ పెళ్ళి చేసుకోబోతున్నట్లు సుగుణకు తెలుసా? సుగుణకు తను తగిన భర్త కాగలడా? చక్రపాణి గారిని అవమానించగలడు. . .సరే! సుగుణను కట్టిపెట్టగలడా?

సుగుణా మల్లేశ్‌లకు పెళ్ళి నిశ్చయమయిపోయింది

## 6

మల్లేశ్ తన పెళ్ళి ఏర్పాట్లు కొంత ఆడంబరంగానే చేసుకున్నాడు. తన సాటి లాయర్ల నందరినీ పిలిచాడు. వాళ్ళకు ప్రత్యేకం ఆధునికపద్ధతిలో హాట్ డ్రింక్స్‌తో సహా పార్టీ ఏర్పాటుచేసాడు. పెళ్ళికి తన బంధువులెవరినీ మల్లేశ్ పిలవలేదు కానీ బిలబిలలాడుతూ వచ్చిన తనవాళ్ళందరినీ చూసి నివ్వెర పోయాడు. చుట్టలు కాల్చుకుంటూ, "ఓలప్పా!" అంటే "ఓలయ్యో!" అని కబుర్లాడుకుంటూ తినుబండారాలమీద కెగబడి అవన్నీ వాపెరిగా తినే తన బంధువులను చూసి మిగిలిన లాయర్లు వాళ్ళలో వాళ్ళు నవ్వుకొంటూ ఉంటే అవమానంతో దహించుకుపోయాడు. వాళ్ళందరినీ సుగుణ స్వయంగా ఆహ్వానించిందని తెలుసుకొని మరింత మండిపోయాడు

పెళ్ళి పందిట్లో పెద్దలందరి ఎదుట చక్రపాణిగారు తన కాళ్ళు కడిగి కన్యాదానం చేస్తుంటే గర్వంతో పొంగిపోయింది మల్లేశ్ మనసు ఆ సమయంలో అతని దృష్టి పెళ్ళిపీటలమీద చిరునవ్వుతో కూర్చున్న సుగుణమీద లేదు. తన ముందు వంగిన చక్రపాణిగారి మీదే ఉంది. ఈ వ్యక్తి ఒకనాడు తన తప్పులేక పోయినా నిర్దాక్షిణ్యంగా కొట్టాడు. స్తంభానికి కట్టి పశువును కొట్టినట్లు కొట్టాడు తననొక మనిషిలా చూడలేకపోయాడు. దానికి సమాధానం చెప్పాలి

అతని మనసు తొలిరాత్రి తియ్యని అనుభవాలకోసం ఉవ్విళ్ళూరుతలూగటంలేదు. కొన్ని సంవత్సరాలుగా తన మనసులో మరుగుతున్న అవమానానికి ప్రతీకారం తీర్చుకోవాలని తహతహలాడుతోంది

చక్రపాణిగారు బాగా చితికిపోయారు గొప్పగా కట్నం ఇచ్చుకోలేని ఈ దశలో సుగుణకు మల్లేశ్‌లాటి సంబంధం వచ్చినందుకు ఆయన పొంగిపోతున్నారు. అమాయకంగా అందరి దగ్గిరా మల్లేశ్‌ని పొగుడుతున్నారు అవన్నీ మల్లేశ్ చెవిన కూడా పడుతున్నాయి. మల్లేశ్‌కోసం ఖరీదైన బట్టలు కొనలేక



పోయారు చక్రపాణిగారు. మామూలువే కాని ఆప్యాయంగా చేతిలో పెట్టబోయారు.

"ఛీ! ఛీ! ఇలాటి బట్టలు నేను కట్టుకోను!" అని ఆ బట్టలు అందరి ముందు చక్రపాణిగారి ముఖానికేసి కొట్టాడు.

బిత్తరపోయి చూసారు చక్రపాణిగారు. ఆయనకు కలిగిన విభ్రాంతిలో కిందపడిన బట్టలు పైకి తీయాలని కూడా తోచలేదు ఒక్క చక్రపాణిగారే కాదు. అక్కడ మిగిలిన వ్యక్తులందరూ కూడా ఒకక్షణం బొమ్మల్లా నిలబడి పోయి మల్లేశ్‌ని విచిత్రంగా చూసారు తలదించుకొని చటుక్కున అక్కడి నుండి వెళ్ళిపోయాడు మల్లేశ్

సుగుణకోసం ఎదురుచూస్తూ గదిలో అటూఇటూ తిరుగుతున్నాడు మల్లేశ్.

సుగుణకు కోపంవస్తుంది! తండ్రి ముఖంమీద బట్టలు విసిరికొట్టినందుకు కోపంరాదూ! రానీ! తను సమాధానం చెప్పగలడు.

అడుగుల చప్పుడుకు తలెత్తి సుగుణను చూసిన మల్లేశ్ క్షణకాలంపాటు సమస్త ప్రపంచాన్ని మరిచిపోయాడు తెల్లని జరీచీరలో అతినిరాడంబరంగా ఉంది అతిలోకసౌందర్యంతో మెరిసిపోతోంది. మల్లేశ్‌ని చూసి చిరునవ్వు నవ్వింది

ఎంత ప్రేమ ఆ చిరునవ్వులో...ఆ నవ్వు చూడగానే సుగుణను రెండు చేతులూజాపి తన గుండెల్లో ఇముడ్చుకోవాలనుకున్నాడు. కానీ ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేకపోయాడు. తనకు అడ్డుపడుతున్న దేమిటో నిర్ణయించుకోలేకపోయాడు. తన సంకోచాన్ని కోపం ముసుగులో దాచుకుంటూ "నువ్వు నన్ను అవమానించాలని ఎందుకు పూనుకున్నావో అర్థంకావటంలేదు." అన్నాడు.

సుగుణ ఆశ్చర్యంగా "నేను మిమ్మల్ని అవమానించాలని అనుకున్నానా?" అంది.

"లేకపోతే...ఆ అలగాజనాన్నంతా ఎందుకు పిలిచినట్లు?"

"ఏ అలగా జనం! మన బంధువుల విషయమా?"

"వాళ్ళంతా నా బంధువులని నువ్వు ఎత్తిచూపక్కర్లేదు."

"మీరు సరిగ్గా వింటున్నట్లులేదు. "మన బంధువులు" అన్నాను. అవును వాళ్ళను నేనే పిలిపించాను. అందులో అవమానమేముంది?"

"వాళ్ళంతా అనాగరికంగా మాట్లాడుకుంటూ వావిరిగా తింటుంటే అందరూ ఎంత నవ్వుకున్నారో నీకు తెలుసా?"

"తెలియదు-కానీ, మీరు చెప్పే ఆ 'అందరూ' తప్పతాగి తందనాలాడుతోంటే నేను ఎంత అసహ్యించుకున్నానో మీకు తెలుసా? మన బంధువుల ప్రవర్తన అనాగరికం-మీ స్నేహితుల ప్రవర్తన అమానుషం..."

మల్లేశ్ విచిత్రంగా చూస్తూ "దానికి దీనికి పోలిక ఏమిటి?" అన్నాడు.

"చాలా విషయాల్లో పోలికలేదు. ఇక్కడందరూ డబ్బులేని దరిద్రులు. వాళ్ళు డబ్బు మూలుగుతున్న వాళ్ళు. వీళ్ళు చదువుకోనివాళ్ళు. ఏమీ తెలియని వాళ్ళు చదువుకొన్నవాళ్ళు అన్నీ తెలిసినవాళ్ళు. ఇంత భేదం ఉన్నా ఒక్క విషయంలో మాత్రం పోలిక ఉంది. సభ్యసమాజంలో ఈ ప్రవర్తన ఎలా పనికిరాదో, ఆ ప్రవర్తన కూడా అలాగే పనికిరాదు. దరిద్రం పోతే వావిరితనం పోతుంది. చదువుకొంటే మాట్లాడటం వస్తుంది. నేర్పితే మర్యాదలు తెలుస్తాయి. మనవాళ్ళని బాగుచేసుకోవచ్చు! కానీ మీ స్నేహితులని, అన్నీ తెలిసిన ఆ విద్యాధికులను, సంస్కారులను, నాగరికులను ఎవరు బాగుచెయ్యగలరు?..."

మల్లేశ్ తెల్లబోయి విన్నాడు. అతడు సుగుణతో మాట్లాడి చాలా రోజులయింది. అప్పుడప్పుడు దూరంనించి చూసాడంతే! సుగుణలో మెరిసిపోతున్న

ఆ అందమంతా సుగుణ శరీరంలో ఉందా? సుగుణ మాటలలో ఉందా? ఆ మాటలను పలికించే మనసులో ఉందా?

సుగుణను చూస్తూ అలాగే నిలబడ్డాడు సుగుణ చిరునవ్వుతో కొన్నిక్షణాలు మల్లేశ్‌నిచూసి తనే వచ్చి అతని చేతులు తన చేతులలోకి తీసుకుని చెక్కిళ్ళు కానించుకుంది మల్లేశ్ నిలువునా పులకరించాడు మొదలంటా కదిలిపోయాడు ఎందుకో తెలియకుండా ముడుచుకుపోయాడు. అప్రయత్నంగా కళ్ళు చెమ్మ గిల్లాయి అంతలో నిగ్రహించుకున్నాడు. తన తండ్రిని అవమానించిన ప్రస్తావన సుగుణ తేకపోయినా తనే తెచ్చాడు

''మీ నాన్నగారిని అవమానించినందుకు నీకు కోపం రావచ్చు. నన్ను అసహ్యించుకోవచ్చు.. కానీ...''

"మీ రీ ప్రస్తావన తెస్తారనే అనుకున్నాను. ఆ సంఘటన జరిగిన దగ్గిరనుంచీ నేను మిమ్మల్ని తలుచుకొని జాలిపడుతూనే ఉన్నాను''

"జాలిపడుతున్నావా?... నన్ను తలుచుకొని...,''

''అవును ఉద్రేకం అణచుకోలేక ఆ బట్టలు మా నాన్నగారి ముఖంమీద కొట్టారేకాని ఆ మరుక్షణం మీ తల ఎంత కిందకు వాలిందో నేను చూసాను మీ మనసు ఎంత ముడుచుకుపోయిందో ఊహించాను. లాభంలేదండీ! అలాటి పనులు మనం చెయ్యలేము!''

"మనం....''

"అవును మనం-మీరూ, నేనూ ఇంకా మనలాటి యువతరం. మీరు నాన్న గారి ముఖంమీద బట్టలెందుకు విసిరికొట్టారో నాకు తెలుసు మా నాన్నగా చిన్నతనంలో మిమ్మల్ని స్తంభానికికట్టి కొట్టిన దృశ్యం మీలాగే నేనూ మరిచి పోలేదు ఆ రోజు నేను అన్నం తినలేదు-నిద్రపోలేదు. కానీ నాన్నగారు నిశ్చింతగా ఏంజరగనట్టు అతి మామూలుగా ఉంటే ఆశ్చర్యపోయాను. ఆయనకు తను చేసిన పని ఎంత దారుణమైనదో కూడా తెలియదు. అలాంటి మూర్ఖత్వం ఏమాత్రం క్షంతవ్యంకాదు కానీ, అది మూర్ఖత్వమే! కానీ ఈనాడు మీరు ఆ బట్టలు మా నాన్నగారి ముఖంమీద కొట్టాక స్థిమితంగా ఉండ గలిగారా? అసలు తల ఎత్తుకోగలిగారా? ఇదీ మన సంస్కారం. సాటిమనిషిని అభిమానించలేని మన నాగరికత..."

సుగుణ మాటలు వింటుంటే అప్పటివరకూ తన మనసులో బండలా పేరు

కున్న బరువేదో కరిగిపోతున్నట్లు తోచింది మల్లేశ్ కి. రెండు చేతులు జాపి సుగుణను గుండెలలోకి తీసుకున్నాడు

ఆ ఒక్క రాత్రి సుగుణ మల్లేశ్ కెన్నెన్నో మధుర ప్రపంచాలు చూపించింది. అతని సంకోచాన్ని అర్థంచేసుకుని తానే అతనికి చేరువయింది తన మనసులో మమకారమంతా చూపిస్తూ లాలించింది. తన ఆత్మనే అతని ముందు పరిచి ప్రణయ మాధుర్యమంతా అతనికి ప్రత్యక్షంచేసింది.

సుగుణ తనను ఇంతగా ప్రేమిస్తోందా? ఇది నిజమేనా?

సుప్రసిద్ధ వ్యాపారి రావుగారి దగ్గరనుండి మల్లేశ్ కి కబురు వచ్చింది వెంటనే వెళ్లాడు మల్లేశ్ సగౌరవంగా ఆహ్వానించి కూచోటానికి సోఫా చూపించాడు రావు. నౌకరుని పిలిచి ఫలహారం, కాఫీ తీసుకురమ్మన్నాడు చిరునవ్వు నవ్వుతూ "హాట్ డ్రింక్స్ అలవాటుందా?" అని హాస్యంగా అడిగినట్లు అడిగాడు ఒకనాడు ఈ రావుగారిని చూడటానికే తను పడినపాట్లు తలుచుకుని ఒక్క నిట్టూర్పు విడిచాడు మల్లేశ్

"మీ పేరు ప్రఖ్యాతులు తెలుసుకున్నాను రెండు మూడుసార్లు మీ ఆర్గ్యుమెంట్స్ కూడా విన్నాను. చాలా మెచ్చుకున్నాను," అన్నారు రావుగారు

మల్లేశ్ ఆశ్చర్యంగా "నా ఆర్గ్యుమెంట్స్ మెచ్చుకున్నారా? నేను కూలీల తరఫున పనిచేసాను," అన్నాడు

రావుగారు నవ్వి "నేను మెచ్చుకున్నది ఆర్గ్యూచెయ్యడంలో మీ చాకచక్యాన్ని, కూలీల తరఫున పనిచెయ్యటాన్ని కాదు మిమ్మల్ని మా లాయర్ గా వేసుకోవాలనుకుంటున్నాను మీ అభిప్రాయం చెప్పండి!" అన్నారు.

మల్లేశ్ తన చెవులను తను నమ్మలేకపోయాడు రావుగారి యాజమాన్యంలో ఎన్నో కంపెనీలు ఉన్నాయి తను రావుగారి లాయర్ కావటం అంటే తనను అదృష్టం కోరి వరించినట్లే! తను చిన్నప్పటినుంచీ కలలుకన్న జీవితం కాదు బంగళా-నౌకర్లు-అవన్నీ తనకు లభించినట్లే! "థాంక్యూ సర్! థేంక్యూ వెరీ మచ్!" పట్టరాని ఆనందంతో అన్నాడు మల్లేశ్

రావుగారు చిరునవ్వు నవ్వారు మల్లేశ్ దగ్గరనుండి మరొక రకమైన సమాధానం ఆయన ఆశించలేదు.

ఎంతో ఆనందంతో సుగుణ దగ్గర కొచ్చాడు మల్లేశ్.

"నువ్వు చాలా అదృష్టవంతురాలివి సుగుణా!" అన్నాడు సుగుణ ఎప్పటిలా

ఆప్యాయంగా నవ్వి "ఇప్పుడు కొత్తగా వచ్చిన అదృష్టమేముందీ? నేను ఎప్పుడూ అదృష్టవంతురాలినే!" అంది.

''అదికాదు రావుగారు నన్ను తన లాయర్‌గా వేసుకున్నారు "

ఉలిక్కిపడింది సుగుణ

"మీరు ఒప్పుకున్నారా?"

"ఎందుకు ఒప్పుకోనూ? ఎంత మంచి ఆఫర్! ఇలాంటి అదృష్టం అందరికీ వస్తుందా?"

"అదృష్టమా?"

"కాదా? డబ్బు, కీర్తి..."

"ఇన్నిరోజులుగా కూలీలతరపున పనిచేసి ఇప్పుడు మేనేజ్‌మెంట్స్ తరపున పనిచేస్తారా?"

"ఇన్నాళ్ళూ కూలీల తరపున విధిలేక పనిచేసాను. నేను జూనియర్ లాయర్‌ని నాకు అంతకంటే మంచి ఆఫర్స్ రాలేదు..."

బొమ్మలా నిలబడిపోయింది సుగుణ . ఎంతోసేపటికి తేరుకుని "నేను చాలా పొరపడ్డాను!" అంది

మల్లేశ్‌కి చాలా కోపం వచ్చింది.

"పొరపడ్డావా? అంటే, నేనూ మీ బావలాగ వాళ్ళకోసం సంఘాలు స్థాపిస్తూ త్యాగాలు చేస్తానన కున్నావా?"

సుగుణ మాట్లాడలేదు. సుగుణ అలా ముభావంగా ఉండటం మల్లేశ్‌కి సుఖంగాలేదు.

"నువ్వెంతో సంతోషిస్తా వనుకున్నాను నిన్ను సుఖపెట్టాల నే... "

మల్లేశ్ మాటలకు మధ్యలోనే అడ్డుపడింది సుగుణ "నా సుఖం నేను చూసుకోగలను! రేపటినుండే నేను యువజన సంఘంలో చేరి పనిచెయ్యాలని నిశ్చయించుకున్నాను "

"యువజన సంఘంలో చేరతావా? వీల్లేదు! నా కిష్టంలేదు "

సుగుణ నవ్వింది.

"మీరు రావుగారి లాయర్‌గా ఉండటం నా కిష్టంలేదంటే..."

"నేను మానను. అదీగాక రావుగారి కూతురు జానకి నాకు కొంతకాలం ఎంతో సహాయం చేసింది. ఆ రుణం తీర్చుకోటానికయినా నేను రావుగారి మాట కాదనకూడదు!"

ఈ మాటలకు సుగుణ చిత్రంగా నవ్వింది ఆ నవ్వు అర్థంకాలేదు మల్లేశ్ కి. ఏమిటి సుగుణ ఉద్దేశ్యం?

"సుగుణా! నువ్వు యువజన సంఘంలో చేరటానికి వీల్లేదు!" గట్టిగా చెప్పాడు.

"మొదటినుండీ నేను నాకు మంచిదని తోచింది చేస్తూనే వచ్చాను. నన్ను ఎవరూ అడ్డుపెట్టలేరు. పెట్టాలని చూసినా ప్రయోజంలేదు..."

శాంతగానే సమాధానం చెప్పింది సుగుణ అయినా ఆ మాటలు దృఢంగా ఉన్నాయి.

ఆ మరునాడు మల్లేశ్ తో చెప్పి మరీ యువజన సంఘానికి బయలుదేరింది సుగుణ.

"నా కిష్టంలేదు సుగుణా! వెళ్ళకు!" అన్నాడు కోపంగా మల్లేశ్

మల్లేశ్ కోపాన్ని కొంచెంకూడా లక్ష్యపెట్టలేదు సుగుణ "వెళ్తున్నాను ఏం చేస్తారు? విడాకులిస్తారా?" అంటు నవ్వుతూనే వెళ్ళిపోయింది.

ఆ ధీరత్వంముందు...ఆ చిరునవ్వుముందు తను ఓడిపోక తప్పదని అర్థ మయింది మల్లేశ్ కి; తను సుగుణకు విడాకులిస్తాడా? సుగుణ లేకుండా తను బ్రతకగలడా?

మల్లేశ్ తను ఆశించినట్టే డబ్బు సంపాదించాడు - ఇల్లు కట్టాడు - కారు కొన్నాడు

సుగుణ యువజన సంఘంలో చేరి రమేష్ తో సమంగా పనిచేస్తోంది. మొదటినుండీ ఎంత నిరాడంబరంగా ఉండేదో ఇప్పుడూ అలాగే ఉంటుంది.

## 7

మాస్టారు వెంటనే రమ్మని మల్లేశ్ కి కబురుచేశారు. తనకు విద్యాదానం చేసిన మాస్టారిపట్ల మల్లేశ్ కి అంతులేని భక్తిశ్రద్ధలు తనకు సంపాదన ప్రారంభం కాగానే మాస్టారికి బహుమానాల రూపంలో ఎంతో ధనసహాయం చేసాడు. ప్రతిసారి మాస్టారు ఆ బహుమానాలు తీసుకోవటానికి తీవ్రంగా ప్రతి ఘటించేవారు. చివరకు మల్లేశ్ బలవంతం భరించలేక తీసుకునేవారు. మొత్తం మీద మల్లేశ్ తనకు సహాయపడినప్పుడంతా ఆయన ముఖంలో ఆనందంకంటే కష్టమే ఎక్కువగా కనిపించేది

మాస్టారు కబురు చేసారని తెలియగానే వెంటనే వెళ్ళాడు మల్లేశ్...మాస్టారు

చాలా ఆందోళనగా ఉన్నారు మల్లేశ్‌ని చూడగానే "వచ్చావా! రా, కూచో! ఇవాళ అంతా చెప్పేస్తాను" అన్నారు. మల్లేశ్ తెల్లబోయి చూసాడు.

మాస్టారు ఆయన ధోరణిలో ఆయన ఉన్నారు

"రమేష్ అరెస్ట్ అయ్యాడట కదూ!"

"అవును! జామీనుమీద వాళ్ళ బంధువులు విడుదలచేసారు. కానీ అతని మీద కేస్ ఉంది..."

"అది కూడా విన్నాను నీలాంటి సమర్థుడయిన లాయర్‌తప్ప రమేష్‌ను ఎవరూ రక్షించలేరని కూడా విన్నాను."

"నేను కూడా ఏంచెయ్యలేను రమేష్‌కు వ్యతిరేకంగా బలమైన సాక్ష్యాధారాలున్నాయి. దోపిడీదొంగ దీనబంధుతో రమేష్‌కు లావాదేవీలున్నట్లు తెలిసింది. అదీగాక నేను రావుగారి లాయర్ని..."

"మల్లేశ్...మల్లేశ్" ఏదో చెప్పబోయి ఆగిపోయారు మాస్టారు...

"ఏమిటి సార్!"

"చెప్తాను చెప్పేస్తాను తరువాత ఏమయినా సరే!"

"చెప్పండి సార్!"

"విను. విన్నాక ఏంచెయ్యాలో నువ్వు నిర్ణయించుకో? ఆ రోజు...నువ్వు కాలేజిలో చేరాలని తాపత్రయపడుతున్నప్పుడు...మీ నాన్న వీల్లేదని కసిరినప్పుడు ..హైదరాబాద్ వెళ్ళి చదువుకోవటానికి నీ దగ్గిర డబ్బులేనప్పుడు... నీకు సహాయం చేసినదెవరో తెలుసునా?..."

''మీరు...దేవతలాంటి మీరు..."

"లేదు! బడిపంతుల్ని. నా ఇల్లు నేను గడుపుకోలేక సతమతమవుతున్న వాణ్ణి. నీకు సహాయం చెయ్యగలనా? ఆ రోజు నా ద్వారా ఆ డబ్బు నీకు ఇప్పించింది సుగుణ..."

మల్లేశ్‌కి ఊపిరి ఆగిపోయినట్లయింది...

"సుగుణా...?"

"అవును. అప్పట్లో చక్రపాణిగారి కుటుంబం ఇంతగా చితికిపోలేదు కదా! సుగుణ దగ్గిర డబ్బు ఉండేది తను సొంత ఖర్చులకోసం దాచుకున్నదంతా నా ద్వారా నీకు ఇప్పించింది. తరువాత కొన్నాళ్ళు నీకు సుగుణ సహాయం అవసరం లేకపోయింది. ఆ తరువాత నువ్వు పరీక్ష ఫీజ్ కట్టడానికి డబ్బులేక అవస్థ పడుతున్నట్లు రమేష్ ద్వారా సుగుణకు తెలిసింది... "నేను సహాయం చెయ్య

గలను ఎందుకో అర్థంకాదు. నా సహాయం అతను తీసుకోడు!'' అన్నాడు రమేష్...అప్పటికి చక్రపాణిగారు చితికిపోయారు! సుగుణదగ్గిర కూడా డబ్బు లేదు. తన గొలుసు అమ్మి నా ద్వారా నీ పరీక్ష ఫీజ్ పంపించింది నువ్వు "లా"లో చేరావు. సుగుణ టీచర్‌గా ఉద్యోగంలో జాయినయింది తన జీతంలో నుంచే ఇటు ఇల్లు గడుపుతూ అటు నీకు డబ్బుపంపేది పాపం, ఆ రోజుల్లో సుగుణ డబ్బుకోసం ట్యూషన్లు కూడా కుదుర్చుకుంది "

చెప్పడం ఆపి మల్లేశ్ ముఖంలోకి చూశారు మాస్టారు శిలలా కూర్చున్నాడు మల్లేశ్...

సుగుణ కష్టపడి తనను చదివించింది సుగుణ తండ్రి తనకు బట్టలు పెడితే 'ఛీ! ఇలాంటివి కట్టుకోను!' అని పదిమందిలో ఆయన ముఖంమీద కొట్టాడు తను! అంతటి తన అపరాధాన్ని చిరునవ్వుతో క్షమించి...అలాంటి పని చెయ్యటంలో తన మనసుపడిన క్షోభను అర్థంచేసుకుని...విశాల హృదయంతో తన మూర్ఖత్వం తను అర్థంచేసుకునేలా చేసింది సుగుణ...

చక్రపాణిగారి ముందు...సుగుణ ముందు...గర్వంగా నిలబడ్డా నను కుంటున్నాడు...కాని...కాని...

మాస్టారు మళ్ళీ మొదలుపెట్టారు.

"ఈ విషయాలు ఏ నాటికీ నీకు చెప్పవద్దని చెప్పింది సుగుణ...నువ్వు నేనే నీకు సహాయం చేశాననుకుని నాకు కృతజ్ఞత చూపిస్తోన్నప్పుడంతా అసలు విషయం నీకు చెప్పేయ్యాలని అనుకునేవాడిని. ఈ రహస్యం బయటపెట్టనని సుగుణ కిచ్చిన మాటకోసం విధిలేక ఊరుకున్నాను...ఇప్పుడింక లాభంలేదు మల్లేశ్ .రమేష్ అరెస్టుయినప్పనుండి సుగుణ నిద్రాహారాలు మాని కుమిలి పోతోంది. నువ్వు రమేష్‌ని కాపాడాలి? ఇది నీ విధి...''

చాలాసేపు మాట్లాడకుండా కూర్చుని లేచాడు మల్లేశ్

"ఏమంటావు మల్లేశ్ .." ఆరాటంగా అడిగాడు మాస్టారు. పేలవంగా నవ్వాడు మల్లేశ్...

"మీరే చెప్పారుగా మాస్టారూ, నా విధి అని. శక్తివంచనలేకుండా ప్రయత్నిస్తాను. "

మాస్టారి ముఖం వికసించింది

''ప్రయత్నించు. తప్పకుండా జయం సాధిస్తావు..."

ఆశీర్వదిస్తున్నట్లు అన్నారు



తను ఎంత సంపాదిస్తున్నా సుగుణ అతి నిరాడంబరంగా ఉంటుంది! రమేష్‌తో కలిసి యువజన సంఘంలో పనిచేస్తోంది. రమేష్ అరెస్టు అయ్యే సరికి నిద్రాహారాలు మాని కమిలిపోతోంది! తలచుకున్నకొద్దీ ఒక్కొక్క విషయమూ మల్లేశ్ మనసును కోస్తోంది సుగుణ తనను ప్రేమించటం లేదని అతను అనుకోలేకపోతున్నాడు. ఆ ఆలోచన అతనికి పిచ్చెక్కిస్తోంది. రమేష్ పట్ల ఏదో సన్నని కసి రగులుతోంది. అయినా రమేష్ తరఫున వాదిస్తాడు. అతనిని రక్షిస్తాడు. అది తన 'విధి' ఆనాడు జానకి, ఋణం తీర్చుకోవటం తన విధి అన్నప్పుడు సుగుణ నవ్విన చిత్రమైన నవ్వుకు అర్థం ఇదా?

మల్లేశ్ నిర్ణయం విని రావుగారు నివ్వెరపోయారు. "బాగా ఆలోచించుకున్నారా? మీరు రమేష్ తరఫున పనిచెయ్యదలచుకుంటే ఇకముందు మాకు మీకు ఏ విధమయిన సంబంధమూ ఉండదు" అన్నారు.

"నేను లాయర్ని! నాకు చెపుతున్నారా? అన్నీ ఆలోచించుకునే నా నిర్ణయం చెపుతున్నాను."

రావుగారు మాట్లాడలేదు. నిర్లక్ష్యంగా ఊరుకున్నారు. ఆ నిర్లక్ష్యంలో ఆయన కోపం స్పష్టంగా తెలుస్తోంది

మల్లేశ్ యువజన సంఘానికి వచ్చాడు. విషయాలన్నీ సేకరించడం

మొదలుపెట్టాడు ఒక్కొక్క విషయమూ తెలుసుకుంటున్నకొద్దీ అతనికి ఆ సంఘం పట్ల గౌరవం పెరగసాగింది. ఆ దీనబంధు ఎవరో కాని నిజంగా సార్థక నామధేయుడే. యువజన సంఘం స్థాపించింది అతనే! ఆ నాటినుండీ ఈనాటి వరకూ అతని ఆదేశాల ప్రకారమే సంఘం నడుస్తోంది. సంఘం ప్రధానంగా వెనుకబడిన జాతులను వృద్ధిలోకి తీసుకురావటానికి చాలా పాటుబడుతోంది అవి సాధించినది కూడా తక్కువ కాదు ఆ సంఘం సహకారంతో ఎంతోమంది చదువుకున్నారు, చదువుకుంటున్నారు. ఒక్క కూలీల విషయంలోనే కాదు. సంఘంలో ఎక్కడ ఏ అన్యాయం జరిగినా దానిని ఎదుర్కోవటానికి సంఘం ముందుకొస్తుంది. చట్ట విరుద్ధమయిన పని ఏ ఒక్కటీ ఆ సంఘం చెయ్యలేదు అలా చేసినట్లు ఆధారాలు లేవు అంతేకాదు. ఒకసారి కొందరు రాజకీయ వాదులు రమేష్‌ను సంప్రదించారు "మీ సంఘం ఆదర్శాలు మాకెంతో నచ్చాయి. మీరు మాతో కలిసి పనిచెయ్యకూడదూ?" అని అడిగారు. రమేష్ ఖచ్చితంగా "మాకు రాజకీయాలతో ఏ విధమయిన సంబంధమూ లేదు. ఏ పార్టీలోనూ మేము చేరము. అజ్ఞానాన్ని రూపుమాపటం, అన్యాయాన్ని ఎదుర్కోవటం- ఇవి రెండే మా లక్ష్యాలు" అని సమాధానం చెప్పాడు. ఈ విషయం రుజువయ్యడానికి తగిన ఆధారాలు సేకరించాడు మల్లేశ్...రమేష్‌ను సంప్రదించిన రాజకీయవాదులు కూడా చాలా మంచివాళ్ళు రమేష్ రాజకీయాలలో జోక్యం కలిగించుకోవటానికి ఇష్టపడనట్లుగా సాక్ష్యమిస్తామని అన్నారు.

రమేష్ పైన ఉన్న ఛార్జెస్‌లో బలమైనది అతనికి దీనబంధు దగ్గరనుంచి వస్తోన్న ఉత్తరాలు. ఆ ఉత్తరాలు ఎప్పటినుండో వస్తున్నాయి. ఎవరు పంపిస్తున్నారో, ఎలా పంపిస్తున్నారో ఎవరికీ తెలియదు అన్నింటికంటే విచిత్రం, అవి పోస్ట్‌లో రావటంలేదు. ఆఫీస్‌లో బల్లమీదకి వచ్చి చేరుతున్నాయి అవి ఎలా వస్తున్నాయో, దీనబంధు ఎవరో, తనకు కూడా తెలియదని అంటున్నాడు రమేష్. దీనబంధు బ్యాంక్ దోపిడి చేసినట్టు బలమైన ఆధారాలున్నాయి. ఆ నేరంమీద అరెస్టు కావలసిందే! కానీ తప్పించుకు పారిపోయాడు. ఆ తరువాత చచ్చిపోయాడు. కాదు చచ్చిపోయినట్లు పత్రికలలో వార్త వచ్చింది.

ఆ ఉత్తరాలను మళ్ళీ మళ్ళీ పరిశీలించాడు మల్లేశ్... 'దీనబంధు' సంతకాన్ని మళ్ళీ మళ్ళీ చూడగా మెరుపులా ఏదో స్ఫురించింది మల్లేశ్‌కి...

కోర్టులో రమేష్ కేసు విచారణ ప్రారంభమయింది...నాయుడిగారి కొడుకు మొదటినుండీ అల్లరివాడేనని రుజువు చేసాడు మల్లేశ్...అనేక కారణాలవల్ల

ఇటీవల విద్యారంగం చాలా పాడయిపోయింది. కాపీకొట్టడం, అల్లరులు చెయ్యడం, ఆందోళనలు లేవతియ్యడం...విద్యార్థులలో చాలామందికి ఒక ఆటగా తయారయింది విద్యార్థులలో చాలామంది చదువుకోవాలని చూసేవారు ఉన్నా, ప్రతిక్లాసులోనూ కనీసం ఒక పదిమంది గూండాలలాంటివాళ్ళు బయలుదేరి మొత్తం వాతావరణాన్నే పాడుచేస్తున్నారు అట్లాంటి రౌడీవిద్యార్థుల్లో ఒకడు నాయుడిగారి కొడుకు...తండ్రి డబ్బు, పరపతి తనకు అండదండలుకాగా విచ్చలవిడిగా అల్లరిచేస్తుంటాడు.

ప్రతిపక్షపు సాక్షులను తన క్రాస్ఎగ్జామినేషన్‌లో పడగొట్టటంలో...తన వాదాన్ని నిరూపించుకోవడంలో...మల్లేశ్ ప్రజ్ఞను అందరూ మెచ్చుకున్నారు.

యువజన సంఘం సంఘంలో చేస్తోన్న మంచిపనులన్నీ సప్రమాణంగా నిరూపించారు మల్లేశ్...సంపన్నుల బిడ్డ అయినా నిస్వార్థంగా సంఘంలో చేరి పాటుపడుతోన్న రమేష్ గొప్పతనాన్ని నిరూపించాడు. 'యువజన సంఘం కార్యకలాపాల్లో కాని, రమేష్ చేసిన పనుల్లోకాని చట్టవిరుద్ధమయిన దేదీ లేదని నిరూపించగలిగాడు...

కానీ దీనబంధు ?

"సాక్షి 'దీనబంధు' బోనులోకి రావాలి ?" అని కోర్టు ప్రకటించింది... అందరూ ఒక్కసారి ఉలికిపడి ఊపిరి బిగబట్టారు...బోనులోకి ప్రవేశించిన వ్యక్తిని చూసి అందరికీ మతులుపోయాయి.

చెక్కు చెదరని చిరునవ్వుతో నిండు కోర్టులో రమేష్‌ను కాపాడటానికి బోనులో నిలబడిన వ్యక్తి మంత్రి జగదీశ్ !

## 8

దీనబంధు సంతకం చివర తమాషాగా పద్మంలాగ ఉంటుంది. అలాంటి సంతకం అదివరలో చూసినట్లు అనిపించసాగింది మల్లేశ్‌కి. ఆలోచించగా ఆలోచించగా గుర్తుకొచ్చింది. ఆరోజు రైలులో జానకికి ఉత్తరం రాసిన వ్యక్తి సంతకం అలాగే ఉంది. అతను దీనబంధా ? కావచ్చును. దీనబంధు, జానకి ప్రేమించుకున్నారని, రావుగారు కూడా ఆ వివాహానికి ఒప్పుకున్నారనీ విన్నాడు. అయితే జానకికి మెంటల్ షాక్ వచ్చింది దీనబంధు మరణవార్త తెలిసిన తరువాత,...దీనబంధు బ్రతికి ఉన్నమాట నిజమేనా ? నిజమే అయితే ఆ సంగతి జానకికి కూడా తెలియకుండా ఉంటుందా ?

మల్లేశ్ జానకి దగ్గిరకు వచ్చాడు. జానకి ఎప్పటిలాగే ఈ లోకంలో లేదు. మల్లేశ్ తన ఎదుట ఉన్నాడని కూడా గుర్తించటంలేదు...

"జానకిగారూ! దీనబంధు బ్రతికి ఉన్నాడా? మీకు తెలుసా?'' తన మాటలు జానకి అర్థంచేసుకునేలా చెయ్యాలని విశ్వప్రయత్నం చెయ్యసాగాడు మల్లేశ్...

మల్లేశ్ మాటల్లో జానకి మనసు అందుకోగలిగినది 'దీనబంధు' అనే మాట ఒకటే...

"దీనబంధూ నేనూ కలిసే వెళ్ళాం లంబాడీతండాల దగ్గిరకి. వాళ్ళ అమాయకత్వాన్నీ, అజ్ఞానాన్నీ చూసి దీనబంధు ఎంతో బాధపడ్డాడు. 'వాళ్ళను ఏ నాటి కయినా సభ్య సమాజంలో వ్యక్తులుగా మలచగలనా?' అని కృంగిపోయాడు. అప్పుడు నేనే ధైర్యంచెప్పాను..."

మల్లేశ్ అడిగేదానికీ జానకి చెప్పేదానికీ ఏమీ సంబంధంలేదు. దీనబంధు పేరు వినగానే జానకికి చైతన్యం వస్తోంది. కానీ తన ధోరణిలో తను పడిపోతోంది...

"ఆ రోజు నేనూ దీనబంధూ పార్కులో చాలాసేపు కూచున్నాం. పెళ్ళికాగానే హనీమూన్‌కి కాశ్మీర్ వెళ్ళాలనుకున్నాం...కాశ్మీర్‌లో ఎలా గడపాలో ఊహించుకుంటూ ఆ రోజంతా కబుర్లు చెప్పుకుంటూ గడిపాం! ఆ మరునాడే...'' జానకి మాట్లాడటం ఆపేసింది. భారంగా కళ్ళు మూసుకుంది.

"ఆ మరునాడే...?" ముందుకు వంగి కుతూహలంగా అడిగాడు మల్లేశ్.

కానీ జానకి మల్లేశ్ మాటలు వినదు. వాటికి తను సమాధానాలు చెప్పదు. ఏ బాధామయలోకాలలోనో జానకి మనసు విహరిస్తోందనటానికి నిదర్శనంగా ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి. ముఖం దీనాతిదీనంగా తయారయింది.

మల్లేశ్ ఉస్సురని పోయాడు. దీనబంధు గురించిన సమాచారం చెప్పగలిగిన వ్యక్తి ఒక్క జానకి మాత్రమే! ఆ జానకి ఇలా ఉంది. వరసగా మూడు రోజులు 'దీనబంధు' ప్రస్తావన తెచ్చి జానకిచేత మాట్లాడించాడు మల్లేశ్...జానకి ఎంతసేపూ తన ప్రణయ జీవితాన్ని గురించే మాట్లాడేది. ఆ ప్రగాఢ ప్రణయినిని చూసి మల్లేశ్ మనసు కరిగి కళ్ళు చెమ్మగిల్లేవి. అంతేకాని మల్లేశ్‌కి కావలసిన సమాచారం దొరకలేదు. ఇంచుమించు మల్లేశ్ నిరాశ చేసుకునే సమయానికి ఒక విచిత్రం జరిగింది. జానకి దీనబంధుతో తన ప్రణయానికి సంబంధించిన విషయాలే మాట్లాడుతూ మధ్యలో "అప్పుడు

జగదీశ్‌కి నా మీద చాలా కోపం వచ్చింది..." అంది...ఉలికిపడ్డాడు మల్లేశ్. కుతూహలంలో "జగదీశ్ ఎవరూ ? జగదీశ్‌కూ మీకూ సంబంధం ఏమిటి ? జగదీశ్‌కీ దీనబంధుకూ సంబంధం ఏమిటి ?'' అని అడిగాడు. ఎప్పటి లాగే జానకి మల్లేశ్ మాటలు పట్టించుకోలేదు. వాటికి సమాధానం చెప్పలేదు. మల్లేశ్ ఆలోచనలో పడ్డాడు. జగదీశ్ ఎవరై ఉండాలి ? మంత్రి జగదీశ్ ! ఇది సంభవమా ? దళసరి నల్లకళ్ళద్దాలలో...గుబురుగా పెరిగిన గెడ్డంలో జగదీశ్ రూపరేఖలే సరిగా తెలియవు ! కానీ ఆ నవ్వు, ధీరత్వం, నిండు వ్యక్తిత్వం ఉట్టిపడే ఆ చిరునవ్వు...కాలికి తగిలిన దెబ్బలకి రక్తం స్రవిస్తోన్నా నిర్లక్ష్యంగా నిలబడి ఆ నాడు నవ్విన నవ్వు...

తన దగ్గిరకు వచ్చిన మల్లేశ్‌ని చాలా ఆదరంగా ఆహ్వానించాడు జగదీశ్...

"నువ్వు రమేశ్ తరపున పనిచేస్తున్నందుకు చాలా సంతోషంగా ఉంది. నీ ఆర్గ్యుమెంట్స్ అద్భుతంగా ఉన్నాయి..." అన్నాడు.

"ఏం లాభం సర్ ! దీనబంధు ఎవరో తేలకపోతే, అతను బోనులో నిలబడి సాక్ష్యం చెప్పకపోతే రమేష్‌ను ఎవరూ కాపాడలేరు..."

జగదీష్ మాట్లాడలేదు.

"మొదటినుండే దీనబంధు కథ విన్నాను. అంతటి సాహసి...అలాంటి సంఘసేవకుడు...ఈనాడు స్వార్థంతో బయటకు రాకుండా దాక్కోగలడని ఊహించలేకపోతున్నాను...''

''పొరపడుతున్నావు మల్లేశ్ ! దీనబంధు కథవింటే అతడు స్వార్థపరుడని నువ్వేకాదు గదా, అతని శత్రువులైనా అనలేరు..."

"మీకు తెలిస్తే చెప్పండి సార్..."

జగదీశ్ అంతా వివరంగా చెప్పాడు.

ఆ రోజుల్లో దీనబంధు జానకి ప్రేమించుకున్నారు. ఆ ప్రేమకు రావుగారు అడ్డు చెప్పలేదు. దీనబంధు చదువుకున్నవాడు, అందగాడు. తన కుతురికి తగిన భర్త అనే అనుకున్నారు రావుగారు. కానీ దీనబంధు యువజన సంఘాన్ని నడుపుతూ కూలీల తరపున పనిచేయ్యడం మాత్రం రావుగారికి నచ్చలేదు. దీనబంధు తన కార్యక్రమాలు మానుకోవడానికి ఒప్పుకోలేదు. అసలు దీనబంధు సంపన్న కుటుంబంలో పుట్టి పెరిగినవాడు. తండ్రికి కూడా దీనబంధు ఇలా సంఘసేవ అంటూ తిరగడం ఇష్టంలేదు. తండ్రికీ దీనబంధుకూ అభిప్రాయ భేదాలు వచ్చాయి. తండ్రి తన అభిప్రాయాలు సాగనియ్యడని, తండ్రికి తెలియ

కుండా ఇంటినుండి తప్పించుకుని వచ్చి దీనబంధు అనే పేరుతో స్వయం కృషితో తన ధ్యేయం సాధించటానికి పూనుకున్నాడు జగదీశ్. రావుగారికీ కూలీలకూ మధ్య అభిప్రాయ భేదాలు వచ్చాయి. కూలీలు తమ జీతాలు పెంచమని అడిగారు దీనబంధు కూలీల తరపున నిలబడ్డాడు.

వాళ్ళు కోరుతున్నదానిలో న్యాయం ఉంది. ఒక్కొక్కరికి అయిదు రూపాయలు మాత్రమే పెంచమని కోరుతున్నారు. అది పెద్దమొత్తం కాదు." అన్నాడు దీనబంధు రావుగారితో.

రావుగారు వ్యాపారవేత్త...

"అక్కడే నువ్వు పొరపడుతున్నావు. అయిదు రూపాయలు పెద్ద మొత్తంకాదు కానీ ఒక్కొక్కడికి అయిదు రూపాయలు పెంచటంవల్ల నాకు కొన్ని లక్షలు నష్టం వస్తుంది."

అదే, ఆర్థిక వ్యత్యాసాలలో అసలు రహస్యం. అనేకమంది అయిదు రూపాయలైనా లేకుండా అలమటిస్తేనే కాని ఒకడి దగ్గిర లక్షలు పోగుపడవు.

అందరికీ ఒక్క అయిదు రూపాయల భాగ్యం పంచగలిగితే ఒక్కచోట లక్షలు పోగుపడకపోయినా చాలామందికి కనీసావసరాలు తీరుతాయి.

దీనబంధుని తన మార్గానికి మళ్ళించలేకపోయారు రావుగారు. విసిగి పోయారు. చివరి అస్త్రం ప్రయోగించారు.

"నాకు ఒక్కగా నొక్క కుతూరు జానకి. ఈ ఆస్తంతా దానిదే! నువ్వు నా మాట వినకపోతే జానకిని నీకిచ్చి పెళ్ళిచెయ్యను. అంతేకాదు. నీ మీద వైరం సాధించగలను."

ఈ మాటలకు వెంటనే సమాధానం చెప్పలేక పోయాడు దీనబంధు... అతడు ఎన్నైనా వదులుకోవటానికి సిద్ధంగా ఉన్నాడు. దేనినైనా ఎదుర్కొవాలని నిశ్చయించుకున్నాడు. కానీ జానకిని వదులుకోవాలంటే...

రావుగారు విజయగర్వంతో నవ్వుకున్నారు.

ఆ తరువాత జానకిని ఏకాంతంగా కలుసుకున్నాడు దీనబంధు.

"జానకీ! ఒక ఆదర్శానికి నా జీవితాన్ని అంకితంచేశాను. అది వదులుకొంటే జీవచ్ఛవాన్నే! నువ్వు లేకపోయినా బతకలేను. నువ్వే చెప్పు. ఏం చెయ్యమంటావో?"

జానకికీ బాధగానే ఉంది. జానకికి దీనబంధు కథ అంతా తెలుసు...ఒక



ఆదరంకోసం సంపదనూ, తండ్రినీ వదిలివచ్చిన వ్యక్తిని, తనకోసం, ఆ ఆదర్శాన్నే వదులుకోమనడం అమానుషంగా తోచింది...

"నువ్వు నీకు మంచిదని తోచిందే చెయ్యి దీనూ! నా కోసం లొంగి పోకు. నేను నీకు దూరమవుతానా? ఒక్కనాటికీ కాను. నేను పసిపిల్లను కాను. నన్నెవరూ నిర్బంధించలేరు. ఏనాటికైనా నేను నిన్నే పెళ్ళిచేసుకుంటాను" అంది.

ఆ మాటలతో కొండంత బలంవచ్చింది దీనబంధుకు. కూలీల తరపున రావుగారి నెదిరించి విజయం సాధించాడు. కూలీల జీతం పెరిగింది. కానీ రావుగారు దీనబంధును క్షమించలేదు.

ఒకరోజు సంఘంలో కూర్చుని మిగిలిన సభ్యులతో మాట్లాడుతోన్న దీనబంధు దగ్గిరకి కొందరు దొంగలు హడావుడిగా వచ్చిపడ్డారు. ఆ వెనుకే పోలీసులు. దీనబంధు తెలివైనవాడు. క్షణాలలో విషయం అర్థంచేసుకున్నాడు. మెరుపులా పారిపోయాడు. అంత హడావుడిలోనూ జానకిని కలుసుకుని మళ్ళీ వస్తానని చెప్పి మరీ పారిపోయాడు.

ఆ దొంగతనం దీనబంధు చేయించినట్లు దొంగలు చెప్పారు. దీనబంధు కోసం పోలీసులు వేట ప్రారంభించారు.

దీనబంధు తప్పించుకు తిరగసాగాడు. అలా తిరగటంలో ఒకసారి ఒక దొంగ దీనబంధు జేబులో పర్సు, సూట్‌కేస్ తీసుకుని పారిపోయాడు. దీనబంధు వెన్నాడటంతో ఆ దొంగ పరిగెత్తి పారిపోబోయి టాక్సీకింద పడిపోయాడు. నామరూపాలు తెలియకుండా నలిగిపోయాడు. సూట్‌కేస్ బట్టి, పర్సులో దొరికిన ఆధారలనుబట్టి పోలీసులు దీనబంధు మరణించాడని ప్రకటించారు. దీనబంధు ఆలోచనలో పడ్డాడు. తను ఇలా అజ్ఞాతవాసం చేస్తూ సాధించగలిగిన దేమీలేదు. బయటపడితే పోలీసుల చేతుల్లో చిక్కి జైలులో మగ్గటం తప్ప గత్యంతరంలేదు. తనమీద నేరం ఆపాదించినవాళ్ళు దాన్ని రుజువుచెయ్యగల సామర్థ్యం ఉన్నవాళ్ళు.

సరిగ్గా ఆ సమయంలోనే దీనబంధు తండ్రికి జబ్బుగా ఉందనీ, కొడుకు కోసం కలవరిస్తున్నాడనీ వార్త తెలిసింది. దీనబంధు తండ్రిని చేరుకున్నాడు. తండ్రి, తల్లి, అక్కలు, చెల్లెళ్ళు, అందరూ ఎంతో సంతోషించారు. దీనబంధు దీనబంధుగా అవతారం చాలించాడు. తండ్రి అండదండలతో జగదీశ్‌గా రాజకీయలలో చేరాడు. మంత్రికాగలిగాడు. మంత్రి పదవిలో ఉండి తన ఆదర్శాన్ని సాధిస్తున్నాడు. ఇంకా సాధించాలనుకుంటున్నాడు.

ఊపిరి బిగబట్టి కథంతా విన్నాడు మల్లేశ్...తన ఎదుట ఉన్న ఆ నిస్వార్థ మూర్తిని స్వార్థపరుడని అన్నందుకు సిగ్గుపడ్డాడు.

"రమేష్ కోసం దీనబంధు వచ్చి బోనులో నిలబడితే ఇంక మంత్రి జగదీష్ సాధించగలిగినదేమీ ఉండదు. జైలులో మగ్గవలసిందే!" అన్నాడు మంత్రి జగదీశ్.

"కానీ దీనబంధు బోనులోకి రాకపోతే రమేష్ అన్యాయంగా బలై పోతాడు."

"అదే ఆలోచిస్తున్నాను. ఒక్కరోజు గడువియ్యి. రేపటిలోగా ఏదో ఒకటి నిర్ణయించుకుంటాను."

భారంగా వెళ్ళిపోయాడు మల్లేశ్.

ఆ మరునాడు జగదీశ్ చిరునవ్వుతో వచ్చి దీనబంధుగా బోనులో నిలబడ్డాడు.

## 9

జగదీశ్ మాట్లాడటం మొదట పెట్టాడు.

"నేను దొంగతనం చెయ్యలేదు. చేయించలేదు.

అలాంటి చట్టవిరుద్ధమైన చర్యలకు నేనెప్పుడూ పూనుకోను. కానీ పోలీసులను తప్పించుకుని పారిపోయాను. అదే నేను చేసిన నేరం. ఆ పరిస్థితుల్లో అంతకంటె గత్యంతరం లేకపోయింది. నేరం నామీద ఆరోపించబడింది. నేను నిర్దోషినని నిరూపించుకోగలిగే ఆధారాలు లేవు. అప్పుడూ లేవు. ఇప్పుడూ లేవు. నేను నిర్దోషినని నిరూపించగలిగిన ఒకే ఒక వ్యక్తి ఈ బోనులోకి వచ్చి సాక్ష్యం చెపితే తప్ప చట్టం దృష్టిలో నేను దొంగగా శిక్ష అనుభవించవలసినదే!"

"కాదు! మంత్రి జగదీశ్ దొంగ కావటం అసంభవం! ఇలాంటి అన్యాయం జరగటానికి వీల్లేదు!"

కొన్ని వేల కంఠాలొక్కసారిగా అరిచాయి.

అప్పటివరకు తల పట్టుకుని కూర్చున్న రావుగారు లేచారు.

"అవును? దీనబంధు...జగదీశ్...నిర్దోషి!" అన్నారు. ఆయన కంఠం దృఢంగా గట్టిగా పలికింది. కోర్టు రావుగారిని బోనులోకి పిలిచింది...రావుగారు మాట్లాడటం మొదలుపెట్టారు.

'నేను వ్యాపారస్థుణ్ని. దుర్మార్గుణ్ని కాను. ఏ విధమయిన దుర్మార్గాలూ ఎన్నడూ నేను చెయ్యలేదు...నా వ్యాపారం అభివృద్ధి చేసుకోవాలనేది మాత్రమే నా సంకల్పం. దీనబంధుమీద నాకేవిధమయిన కోపమూ లేదు. పైగా ఎంతో అభిమానం ఉండేది. మా జానకిని ఇచ్చి పెళ్ళి చెయ్యాలనుకున్నాను కూడా... కానీ దీనబంధు సిద్ధాంతాలకూ, నా వ్యాపార సూత్రాలకూ పొందిక కుదరలేదు. అతని మాట ప్రకారం నడిస్తే నేనిలా ఆస్తి సంపాదించలేను. సాధారణమైన లాభాలు వచ్చి ఉండేవి! వ్యాపారస్థుడి దృష్టి ఎప్పుడూ డబ్బుమీదే ఉంటుంది. వ్యాపారంలో ఉన్నంతవరకూ లక్షాధికారి అయినా నయాపైసను కూడా విలువైనదిగానే చూస్తాడు. చూడాలి! దీనబంధుకు ఎంత సహాయమైనా చేస్తానన్నాను. నాకు అడ్డు నిలవవద్దన్నాను. కానీ దీనబంధు నా సంపదనూ, జానకినీ కూడా తిరస్కరించి తన మాటమీద నిలబడ్డాడు. తండ్రినీ తండ్రి సంపదనూ కాలదన్నిన వ్యక్తికి ఇదొక లెక్క కాదని ఇప్పుడర్థమయింది. నాకు అన్నింటికంటె నా వ్యాపారం ముఖ్యం ... దీనబంధును నా మార్గంలోంచి తొలగించాలనుకున్నాను. ఆ దోపిడి నేనే చేయించాను. ఆ నేరం దీనబంధు మీదకు వచ్చేలా పన్నాగం కూడా నాదే! ఆనాడూ ఈనాడూ దీనబంధు ఆధ్వర్యంలో నడుస్తోన్న యువజన సంఘం సమాజంలో మంచి చెయ్యడానికి పాటుపడిందే కాని చట్ట విరుద్ధమయిన చర్య లేవీ చెయ్యలేదు. రమేష్ లాంటి

యువకులనేకులు దీనబంధు ప్రోత్సాహంతో ముందుకు వచ్చి కృషిచేస్తున్నారు. వాళ్ళలో ఏ దోషమూ లేదు. . .నాయుడిగారి అబ్బాయి పోలీసుల కందకుండా పారిపోయి ఆ సమయానికి సంఘంలో తెలిసినవాళ్ళుంటే అక్కడ దాక్కున్నాడు. అంతకుమించి నాయుడుగారి అబ్బాయికి సంఘానికీ సంబంధం లేదు. ప్రస్తుతం సంఘంలో వచ్చిన అస్తవ్యస్తతలకు ఫలితంగా నాయుడిగారి అబ్బాయి, ఇంకా అలాంటి యువకులు అనేకమంది నిష్కారణంగా పాడైపోతున్నారు. సాధక బాధకాలు విచారించకుండా చర్యలకు దిగుతున్నారు."

రావుగారి స్టేట్‌మెంట్ విని జనం మరొకసారి నిర్ఘాంతపోయారు.

బోనులోంచి బయటకు రాగానే జగదీశ్ దగ్గిరగా వచ్చి అతని రెండు చేతులూ పట్టుకున్నారు రావుగారు.

"దీనబంధూ! నేను నీకోసం ఎంతగా పరితపిస్తున్నానో. . .ఒక్కసారి నువ్వు కనిపిస్తే బాగుండునని ఎందరు దేవుళ్ళకు మొక్కుకుంటున్నానో ఊహించ గలిగితే......"

జగదీశ్ ఆశ్చర్యంగా చూసారు. . .

"మీలో ఈ మార్పు వచ్చిందని ఊహించగలిగితే. . ."

"అవును! నువ్వే దీనబంధువని అనుకోగలిగితే. . ."

నవ్వారు రావుగారు. . .

"నాకు జానకి ఒక్కత్తే సంతానం. నేనూ వాళ్ళ అమ్మా జానకిని అపు రూపంగా పెంచుకున్నాం. జానకి కూడా అందుకు తగినట్లే పెరిగింది. నీకు తెలుసుగా . . . జానకి నిన్ను మరిచిపోతుందని ఆశపడ్డాను. మరొక మంచి సంబంధం చూడవచ్చని ఆశపడ్డాను. కానీ నువ్వు మరణించినట్లు పత్రికలలో వార్త చదవగానే జానకికి మెంటల్ షాక్ వచ్చింది. దేశ విదేశాలలో ఎంతగా ప్రయత్నించినా జానకిని మామూలు మనిషిని చెయ్యలేకపోయాను. నా జానకి అలా అయిపోయిన తరువాత నా వ్యాపారమూ, సంపదా . . . ఇదంతా ఎవరి కోసం? జానకిని మళ్ళీ మనిషిగా చెయ్యగలిగినది నువ్వొక్కడివేననే ఆశతో నీకోసం ఎదురుచూసాను ఇన్నాళ్ళూ. కానీ. . ."

"కానీ. . .?"

"నువ్విప్పుడు మంత్రి పదవిలో ఉన్నావు. సంపన్నుల ఇంటి బిడ్డవు. జానకిని. . ."

"రావుగారూ! నేను చచ్చిపోయిన సంగతి వినగానే మతిస్థిమితం పోగొట్టు

కుంది జానకి. మరి నేనేనా అంత కసాయివాణ్ని? ఇంతవరకూ నేను పెళ్ళి చేసుకోనిది దేనికి? నేను పట్టుబడే ప్రమాదం ఉందని తెలిసినా రోజూ మీ ఇంటికి ఎందుకు వస్తున్నాను? రోజూ జానకికి తెల్లగులాబీగుత్తి బహూకరించి అది చూడగానే పెదవులమీద విరిసే చిరునవ్వును అపురూపంగా గుండెలలో ఎందుకు దాచుకుంటున్నాను?" రావు గారు ఆశ్చర్యంగా "మీరు. . . నువ్వు . . . రోజూ జానకికి తెల్లగులాబీగుత్తి తేవటం చూసాను. కానీ అది ఫార్మాలిటీ కోసం అనుకున్నాను" అన్నాడు.

"లేదు. జానకికి తెల్లగులాబీ అంటే ఇష్టం. ఇదివరలో నేను జానకిని ఎప్పుడు కలుసుకున్నా తెల్లగులాబీగుత్తి తెచ్చి ఇచ్చేవాడిని . . . ఇప్పుడూ ఆ గుత్తి చూడగానే ఆ జ్ఞాపకాలలో బ్రతుకుతున్న జానకి చిరునవ్వు నవ్వుతుంది. ఆ నవ్వు చూస్తూ నేను బ్రతుకుతున్నాను. . .''

"చేజేతులా ఎంత ఘోరం చేసాను?" నిట్టూరుస్తూ అన్నాడు రావుగారు.

"దీనబంధూ! ఇప్పుడైనా నువ్వు జానకిని పెళ్ళిచేసుకోగలవా? నన్ను అర్థం చేసుకో! కోర్టులో సాక్ష్యం చెప్పినందుకు ప్రతిఫలంగా ఇది కోరటంలేదు. ఒక తండ్రిగా కోరుతున్నాను. . .''

"రావుగారూ! ఈ విషయంలో మీరు నన్ను బ్రతిమాలుకోనక్కర్లేదు. జానకిని నా దాన్నిగా చేసుకోవాలని నేనే మిమ్మల్ని ప్రాధేయపడుతున్నాను.''

రావుగారి కళ్ళు చెమ్మగిల్లాయి.

దీనబంధుకు ఏక్సిడెంట్‌లో కళ్ళుపోవటమూ, గొంతు మారటమూ, రెండూ అబద్ధం! తనను ఇతరులు గుర్తించకుండా ఆ కట్టుకథ కల్పించుకున్నాడు దీనబంధు. కాదు. మంత్రి జగదీశ్ జానకిని పెళ్ళిచేసుకున్నాడు. జానకీ జగదీశ్‌లను కళ్ళ పండువగా చూసుకుని వాళ్ళమీద అక్షింతలు జల్లి పోలీసులకు లొంగిపోయారు రావుగారు.

## 10

సుగుణ ముఖం ఆనందంతో కళకళ లాడుతోంది. కొత్త చీర కట్టుకుంది. తలంటిపోసుకున్న తలలో రెండు గులాబీలు ముడుచుకుంది.

"ఇవాళ మనింట్లో పండగ. రమేష్ మీద కేస్ కొట్టేసారు!" అంది.

ఆ ఆనందంలో మల్లేశ్ భాగం పంచుకోలేకపోయాడు. రమేష్ మీద కేస్

కొట్టేసినందుకు సుగుణ పొందుతున్న ఆనందం అతని మనసును సన్నగా కోస్తోంది.

భారంగా కళ్ళు మూసుకుని పడుకున్నాడు. ఆ మూసుకున్న కళ్ళముందుకు అనేక దృశ్యాలు వస్తున్నాయి.

తనకోసం గేమ్స్ కోర్టుని ఎత్తేసిన సుగుణ...తనతో 'అమ్మాయి గారూ!' అనే పిలుపు మానిపించి 'సుగుణ' అని పిలిపించిన సుగుణ... "నీకే సహాయం కావాలన్నా చేస్తాను" అనే రమేష్...తను సహాయం చేస్తోన్న సంగతికూడా తెలియకుండా రహస్యంగా మాస్టార్ ద్వారా సహాయం చేసిన సుగుణ...తండ్రినీ సంపదను వదిలి దీనులకోసం పాటుపడిన దీనబంధు...తన కథ విని తనకు సహాయం చేయమని ఉత్తరం రాసిన దీనబంధు...దీనబంధు ఉత్తరాన్ని ప్రాణ ప్రదంగా దాచుకుని తనకు సహాయం చేసిన జానకి...సాటివారంతా డబ్బుకు లొంగిపోయినా తానొక్కడూ నిజాయితీకి నిలబడిన చంద్రయ్య...తను ఎంత సంపాదిస్తోన్నా అతి నిరాడబరంగా అనాధల సేవలో గడిపే సుగుణ...

నిజాయితీ...నిస్వార్థం...సంఘసేవ...మంచి. .మమత. .మానవత్వం. . .

స్థిమితంగా ఉండలేకపోయాడు మల్లేశ్. లేచి సుగుణ దగ్గిరకి వచ్చాడు.

"సుగుణా! నువ్వు అసలే సంతోషంగా ఉన్నావు. నీకింకా శుభవార్త చెప్తాను." అన్నాడు.

"చెప్పండి!" అంది సుగుణ చిరునవ్వుతోనే.

"రమేష్ తలిదండ్రులు కట్నంగా కోరిన డబ్బు నేనిస్తాను. రమేష్‌కి అభ్యంతరం లేకపోతే, నిన్ను స్వీకరించగలిగితే, నువ్వు రమేష్ దగ్గిరకి వెళ్ళిపోవచ్చును. . ."

నిర్ఘాంతపోయింది సుగుణ. .కొన్ని క్షణాలు అలాగే మల్లేశ్ ముఖంలోకి పరిశీలనగా చూసింది. చూసి చూసి చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వుతోపాటు సుగుణ ముఖంలోకి వచ్చిన వికాసాన్ని చూసి మల్లేశ్ మనసు చివుక్కుమంది. రమేష్ దగ్గిరకు పంపిస్తాననగానే ఎంత ఆనందం సుగుణకు!

వడిలిపోయిన మల్లేశ్ ముఖం చూస్తూ పకపక నవ్వేసింది సుగుణ. చటుక్కున ముఖం పక్కకు తిప్పుకున్నాడు మల్లేశ్. ఆపుకోలేని క్రోధంతో అతని మనసు ఉడికిపోయింది. తను సుగుణకోసం బాధపడుతున్నాడు. ఆ బాధను అర్థం చేసుకుని పకపక నవ్వుతోంది సుగుణ. ఒక్కమాట 'నేను రమేష్ దగ్గిరకు వెళ్ళను.' అని అనటంలేదు. పైగా ఎంత వికాసం ఆ ముఖంలో. . .



"రమేష్ తలిదండ్రులు, అంటే మా అత్తా మావా, కోరిన కట్నమెంతో తెలుసా? పదివేలు!. . ."

"ఇస్తాను..." సుగుణవైపు తిరగకుండానే ఎటో చూస్తూ అన్నాడు మల్లేశ్ ..

"బాగా ఆలోచించుకోండి! ఇప్పుడు మీరు రమేష్ పక్షాన నిలబడటంతో ఇక మిదట రాజుగారు, నారాయణగారు మిమ్మల్ని వాళ్ళ వకీలుగా చేసుకోక పోవచ్చును!"

గిర్రున సుగుణవైపు తిరిగి కోపంగా చూసాడు మల్లేశ్.

"పరవాలేదు. నా అదృష్టానికి ఆధారం నా మెదడులో ఉంది ఎవరి జేబుల్లోనూ లేదు. అదిగాక నా విషయం నువ్వేమీ ఆలోచించక్కర్లేదు. నీ విషయం ఆలోచించుకో!"

"నా విషయం ఆలోచించేటందుకు మీరున్నారుగా. . ."

చిలిపిగా నవ్వుతూ అంది. సుగుణ. . .

ఆ చిలిపినవ్వు ఇంక తనకు శాశ్వతంగా దూరమయిపోతుంది. .ఆ నవ్వును వదిలి. .తన గుండెలోని ఈ వెలుగును దూరంచేసుకుని తను ఎలా బ్రతక గలడు?

"రమేష్ దగ్గిరకి వెళ్ళిపోవటం నీకు ఇష్టమేనా?"

ఎక్కడో నూతిలోంచి వస్తున్నట్లుగా వచ్చింది మల్లేశ్ గొంతు.

సుగుణ మళ్ళీ నవ్వింది. మల్లేశ్‌కు మండిపోతుంది. . .

"ఎందుకా నవ్వు?"

"ఎవరైనా సంతోష సమయంలో నవ్వక ఏడుస్తారా!" ఇంక భరించలేక పోయాడు మల్లేశ్. ఉక్కుచే నిలబడలేకపోయాడు.

ఇంతటి నిరాశలోనూ ఒక ఆశారేఖ. .రమేష్ సుగుణను తిరస్కరించవచ్చు . . .మరొకరిని పెళ్ళి చేసుకుని కాపురం చేసిన స్త్రీని తాను భార్యగా అంగీక రించలేనని అనవచ్చును. అలా సాధారణంగా ఏ మగవాడైనా అంటాడు.

మల్లేశ్‌ని చూడగానే రమేష్ ఆదరంగా కౌగిలించుకున్నాడు. ఆ స్నేహం ముందు మల్లేశ్ ముడుచుకుపోయాడు. ఎందుకో మొదటినుంచీ రమేష్ నిష్క పటమైన చిరునవ్వు ముందు. .అతని నిస్వార్థమైన ఆదరం ముందు మల్లేశ్ ముడుచుకుపోతూనే ఉన్నాడు. ఆ రోజు రమేష్‌ని పరిశీలనగా చూస్తూ మనసులో 'అన్నివిధాలా సుగుణకు తగిన భర్త' అనుకున్నాడు బాధగా.

"రమేష్! సుగుణ నిన్ను ప్రేమించింది . .కట్నం కోసం మీరిద్దరూ ఒకరి కొకరు దూరం కానక్కర్లేదు. ఆ కట్నం నేనిస్తాను. ఇప్పటికయినా నువ్వు సుగుణను స్వీకరించగలిగితే నా అభ్యంతరం లేదు. నేను డైవర్స్ ఇస్తాను."

మల్లేశ్ మాటలు విని రమేష్ విభ్రాంతితో "నీకు మతిపోయిందా మల్లేశ్!" అన్నాడు. మల్లేశ్ మనసులో ఆశాతరంగాలు నాట్యమాడాయి. రమేష్ సుగుణను స్వీకరించలేడు. అది సహజం! "కొన్నాళ్ళు నాతో కాపురం చేసిన సుగుణను స్వీకరించటానికి కొంత విశాలహృదయం కావాలి. నాకు తెలుసు. కానీ...ఆ మాత్రం ప్రేమ సుగుణమీద నీకుందని అనుకున్నాను..."

పకాలున నవ్వాడు రమేష్. సుగుణ కూడా అచ్చు ఇలాగే నవ్వింది.

"మల్లేశ్! నా అభ్యంతరం అందుకు కాదు. ఏనాడైనా సుగుణను స్వీకరించ డానికి నేను సిద్ధమే! సుగుణను నేను ప్రేమించిన మాట నిజమే? ఆ ప్రేమ ఇప్పటికీ నా మనసులో ఉంది."

కృంగిపోయాడు మల్లేశ్...

"మరి...?" అన్నాడు, ఏం వినవలసి వస్తుందోనని భయపడుతూ.

"ప్రేమ నా ఒక్కడి మనసులో ఉంటే సరిపోతుందా? పెళ్ళనేది ఇద్దరికీ సంబంధించిన వ్యవహారం!"

"సుగుణ నిన్ను ప్రేమించింది!"

"ఎవరు చెప్పారు నీకు?"

తెల్లబోయాడు మల్లేశ్... "సుగుణ...సుగుణ..." అని తడబడ్డాడు...

"సుగుణ చెప్పిందా నీకు తను నన్ను ప్రేమిస్తున్నట్లు? అసంభవం! అలా సుగుణ ఎప్పుడూ చెప్పదు!"

అవును. సుగుణ ఎన్నడూ అలా చెప్పలేదు...

"నేను అనుకున్నాను."

"ఎలా అనుకున్నావు? సుగుణ ఇక్కడికి వచ్చి నాతో కలిసి...కాదు...మాతో కలిసి పనిచేస్తున్నందుకా? సుగుణ మొదటినుంచీ అంతేగా! మరిచిపోయావా? అసలు సుగుణ మూలంగానే నే నీ సంఘంలో చేరాను."

"సుగుణ మొదటినుంచీ అంతేగా..." అన్న మాటలు మల్లేశ్ మనసును చిత్రంగా తాకాయి. అవును, ఆనాడు తనకోసం గేమ్స్‌కోర్టునే ఎత్తేయించిన సుగుణను ఈ జన్మలో మరిచిపోలేడు...

"నాకంతా విచిత్రంగా ఉంది. ఇన్నాళ్ళూ నువ్వూ సుగుణా ప్రేమించి పెళ్ళి చేసుకున్నారని నేననుకుంటున్నాను. నువ్వేమో నేనూ సుగుణా ప్రేమించుకున్నామని అనుకుంటున్నావు..."

ఈసారి మల్లేశ్‌కి మతిపోయినట్లుంది.

"నేనూ సుగుణా ప్రేమించుకున్నామని అనుకున్నావా?"

"ప్రేమించుకోలేదా? మరి మీరు పనికట్టుకొని సుగుణను ఎందుకు పెళ్ళి చేసుకున్నట్లు?"

మల్లేశ్ తల ఎత్తలేకపోయాడు. సిగ్గుతో తల దించుకున్నాడు...రమేష్ చెప్పటం మొదలుపెట్టాడు.

"మా నాన్నగారు కట్నం అడిగినమాట నిజమే! కానీ నేను మా నాన్నగారిని ఎదిరించయినా సుగుణను చేసుకోవటానికి సిద్ధపడ్డాను. ఆ సమయంలో సుగుణ నన్ను కలుసుకుంది. "రమేష్! మీ నాన్నగారి మాట కాదనకు. పోనీ,

కాదనలేనని మా నాన్నతో చెప్పు. ప్రస్తుతం నాన్న ఉన్న స్థితిలో ఆయనను నేను ఎదిరించలేను" అంది.

నాకు అంతులేని ఆశ్చర్యం కలిగింది...

"అంటే? నన్ను పెళ్ళిచేసుకోవటం నీ కిష్టంలేదా?" అన్నాను.

"నన్ను క్షమించు రమేష్!" అంది. నాకు చాలా కష్టం వేసింది.

"నువ్వు ఎవరినైనా ప్రేమిస్తున్నావా?" అని అడిగేసాను_ సుగుణ సమాధానం చెప్పలేదు. నవ్వేసింది. ఆ తరువాత సుగుణ నిన్ను పెళ్ళిచేసుకుంది. సుగుణ ఎప్పుడూ తనకిష్టంలేనిపని చెయ్యదు. ఎవ్వరూ ఆవిడచేత చేయించలేరు. అందుకని మీరిద్దరూ ప్రేమించుకున్నారనుకున్నాను..."

ఒక్కటొక్కటిగా అనేక విషయాలు అర్థంకాసాగాయి మల్లేశ్ కి...

పరిచయమైన ఇన్ని రోజులకు మొదటిసారిగా రమేష్‌ను మనసారా కౌగిలించుకున్నాడు మల్లేశ్. ఏ విధమయిన సంకోచమూ లేకుండా హాయిగా నవ్వుతూ "థేంక్యూ రమేష్!" అన్నాడు.

తనను తదేకంగా చూస్తున్న మల్లేశ్‌ని చూసి చిరునవ్వుతో "ఏమిటలా చూస్తున్నారు?" అంది సుగుణ.

"నువ్వు ఫూల్‌వి!" అన్నాడు మల్లేశ్ నవ్వుతూ

ఆ నవ్వు ఎప్పుడూ లేనంతగా ఉంది. ఎప్పుడూ ఉండే సంకోచం తొలగిపోవటంవల్ల...

"ఎందుకని?" అమాయకత్వం నటిస్తూ అడిగింది సుగుణ.

"నాలో ఏం చూసి ప్రేమించావు నువ్వు"

"మీరు డబల్ ఫూల్!"

"ఎందుకని?"

"మీరు అందంగా ఉంటారు. ఆరోగ్యంగా ఉంటారు. తెలివైనవారు. పట్టుదల, కార్యదీక్ష, దృఢ వ్యక్తిత్వం ఉన్నవారు. ఎవరుమాత్రం మిమ్మల్ని ఎందుకు ప్రేమించరు? ఏం తక్కువ మీకు?"

ఇన్నాళ్ళుగా తన అంతరాంతరాళలో తనకే తెలియక వేధిస్తోన్న రహస్యం సుగుణ మాటలలో బయటపడింది మల్లేశ్ కి. అవును తను ఎవరికంటేను ఎందులోనూ తక్కువ కాడు. కానీ ఈ తక్కువ భావం తనలో పాదు కల్పించి ఈనాటి సమాజం...అంతులేని వ్యత్యాసాలతో నిండిన ఈనాటి ఆర్థిక వ్యవస్థ.

తన సుగుణను ఆప్యాయంగా గర్వంగా గుండెలలోకి తీసుకున్నాడు మల్లేశ్.



(గత సంచిక తరువాయి)

## 13

### మూడో ఫకీరు కథ

మూడో ఫకీరు సర్దుకుని కూర్చుని తన కథ ఇలా చెప్పనారంభించాడు :

ఈ అల్పజీవి పర్షియా రాజ కుమారుడు. ఆ దేశానికి రాజైన నా తండ్రికి నేను తప్ప సంతానంలేదు. యౌవనంలో నేను నా మిత్రులతో కలిసి పేకాటా, పాచికలూ, ఇతర జూదాలూ ఆడేవాణ్ణి, లేదా గుర్రంమీద వేటకు వెళ్లి వినోదించేవాణ్ణి

ఒకనాడు నేను వేట ఏర్పాటుచేసి, నా వెంట నా మిత్రులనూ, సహచరులను యావన్మందినీ వెంట బెట్టుకుని బయలుదేరాను. కౌజు పిట్టలనూ, అడవి బాతులనూ కొట్టటానికి డేగలను వదిలి, వాటి వెనకగా గుర్రాలమీద వెళ్లాం. నేను చాలా దూరం వెళ్లినమీదట ఒక మనోహర ప్రాంతం కళ్లబడింది. ఎటు చూసినా అనేక మైళ్ల దూరంవరకూ ఎర్రని పూలుగల ఆకుపచ్చ మొక్కలు కనిపించాయి వాటి అందంచూసి మేం గుర్రాలను మెల్లిగా నడుపుకుంటూ ముందుకు సాగాం.

ఉన్నట్టుండి, మైదానంమీద ఒక నల్ల లేడి కనబడింది. దానిపైన జరీబట్ట కప్పి ఉన్నది దాని మెడకు రత్నాలు పొదిగిన బంగారు గొలుసు ఉన్నది. ఆ

గొలుసుకు బంగారుగజ్జె లున్నాయి. నిర్మానుష్యమైన ఆ ప్రదేశంలో అది నిర్భయంగా సంచరిస్తూ, గడ్డిమేస్తున్నది. మా గుర్రాల గిట్టల చప్పుడు విని, అది ఉలికిపడి తలఎత్తి చూసి, నింపాదిగా వెళ్లిపోసాగింది.

దాన్ని చూడగానే, నాకు ప్రాణాలతో పట్టాలనిపించింది. నేను నా అనుచరులతో, "మీరు ఇక్కడే ఉండండి. నా వెంట రావద్దు" అని చెప్పి, ఆ లేడి వెంట తగిలాను. నే నెక్కిన గుర్రం మంచి వేగంగలది. దానిమీద నేను వేటకుక్కలను కూడా ఏమార్చిపోయి లేళ్లను నా చేతులతో పట్టేవాణ్ణి.

నన్ను చూసి లేడి వాయువేగంతో పరిగెత్తిపోసాగింది. నా గుర్రం కూడా వాయువేగాన్ని అందుకున్నది గాని లేడిని అందుకోలేకపోయింది. నా గుర్రం చెమటలు కక్కుతున్నది. నేను దాహంతో చచ్చిపోతున్నాను కాని చేసేదిలేదు. సాయంకాల మవుతున్నది. ఎంతదూరం వచ్చానో నాకే తెలీదు. ఎక్కడ ఉన్నానో తెలీదు. మృగాన్ని పట్టే ఆశ వొదులుకుని, అంబుల పొది నుంచి ఒక బాణం తీసి, దాన్ని బాణానికి సంధించి, పూర్తిగా లాగి, లేడి తొడకు గురిచేసి వొదిలాను బాణం దాని కాలులో గుచ్చుకున్నది. అది కుంటుకుంటూ కొండలకేసి పరిగెత్తింది నేను గుర్రం దిగి దాన్ని వెన్నంటాను. అది కొండలలో ప్రవేశించింది

నేను లేడివెంట ఎక్కుతూ, దిగుతూ కొంతదూరం వెళ్లాక ఒక గుమ్మటం లాంటి బురుజు కనబడింది. దాన్ని సమీపించేసరికి ఒక ఉద్యానమూ, జలయంత్రమూ కనిపించాయి. కాని లేడి అదృశ్యమయింది.

తెగ బడలిఉండటం చేత నేను జలయంత్రంవద్ద కాళ్లూ, చేతులూ, కడుక్కుంటూండగా, బురుజు దిక్కు నుంచి రోదనమూ, ఆర్తనాదమూ వినిపించింది. "అయ్యో బిడ్డా, ఆ దిక్కుమాలిన బాణం వేసినవాడి గుండెలో గుచ్చుకోరాదా? దేవుడు వాణ్ణి నీలాగే ఏడిపించి నాశనం చెయ్యరాదా?" అని ఎవరో అంటున్న మాటలు నా చెవిన పడ్డాయి

ఈ మాటలు విని నేను బురుజుకేసి వెళ్లాను. తెల్లటి గడ్డం గల ఒక వృద్ధుడైన పెద్దమనిషి, మంచి దుస్తులు ధరించి ఒక పరుపుమీద కూర్చుని ఉన్నాడు లేడి ఆయనకు ఎదురుగా పడుకుని ఉన్నది. ఆయన దాని తొడ నుంచి బాణం తీస్తూ, దాన్ని వేసినవాణ్ణి శాపనార్థాలు పెడుతున్నాడు.

నే నాయనకు సలాంచేసి, చేతులు జోడించి, "అయ్యా, తెలియక ఈ పని చేసినది నేనే. అది మీ లేడి అని నాకు

తెలియదు. దయచేసి నన్ను క్షమించండి" అన్నాను.

"నోరులేని ప్రాణిని హింసించావు. అజ్ఞానంచేత నువు ఈ క్రూరకృత్యం చేసి ఉంటే దేవుడు నిన్ను క్షమిస్తాడు," అన్నాడాయన.

నేను ఆయన సరసనే కూర్చుని, బాణం లాగెయ్యటానికి సహాయపడ్డాను. బాణం బయటికి తీయడం కష్టమయింది. గాయానికి మందుపూసి, లేడిని పోనిచ్చాం. మేం చేతులు కడుక్కుంటూండగా భోజనం వచ్చింది. వృద్ధుడు నాకు భోజనం పెట్టాడు. క్షుద్బాధతీరినాక నేను పక్కమీద నడుం వాల్చి, బడలి ఉండటాన గాఢ నిద్రలో పడ్డాను. నిద్రలో నాకు రోదనమూ, ఆర్తనాదాలూ వినిపించాయి. కాని కళ్లు నులుముకుని చూస్తే ఎవరూ లేరు. గది ఖాళీగా ఉన్నది.

నేను కంగారుపడి చుట్టూ కలయజూశాను. ఒక మూల పరదా కట్టి ఉన్నది. నేను దగ్గరికి వెళ్లి పరదా ఎత్తి చూశాను. మేలైన వస్త్రం కప్పిన ఒక అరుగుమీద దేవతా స్త్రీలాంటి అందం గల పద్నాలుగేళ్ల పిల్ల యూరోపియన్ దుస్తులు ధరించి కూర్చుని ఉన్నది. ఆమె కాళ్లమీద ముఖం పెట్టుకుని వృద్ధుడు బోర్లా పడుకుని విలపిస్తున్నాడు. ఆయన దుఃఖసముద్రంలో మునిగిఉన్నాడు.

ఆ పిల్ల అందమూ, ఆ వృద్ధుడి దుఃఖమూ చూసేనరికి నాకు మైకం వచ్చింది. అది గమనించి వృద్ధుడు నా ముఖాన పన్నీరు చిలికి, నాకు స్పృహ తెప్పించాడు. నేను లేచి ఆ పిల్లవద్దకు వెళ్లి, వందనం చేశాను. ఆమె నా వందనం స్వీకరించలేదు. నోరు మెదపలేదు.

"ఓ దివ్యసుందరీ! పలకరిస్తే జవాబు చెప్పనంత అతిశయం ఏమంతలో ఉన్నది?" అని ప్రశ్నించాను. "నిన్ను ఇంత అందంగా సృష్టించినవాడికోసమైనా జవాబు చెప్పు. నేను ఇక్కడ అభ్యాగతిని. అభ్యాగతులను సంతోషపెట్టటం ధర్మం" అన్నాడు.

నేను ఎంత మాట్లాడి కూడా ప్రయోజనం లేకపోయింది. అంతా విని ఆమె రాతి బొమ్మలాగా ఉండిపోయింది. నేను ముందుకు వచ్చి ఆమె పాదాలు స్పృశించాను. అవి చాలా గట్టిగా తగిలాయి, తీరాచూస్తే అది అజూర్ (ముస్లిముల విశ్వకర్మ) తయారు చేసిన శిలాప్రతిమ!

ప్రతిమలను ఆరాధించే ఆవృద్ధుడితో, "నేను నీ లేడికాలు బాణంతో కొట్టాను. నువు నీ ప్రేమతో నా గుండెకు తూట్లు కొట్టావు. నీ శాపం నాకు తగిలింది. ఇదంతా ఏమిటో వివరంగా చెప్పు. దీన్ని ఎందుకు తయారుచేశావు? నగరంలో ఉండక, ఈ కొండలూ,

అడవులూ పట్టి ఎందుకుంటున్నావు. నీ అనుభవమంతా చెప్పు,'' అన్నాను.

నేను చాలా ఒత్తిడి చేసినమీదట ఆయన, "నువ్వు వినాలనుకుంటున్నదే నా కొంపతీసింది. అది విని నువ్వు కూడా ఎందుకు నాశనం అవుతావు?" అన్నాడు.

"ఆగు, ఇంకా నీ సాకులు వినను. సంగతి అంతా చెప్పు, లేదా నీ ప్రాణం తీస్తాను," అన్నాను.

నా ఆగ్రహమూ, పట్టుదలా చూసి ఆయన, "ఓ యువకుడా, ఎవరూ ప్రేమతో దహించుకు పోకుండా దేవుడు అనుగ్రహించాలి. ప్రేమచేతనే కదా ఆడది భర్తతోబాటు చితిమీద కాలి పోతుంది! ప్రేమ ఎలాంటి ఆపదలు కలిగిస్తుందో చూడు. ఫర్హాద్, మజ్నూల కథలు అందరికీ తెలిసినవే, నా కథ వించే నీకేం ఒరుగుతుంది. ఇల్లూ, వాకిలీ వొదిలి, నిష్కారణంగా దేశ దిమ్మరివై పోతావు" అన్నాడు.

"చాలించు, నీ స్నేహం నాకవసరం లేదు. నన్ను శత్రువుగా ఎంచుకో. నీకు ప్రాణాలమీద ఆశలుంటే నీ కథ చెప్పు,'' అన్నాను.

ఆయన కంట నీరు పెడుతూ, నిట్టూర్చి, "ఈ నిర్భాగ్యుడి కథ విను'' అంటూ ఇలా చెప్ప నారంభించాడు.

ఈ సేవకుడి పేరు నేమాన్ సుయ్యా, నేను పెద్ద వర్తకుణ్ణి, చిన్నతనంలోనే వర్తకం చేస్తూ ప్రపంచమంతా చూశాను. రాజులందరి దర్శనమూ చేశాను. నేను ప్రపంచమంతా చూశాను గాని యూరప్ లోని దీవి చూడలేదని నా కొకసారి అనిపించింది. ఆ రాజునూ, అక్కడి సైనికులనూ, ప్రజలనూ చూడలేదు. అక్కడి ఆచార వ్యవహారాలు తెలీవు. అక్కడికి పోవాలని బుద్ధిపుట్టింది. మిత్రులవద్దా, ఎరిగినవాళ్లవద్దా సలహాలు పొంది ప్రయాణం నిశ్చయించాను. సమస్త దేశాలకూ చెందిన వింత వస్తువులను తీసుకుని, వర్తక బృందాన్ని సమకూర్చి, అందరితోనూ కలిసి నౌకమీద బయలు దేరాను. గాలి అనుకూలించి, కొద్ది మాసాలలో మేం ఆ దీవి చేరి, నగరంలో బసచేశాం.

అందంలో గాని, ఔన్నత్యంలో గాని మరే నగరాన్నీ దానితో పోల్చటానికి లేదు. అన్ని వీధులూ, సందులూ రాళ్లు పరిచి ఉన్నాయి; నీళ్లు చల్లి, ఎక్కడా ఒక గడ్డిపరకగాని, మట్టిగాని లేకుండా అద్దంలాగున్నాయి. భవనాలు వేరు వేరు రంగులు కలిగి ఉన్నాయి. వీధులలో రెండుపక్కలా రాత్రివేళ దీపాలు వెలిగాయి. నగరం వెలపల తోటలలో పూలూ, కాయలూ విరివిగా ఉన్నాయి. స్వర్గంలో తప్ప ఇంకెక్కడా అలా ఉండదేమో! ఆ నగరాన్ని ఎంత పొగడినా అతిశయోక్తి కాదన్నమాట.

మా వర్తకుల రాకగురించి చాలా

చెప్పుకున్నారు. ఒక అంతరంగికుడు అనేక మంది సేవకులను వెంటబెట్టుకుని గుర్రంమీద మా బసకువచ్చి, వర్తకుల పెద్ద ఎవరని అడిగాడు. మిగిలినవాళ్లు నన్ను చూపారు. అతను నే నున్న చోటికి వచ్చాడు నేను మర్యాదగా లేచి అతనికి స్వాగతం చెప్పాను. ఇద్దరమూ పరస్పర వందనాలు చేసుకున్నాం నేను అతన్ని పరుపుమీద కూర్చోబెట్టి దాలీసు ఇచ్చి, ఆయన రాకకు కారణం అడిగాను

అతను నాతో, "అనేక మంది వర్తకులు సరుకులతో వచ్చిన సంగతి విని మా రాజకుమార్తె వర్తకులను తీసుకు రమ్మన్నది. అందుచేత మీరు, రాజకుమార్తెకు తగిన వస్తువులను తీసుకుని రండి," అన్నాడు.

"నేను చాలా బడలి ఉన్నాను. ఇవాళ్టికి మన్నించాలి. రేపు నా సర్వస్వమూ, నా ప్రాణాలతో సహా ఆమె ముందుంచగలను. నా కున్నదంతా రాజకుమార్తెకు అర్పిస్తాను ఆమె తాను కోరినదల్లా తీసుకోవచ్చు," అన్నాను.

ఇలా అని, అతనికి చందన తాంబూలా లిచ్చి పంపేశాను. వర్తకు లనందరినీ పిలిచి, వారివద్ద ఉన్న అందమైన వస్తువులన్నిటినీ పోగుచేసి, మర్నాడు ఉదయం రాజభవనానికి వెళ్లాను. ద్వారపాలకుడు నా రాక గురించి లోపల తెలపగానే నన్ను ప్రవేశపెట్టమని ఉత్తరువు వచ్చింది. నిన్న వచ్చిన అంతరంగికుడే బయటికి వచ్చి, నా చేతులు పుచ్చుకుని, స్నేహపూర్వకంగా మాట్లాడుతూ లోపలికి తీసుకుపోయాడు. రాజకుమార్తె దాసీలుండే గదులు దాటి ఒక గొప్ప మందిరం ప్రవేశించాం.

మిత్రమా, చెబితే నమ్మవుగాని ఆ ప్రదేశం దేవతలు తిరిగేదిలా గున్నది. ఎటుచూసినా కన్ను కదల్చటానికి లేనంతా అందం కనిపించి, పారవశ్యం కలిగింది అతికష్టంమీద నేను నా కాళ్ల మీద నిలబడి, రాజకుమార్తెను సమీపించాను. ఆమెను చూసిన క్షణంలో నా ఒళ్లంతా జలదరించి, మూర్ఛ వచ్చినంత పని అయింది. నేను ఎలాగో ఆమెకు వందనం చేయగలిగాను. ఆమె కుడి ఎడమల అందమైన స్త్రీలు చేతులు కట్టుకుని నిలబడి ఉన్నారు.

నేను నా వెంట తెచ్చిన రకరకాల రత్నాలూ, మేలురకం వస్త్రాలూ, అపూర్వ వస్తువులూ రాజకుమార్తె ముందుంచాను. అన్నీ ఆమెకు అర్హమే అయినా, ఆమె వాటిలో కొన్ని ఎన్నుకున్నది. ఆమె వాటిని తన ప్రధాన దాసికిస్తూ, జాబితా ప్రకారం వాటి మూల్యం మర్నాడు ఇస్తామన్నది. ఆ వంకన మళ్లీ మర్నాడు కూడా రావచ్చును గదా అని సంతోషిస్తూ నేను ఆమెకు వందనం చేశాను. ఆమెవద్ద సెలవు పుచ్చుకుని వచ్చేటప్పుడు నేను

ఉన్మత్తుడిలాగా ఒక మాటకు మరొక మాట అన్నాను. ఈ స్థితిలో నేను సరాయికి తిరిగి వచ్చాను నా మనస్థితి సరిగాలేదు. నా క్షేమయిందని మిత్రులు అడిగారు. బుర్ర వేడెక్కిందని చెప్పాను. ఆ రాత్రి నేను పక్కమీద ఈ కోటా ఆ కోటా పడుతూ గడిపాను.

తెల్లవారగానే మళ్లీ రాజకుమార్తెను చూడబోయి, అంతరంగికుడి వెంట అంతఃపురం ప్రవేశించాను. నిన్నటి దృశ్యమే మళ్లీ కంటపడింది. రాజకుమార్తె నన్ను ఆదరంతో ఆహ్వానించి, ఏదో ఒక పని చెప్పి అందరినీ పంపేసింది. చివరకు తాను ఒంటరిగా మిగిలినాక ఆమె అభ్యంతర మందిరానికి తన వెంట నన్ను తీసుకుపోయింది నేను కూర్చున్నాను.

"ఈ వస్తువులను మీరు తెచ్చారు గనక వాటిమీద మీరు ఎంత లాభం కోరుతారు ;" అని ఆమె అడిగింది.

"తమరిని చూడాలనుకున్నాను. భగవంతుడు ఆ కోరిక తీర్చాడు. ఇంకేమీ కోరను. నాకు ఇహమూ, పరమూ కూడా దక్కాయి. పద్దులో చూసిన ధరలతో సగం అసలు ఖరీదూ, సగం లాభమూనూ," అన్నాను.

"పద్దు ప్రకారమే ముట్టజెప్పుతాను. అంతేగాక మీకు ప్రత్యేక బహుమానాలు కూడా ఇస్తాను—కాని నాకొక్క పని చేసిపెట్టాలి. చేస్తానని మాట ఇస్తే చెబుతాను," అన్నదామె.

ఈ కింకరుడి ధన ప్రాణాలు తమవే. వాటితో తమకు ఏమైనా పనిబడితే అది నా అదృష్టంగా భావిస్తాను. తమరు ఏం చెయ్యమన్నా మనస్పూర్తిగా చేస్తాను.

ఈ మాటలు వింటూనే ఆమె సిరాబుడ్డి తెప్పించి, చిన్న ఉత్తరం రాసి, దాన్ని ఒక ముత్యాల సంచిలో పెట్టి, ఆ సంచిని ఒక చేతిరుమాలులో చుట్టి నాకిచ్చింది. ఆమె తన చేతినుంచి తీసి ఒక ఉంగరం కూడా నాకిచ్చి, "నగరానికి అవతలి వైపున హృదయోల్లాసమనే పెద్దతోట ఉన్నది. అక్కడికి వెళ్లండి. వైఖుస్రూ అనేవాడు దానికి రక్షకుడు. వాడికి నా ఉంగరం ఇచ్చి నా సలాములు అందజెయ్యండి. ఈ ఉత్తరానికి జవాబు తీసుకుని, ఇక్కడ ఉన్నట్టుగా తిరిగి రావాలి. ఈ సహాయానికి తగిన బహుమానం ఇచ్చి మిమ్మల్ని సంతోషపెడతాను," అన్న...

ఆమెవద్ద సెలవు పుచ్చుకుని, దారి అడుగుతూ రెండు కోసులు నడిచి తోటను చూశాను. అక్కడికి చేరేసరికల్లా ఒక సాయుధభటుడు నన్ను పట్టుకుని తోట ద్వారంవద్దకు తీసుకుపోయాడు. అక్కడ ఒక సింహంలాటి యువకుడు కూర్చుని ఉన్నాడు. అతను భారీగా కవచం ధరించి ఉన్నాడు. అతనికి ఎదురుగా 500 మంది యువకులు



ఆయుధాలు ధరించి ఒక సోల్పులో నిలబడి, అతని ఆజ్ఞలు నిర్వర్తించటానికి సిద్ధంగా ఉన్నారు.

నేను అతనికి సలాం చేశాను. అతను నన్ను దగ్గిరికి పిలిచాడు నేను అతనికి రాజకుమార్తె ఉంగరం ఇచ్చి చేతి రుమాలు చూపి, ఉత్తరం ఒకటి తెచ్చానని చెప్పాను. వెంటనే అతను తన వేలు కొరుక్కుని, నెత్తిమీద బాదుకుని, "నీ ప్రారబ్ధం నిన్ను పంపిందల్లే ఉంది. తోట లోకి పద. సైప్రస్ చెట్టుకు ఒక బోనుకట్టి ఉంటుంది. అందులో ఒక యువకుడు బంధించి ఉన్నాడు. అతనికి ఉత్తరం ఇచ్చి, జవాబు తీసుకుని, శీఘ్రమే తిరిగి వెళ్లు," అన్నాడు.

నేను వెంటనే తోటలోకి వెళ్లాను. అది తోట కాదు, నందనవనం. పూల మళ్లలో రంగురంగుల పూలున్నాయి. జలయంత్రాలాడుతున్నాయి. చెట్టుమీద పక్షులు మనోహరంగా కూస్తున్నాయి. కొంతదూరం వెళ్లేసరికి ఒక చెట్టుకు వేళ్లాడే బోను కనిపించింది. అందులో ఒక సుందరాకారుడు కనిపించాడు. నేను తలవంచి అతనికి నమస్కరించి, బోను చువ్వలగుండా ఉత్తరం అందిం చాను. అతను ఉత్తరం తీసి చదివి, ఎంతో ఆవేశగా రాజకుమార్తె క్షేమ సమాచారం అడిగాడు

మేం మాట్లాడుకోవటం పూర్తికాక ముందే నీగ్రో సైనికులు అన్నివైపుల నుంచీ వచ్చి నా మీదపడి, కత్తులతోనూ, ఈటెలతోనూ నన్ను కొట్టారు. ఒంటరి నిరాయుధుణ్ణి ఏం చెయ్యగలను? క్షణంలో నేను గాయపడి, పడిపోయి, మూర్ఛిల్లాను.

నాకు తిరిగి ఒళ్లు తెలిసేసరికి ఇద్దరు సైనికులు నన్ను దేనిమీదనో పడుకోబెట్టి మోసుకుపోతున్నారు. వాళ్లు ఇలా మాట్లాడుకుంటున్నారు.

"ఈ శవాన్ని మైదానంలో పారేస్తే కుక్కలూ, కాకులూ క్షణంలో పీక్కుతినేస్తాయి," అన్నాడు ఒకడు.

"ఆ మాట రాజుకు తెలిస్తే మనిద్దరినీ ప్రాణాలతో పాతిపెట్టి మన పిల్లలను పచ్చడి నూరుతాడు. అలాటి బుద్ధిలేని పని చెయ్యటానికి మనకేమన్నా ప్రాణాల మీద విరక్తి పుట్టిందా?" అన్నాడు రెండోవాడు.

వాళ్ల సంభాషణ విని నేనా కరటక దమనకులతో, "నాయనలారా, నన్ను కనికరించండి. నాలో ఇంకా కొనప్రాణం ఉన్నది. నేను చచ్చాక మీ యిష్టం వచ్చినట్టు చేతురుగాని. చచ్చినవాడు బతికున్నవాళ్లకు లోకువ. అసలు నాకేమయిందో చెప్పండి. నన్నెందుకు చావబాదిచారు? మీరెవరు? ఈ కాస్త చెప్పండి. మీకు పుణ్యం ఉంటుంది," అన్నాను.

వాళ్లు నాపైన కనికరించి, "బోనులో బంధించి ఉన్నవాడు ఈ దేశపు రాజుగారి అన్న కొడుకు. అతని తండ్రి మొదట్లో గద్దె ఎక్కాడు. ఆయన చచ్చిపోతూ తన తమ్ముడితో, తన అనంతరం రాజు కావలసిన తన కొడుకు ప్రాయం కానివాడనీ, తమ్ముడే రాజ్యభారం చూస్తూ, కుర్రవాడికి యుక్త వయసు వచ్చాక వాడికి తమ్ముడు కూతురునిచ్చి పెళ్లి చేసి, రాజ్యాభిషేకం చెయ్యమనీ, అన్నాడు. ఆయన పోగానే తమ్ముడు రాజయాడు. ఆయన అన్న చెప్పినట్టు చెయ్యక, తన అన్న కొడుకు పిచ్చివాడని ప్రకటించి, వాణ్ణి బోనులో పెట్టి తోటలో ఉంచి, తోటలోకి ఒక్క పురుగు ప్రవేశించటానికి సాధ్యం కాకుండా గట్టి బందోబస్తు చేశాడు. ఆయన ఆ కుర్రవాడికి అప్పుడప్పుడూ ఘాటైన విషం కూడా పెట్టాడు. కాని వాడి శరీరతత్వం ఏమిటో, విషాన్ని కూడా జీర్ణించుకున్నాడు. ఈ రాజు కుమారుడూ, రాజకుమార్తె ప్రేయసీ ప్రియులు. ఆమె రాజభవనంలో కుములుతున్నది. ఇతను బోనులో కుములుతున్నాడు, ఆమె అతనికి నీ ద్వారా ఉత్తరం పంపింది. ఈ సంగతి చారుల ద్వారా రాజుకు వెంటనే తెలిసింది. ఆఫ్రికను సైనికులు పంపబడి, నీ ప్రాణం తీశారు. రాజకుమారుణ్ణి చంపటం ఎలాగని రాజు వజీర్ను అడిగితే, ఆ దొంగముండాకొడుకు రాజకుమార్తె చేత్తోనే ఆ నాయకుణ్ణి రాజు సమక్షంలో హత్య చేయించమని సలహా ఇచ్చాడు," అని చెప్పారు.

"ప్రాణం పోయేలోపుగా ఆ దృశ్యం చూడాలి, పోదాం పదండి," అన్నాను.



వాళ్లు చివరకు అంగీకరించారు. తీవ్రంగా గాయపడి ఉండికూడా నేను వాళ్లతోబాటు వెళ్లి మౌనంగా ఒక మూల నిలబడ్డాను. రాజు ఆసనంమీద కూర్చుని ఉన్నాడు. రాజకుమార్తె చేతిలో ఖడ్గం ఉన్నది. రాజకుమారుణ్ణి బోనునుంచి బయటికి తీసి, రాజుముందు నిలబెట్టారు. తలారి పనికి నియోగించబడిన రాజకుమార్తె కత్తిపట్టుకుని అతన్ని సమీపించింది. కాని తీరా దగ్గిరికి వచ్చాక ఆమె కత్తిని దూరంగా పారేసి, ఆతన్ని కౌగలించుకున్నది.

రాజకుమారుడు ఆమెతో, "ఇలా చావటం నాకు సంతోషమే. అక్కడ నీ కోసం ఎదురుచూస్తాను." అన్నాడు.

"నిన్ను చూడటానికి ఈ సాకు దొరికింది" అన్నది రాజకుమార్తె.

ఈ దృశ్యం చూసి రాజు మండిపడి వజీర్‌తో, "ఇది చూడటానికా నన్ను పట్టుకొచ్చావు?" అన్నాడు.

రాజకుమార్తె నర్మసఖి రాజకుమార్తెనూ, రాజకుమారుణ్ణీ విడదీసి, రాజకుమార్తెను అంతఃపురానికి తీసుకుపోయింది.

వజీరు కిందపడిన కత్తిఎత్తుకుని, ఒక్క వేటుతో రాజకుమారుడి ప్రాణం తీయటానికి ముందుకు ఉరికాడు. అతడు ఎత్తిన కత్తి విసిరేలోపల ఎక్కడినుంచో ఒక బాణం వచ్చి వజీరు నుదుట నాటుకున్నది. ఆయన పడిపోయాడు.

ఈ వింత చూసి రాజు శీఘ్రమే తన భవనానికి వెంచేశాడు. రాజకుమారుణ్ణి తిరిగి బోనులో పెట్టి, తోటకు తీసుకుపోయారు. నేను కూడా ఉన్నచోటనుండి

కదలి, బయలుదేరాను దారిలో నాకు ఒక మనిషి తగిలి, నన్ను రాజకుమార్తె వద్దకు తీసుకుపోయాడు. నేను దారుణంగా గాయపడిఉండటం చూసి, ఆమె నన్ను ఒక వైద్యుడికి అప్పగించి, నేను చప్పున కోలుకునేటట్టు చూడమన్నది. "నువు ఇతన్ని ఎంత శ్రద్ధగా చూస్తే నా నుంచి అంతగా లాభం పొందుతావు," అని ఆమె వైద్యుడితో అన్నది.

ఆమె చెప్పినట్టే ఆ వైద్యుడు నన్ను ఎంతో శ్రద్ధతో చూసి చికిత్సచేసి, నలభై రోజులలో ఎప్పటి మనిషిని చేసి రాజకుమార్తెకు చూపాడు.

"ఇంకా ఏమైనా చెయ్యవలసింది ఉందా?" అని రాజకుమార్తె నన్ను అడిగింది

ఆమె అనుగ్రహంవల్ల నేను పూర్తిగా కోలుకున్నానని చెప్పాను. అప్పుడామె వైద్యుడికి బట్టలూ, కానుకలూ ఇచ్చి పంపేసింది. నేను నా మిత్రులనూ, నౌకర్లనూ కలుపుకుని స్వదేశానికి బయలుదేరాను.

మేం ఇక్కడికి రాగానే మిగిలినవారినందరినీ ఇళ్లకు వెళ్లిపొమ్మని, ఈ కొండ మీద ఈ ఇల్లు నిర్మించి, రాజకుమార్తె ప్రతిమ చేయించాను. నా భృత్యులకూ, నౌకర్లకూ వారి వారి సేవలకు తగినట్టుగా బహుమానాలిచ్చి విడిచేశాను. నేను వాళ్లతో, "నేను బతికి ఉన్నంత కాలమూ నాకు తిండి ఉండేటట్టు చూడండి. అది తప్పించి మీరు స్వతంత్రులే," అన్నాను. వాళ్లు నాకు తిండిలోటు లేకుండా చూస్తున్నారు. నేనీ ప్రతిమను ఆరాధిస్తున్నాను. ఇదే నా కథ. (సశేషం)



తన భర్త తప్పతాగి ఉన్నాడనీ, వెంటనే అరెస్టు చేయవల్సిందనీ ఒక స్త్రీ పోలీసు స్టేషన్‌కు ఫోన్ చేసింది. పోలీసులు వెంటనే వచ్చారు. అయితే ప్రతివ్యక్తీ తన ఇంట్లో ఎంతైనా తాగొచ్చుననీ, తాము ఏమీచేయలేమనీ అన్నారు పోలీసులు. విసుగుచెందిన ఆ స్త్రీ తన భర్తను వీధిలోకి నెట్టింది. అతన్ని పోలీసులు వెంటనే అరెస్టు చేశారు.




తమ్ముడిని రైలెక్కించి స్టేషను బైటికి వస్తూ అనుకోకుండా వెనక్కు తిరిగి చూసింది సిరి అడవి తీగెల డిజైను నైలెక్సు చీరె- కత్తిరించిన జుట్టుతో అల్లిన రెండు పొట్టి జడలు - చేతిలో వానిటీ బ్యాగ్ నల్లటి కళ్లద్దాలతో వస్తున్న ఆమెను చూసి చటుక్కున ఆగిపోయింది ఎవరామె? సన్నగా పెదవులలోనే అణిగి పోయింది మాట

అంతలో "ఏయ్ ఆటో! నీ మీటర్ బాగున్నదా? కొత్తదేనా? అందులోమాయ ఏం లేదుకదా?" అధికారస్వరంతో నిలవదీసి అడుగుతోంది ఆమె.

ఆ నడక-ఆ మాటతీరు చూస్తున్న కొద్దీ సిరికి తనకు పియుసిలో క్లాసు మేటయిన రంగేమోనన్న అనుమానం కలిగి అలాగే నిలబడి చూస్తున్నది. కాల ప్రభావంచేత మనుష్యులలో అనేక మార్పులు కలుగుతాయి. శరీరచ్ఛాయ మారవచ్చు. సన్నగా ఉన్నవాళ్లు లావు కావచ్చు. కాని అలవాట్లు మారవు.

తననే చూస్తున్న సిరివంక తినేసేట్టుచూసి చివ్వున వెనక్కు తిరిగి మరొక ఆటోను కేకేసింది ఆమె.

"ఆమె నిస్సందేహంగా రంగే. మనిషి కొంచెం స్థూలమయింది కాని ఏం మారలేదు," అనుకుంటూ "మీరు రైలు దిగి వస్తున్నారా?" అన్నది అప్పుడే పరిచయం చేసుకోబోతున్నట్టుగా.

"నేను ఇక్కడ ఫామిలీప్లానింగ్

యూనిట్‌లో పనిచేస్తున్న డాక్టర్ని. క్యాంపు నుంచి తిరిగి వస్తున్నా" అన్నది కాస్త పెడసరంగా రాగంతీస్తూ. ఇంక పట్టలేక "రంగా! నీ క్లాస్‌మెట్ సిరిని. గుర్తు పట్టలేదూ?" అంటూ దగ్గరగా వచ్చింది.

"నీవు సిరివా? సిరివని నీవు చెప్తే తప్ప నిన్ను ఆనాడు చూసిన వారెవరూ గుర్తుపట్టలేరు. చేతికరపని బారెడు వెంట్రుకలు నీవి. ఆ తలకట్టంతా ఏమయింది? కాలేజి విద్యార్థులను నీ చుట్టూ తిప్పించిన అందమంతా ఏమయింది? మిలమిల మెరిసే నీ శరీరచ్ఛాయ ఏమయిపోయింది? ఆనాటి అందాలసిరిని కురూపిగా చిత్రిస్తే ఎట్లా ఉంటుందో అట్లా ఉన్నావు నీ విప్పుడు." ఆశ్చర్యపడుతూ భుజంమీద చెయ్యేసింది రంగ.

అదొక జన్మ. ఇదొక జన్మ అన్నట్లు చూసింది సిరి. "అయితే నీ వుండటం ఎక్కడ?" అన్నది మాట మారుస్తూ.

'మెడికలాఫీసరు క్వార్టర్సులో."

అపెతలి జేరంకుడరక మొదట రంగ పిలిచిన ఆటోవచ్చి ఆమె కెదురుగా నిలిచింది

"అయితే నీ ఉండే ఇల్లు నాకు తెలుసులే. సాయంత్రపు వేళల్లో నీకు పని ఉండదుగా. నేను వస్తూ ఉంటాలే" అంటూ డాక్టరు ఎక్కిన ఆటో కదిలి పోయిన తరువాత రిక్షా ఎక్కింది సిరి.

సిరి ఇంటికి వచ్చేటప్పటికి పెద్ద కూతురు పన్నెండేళ్ళది ఎదురుగా వచ్చి "అమ్మా, నాన్న నీకిమ్మని పంపారు రెండువందల రూపాయలు" తల్లిచేతిలో పెట్టింది.

వాటిని చూడగానే సిరికళ్లు అశ్రుపూరితమయ్యాయి. నెలనెలా చేతిలోకి వచ్చే ఈ రూపాయలనేనా తాను పెళ్ళి చేసుకున్నది? ఇవేనా తన పిల్లలకు తండ్రి!' కొంతసేపటికి సిరి మనసు ఊరడిల్లింది. కరుకుదనం తలెత్తింది. అవును. ప్రస్తుతం అవే తన పిల్లలకు తండ్రి-తనకు భర్త. ఆ మాత్రమయిన జ్ఞాపకమూ ఆ పిల్లలకు తమ తండ్రినన్న స్మరణా ఉండబట్టే, తన మెడలో తాళి కట్టిన జ్ఞాపకాలు మెదలబట్టే ఐదువందల జీతంలో రెండు వందలైనా పంపుతున్నాడు. అయినా పంపకపోతే ఏం చెయ్యగలదు? ఐదుగురు పిల్లల తల్లి భరణంకోసం దావా వేస్తుందా? సగం ఇప్పించమని ఆయన పై ఆఫీసరుకు చెప్పుకుంటుందా? మనసు మూలిగి మూలిగి సద్దుమణిగింది.

రూపాయలు బీరువాలో పెట్టి మంచం వైపు చూసింది మోహనత పద్మలత- ఇద్దరూ కాళ్ళూ చేతులు జోడిస్తూ ఊ! ఆ! అనుకుంటూ బోసినవ్వులు ఒలకబోస్తున్నారు.

పెద్ద పిల్ల కృష్ణవేణికీ తరువాత పుట్టిన మగపిల్లలిద్దరికీ అన్నం పెట్టి, పొట్లంకట్టి చేతికిచ్చి స్కూళ్ళకుపంపింది.

చిన్నపిల్లలు నిద్రపోతున్నారు. వంట యింటి గడపమీద కూర్చుని ఆలోచనలో పడ్డది.

తన క్లాసుమేటురంగ స్టేనో కూతురు. పి. యు. సి లో మార్కులు బాగావచ్చాయని ఆమె తండ్రి, స్నేహితులు పట్టుబట్టి మెడిసన్‌లో చేర్పించారు. ఫామిలీ ప్లానింగ్ స్కాలర్‌షిప్పుతో చదువు పూర్తిచేసింది.

మరి తను! తండ్రి ఇచ్చే పెద్ద కట్నమూ తన అందమూ చూసి ఎన్నో సంబంధాలు వచ్చాయి. వాటిలో ప్రకాశ రావు సంబంధ మొకటి. పెళ్ళికాగానే అతడికి ఉద్యోగం దొరికింది. అత్త వారింట్లో ఆమె పాదంపెట్టిన వేళ మంచి దన్నారు. తన పేరు సిరి. అదృష్టం కూడా కలిసి వచ్చిందనుకుని మురిసి పోయింది. ఎన్నో పసిడికలలు కన్నది.

పిల్లలు పుట్టారు. ఆడపిల్లల తరువాత ఇద్దరు మగపిల్లలు పుట్టగానే ప్రకాశరావు కూడా సంతోషించాడు ఆ తరువాత ఇద్దరుపిల్లలు పుట్టిపోయిన తరువాత నాలుగు నెలల క్రిందట కవల పిల్లలు పుట్టారు. పిల్లలు పోయినప్పటి నుంచీ తన ఆరోగ్యం దిగజారటం మొదలు పెట్టింది. శరీరచ్ఛాయతగ్గింది. శరీరంలో బలం తగ్గింది. రక్తం పలచబడింది. అందమయినకళ్లు కాంతిహీనంగా మిణుకు మిణుకుమనే దీపాల్లా ఉన్నాయి. అనారోగ్యం వల్ల దేహం ఊరిపోయింది.

ప్రకాశరావేం చేశాడు? చిన్న ఇల్లు- ఆరోగ్యంలేని భార్య-ఎప్పుడూ దేనికో ఒకదానికి ఏడుస్తూ అల్లరిచేసే పిల్లలు- ఇంటికి రాగానే డబ్బులేదనో మందులు కావాలనీ భార్యసణుగుతుందనే భయంతో సాధ్యమైనంత ఆలస్యంగా ఇంటికి వచ్చే వాడు. ఇల్లు నరకంలా కనబడేది. "ఇది ఇల్లా? నరకరూపం" అంటూ కేకలు పెట్టేవాడు. అన్నిటికీ చివాట్లూ, చెంపదెబ్బలూ పెట్టేవాడు. అంటీఅంట నట్లుగా ఇంట్లో ఉన్న కాసేపూ మెదిలే వాడు. ఈ మధ్య ఇంటికి రావటం మానేశాడు. నెలనెలకూ ఖచ్చితంగా రెండువందల రూపాయలు పంపుతాడు. తను ఇంతవరకూ బ్రతికిన స్థాయిలో బ్రతకాలంటే ఆ డబ్బు చాలదు. ఇంత వరకూ ఏవో ఆశలతో రోజులుగడుపుకు వస్తుంటే తన తమ్ముడు వచ్చి ప్రకాశ రావు ఒక చిత్రకారిణిని పెళ్ళిచేసుకున్నా డన్న వార్త వినిపించి వెళ్లాడు.

ఇది నిజమా? అందరూ నిజమన్నా తన మనసెందుకు అంగీకరించదు! తను ప్రేమించి పెళ్ళిచేసుకోలేదు, పెద్దలు చేసినపెళ్ళి. అప్పటి నుంచీ ప్రేమించటం ఆరాధించటం మొదలుపెట్టింది. అతడి కొరకు ప్రాణాన్నయినా త్యజించే స్థాయికి వచ్చింది. తను ప్రకాశరావు మీద ఈగవాలనిస్తుందా? అతడినుమంటి పనిచేశాడంటే ఒప్పుకుంటుందా? ఈ నాలుగు నెలల నుంచీ అనుకుంటోంది.

"మనం కంటికి కనబడని దేవుడిని ఆరాధించటం లేదూ! అట్లాగే ప్రకాశరావును కూడాను" పరిస్థితులతో రాజీపడటానికి ప్రయత్నిస్తోంది.

సిరిని చూడగానే రంగ ఎంతో సంతోషించింది. కాఫీ తాగిన తరువాత "సిరీ! మా బావగారి సంగతి చెప్పు. ఏం పని చేస్తున్నారు? నీ విట్లా అయిపోయావేం? ఏమయినా జబ్బా? చెప్పు? నే నాయనతో మాట్లాడాలి. నీ ఆరోగ్యాన్ని గురించి చెప్పాలి" అంది ఆవేశంతో.

విరక్తిగా నవ్వింది సిరి. "నీవు ఫామిలీ ప్లానింగు డాక్టరువి కదూ! అదంతా చేస్తావు కాబోలు" అంది.

రంగ మందహాసం చేసింది. పిల్లలనుకని ఆరోగ్యం పాడుచేడుకున్న భార్యలను ఎందరో భర్తలు అలక్ష్యం చెయ్యటమూ, పెడదారులు తొక్కటమూ వంటి కేసులెన్నో రంగకు డాక్టరుగా అనుభవం ఉన్నది సిరి జీవితంలో తెర చాటు భాగవతమేదో ఉన్నదని పసి కట్టింది. కాని సిరి అభిమానవతి. కనుక అడిగినా చెప్పదు. రంగ నాగరిక. కనుక ఇటువంటి ఆంతరంగిక విషయాలను అడగలేదు.

వారంరోజులయినా తిరక్కముందే రాత్రి ఎనిమిది గంటలవేళ పల్లవాడిని తీసుకు వచ్చింది చూడమంటూ రంగ దగ్గరికి.

"న్యుమోనియా అన్నసందేహం సిరీ. హాస్పిటల్లో చేర్పించు. నేను జాగ్రత్తగా చూస్తాను" అంది పరీక్షచేసి.

"హాస్పిటల్లో ఉంచితే వీడి దగ్గ రెవరుంటారు రంగా? నే నుండటానికి చేతిలో ఇద్దరు చిన్నపిల్లలు" దిగులుగా చూసింది సిరి.

"ఎవరుంటారని అట్లా దీనంగా మాట్లాడతావేం సిరీ? మా బావగారు లేరూ? ఆయన ఉండ కూడదూ పిల్లవాడి దగ్గర? ఎవరికయినా తల్లీ తండ్రీ కంటె మూతవ మనిషి ఎవరుంటారు?" మందలించినట్టుగా అన్నది.

"రంగా, కడుపులోదాచుకున్నదాన్ని వెళ్ళగక్కించకు.'' తల వంచుకుంది. కాని దుఃఖంతో మనిషి ఊగిపోతున్నది.

కుర్చీలో నుంచి లేచి సిరిభుజంమీద చెయ్యేస్తూ "మీవారు ఏ ఆఫీసులో పని చేస్తారు చెప్పు! నేను మనిషిని పంపించి పిలిపిస్తాను"అర్థిస్తున్నట్టుగాఅన్నదిరంగ.

సిరికి చెప్పక తప్పలేదు ఆ రాత్రికి ఒక ఇంజక్షను మాత్రలు ఇచ్చి మరునాడు హాస్పిటల్‌కు తీసుకురమ్మని చెప్పి సిరిని పంపించింది రంగ. రంగకు ఆడవాళ్ళమీద కంటె మగవాళ్ళమీద జాలి ఎక్కువ. వాళ్ళనుఅర్థంచేసుకునేటంతగా ఆడవాళ్ళు ఎదగాలనీ, అందుకు బాగా లోకజ్ఞానం సంపాదించుకోవాలనీ నమ్ముతుంది. మగవాళ్ళ దుష్టచర్యల కన్నింటికీ ఆడవాళ్ళే కారకులంటుంది. కాని_స్త్రీ ఎంత డాక్టరయినా-ఒక పెళ్ళికాని



స్త్రీ ఇలా అంటుంటే తోటి ఆడవాళ్ళే నవ్వటం మొదలు పెట్టేవారు. చదువు కునే రోజుల్లో స్నేహితులు ఆటలు పట్టించేవారు. అలా ఆలోచిస్తున్న రంగకు ఒకసారి ప్రకాశరావును చూసి మాట్లా డాలన్న కోరిక బలంగా కలిగింది.

రంగ కోరికను గురించి విన్న సిరి పగలబడి నవ్వింది. "మగవాళ్ళ స్వభా వాన్ని కనిపెట్టటం అంత తేలిక కాదు రంగా. ఆడవాళ్ళే మగవాళ్ళ చర్యలకు మూలం అంటావు. శాస్త్రానికి మానవ స్వభావం కట్టుబడి ఉండదు రంగా. ఆడవాళ్ళందరూ ఇంతే-మగవాళ్ళందరూ అంతేనని కచ్చితంగా చెప్పలేము. మన అంచనాలన్నీ సగటువి నీవు ఆయనను మార్చగలననీ సంస్కరించ గలననీ ఏమిటేమిటో ఊహిస్తున్నావు. ప్రయ త్నిస్తే నీకు ఆశాభంగం తప్ప లాభ ముండదు" అంటుంది సిరి.

రంగ కబురుచేసిన రెండు రోజుల తరువాత హాస్పిటల్ కు వచ్చాడు ప్రకాశ రావు ఈ లోపల రంగ సిరిని పిల్లలతో తన ఇంటికి చేర్పించింది. కమల పిల్లలను ఆయాకు ఒప్పగించి సిరి హాస్పిటల్లో పిల్లవాడి దగ్గర ఉన్నది

ఉదయపువేళ మరో అరగంటకు ఆఫీసుకు వెళ్ళాలనగా ప్రకాశరావు హాస్పిటల్ కు వచ్చి పిల్లవాడిని చూశాడు. పిల్లవాడి పరిస్థితి ప్రమాదకరంగాఉందని రంగ చెప్పింది.

"డాక్టర్. నా అదృష్టం కొద్దీ మీరు దేవతలా ఆదుకునిధన్వంతరిలా వైద్యం చేస్తున్నారు. వాడి భారమంతా మీదే. ఏ మందు కావలసినా సందేహించకుండా

వ్రాసి యివ్వండి. తల్లి తెప్పిస్తుంది."
పిల్లవాడిని క్రీగంట మరోసారిచూశాడు. నిద్రలేని కళ్ళతో—శోకభారంతో-నలిగిన బట్టలతో - చెదరిన తలవెంట్రుకలతో దిగులుగా మంచందగ్గర నిలబడిన సిరిని కొనగంట చూశాడు. డాక్టరుకు నమస్కరించి వెళ్ళిపోయాడు. తరువాత రంగ ఎన్నిసార్లు చెప్పిపంపించినా రాలేదు.

"మొండి ఘటం" అనుకుంది రంగ మనసులో. అహర్నిశలూ కనిపెట్టుకుని మంచి మందులు వాడి పిల్లవాడి జబ్బు నయంచేసింది రంగ. తన యింటికి దగ్గరగా ఒక గది అద్దెకు తీసుకుని సిరిని దానిలోఉంచింది. సిరి కవలపిల్లలు రంగ ఆయా దగ్గర ఉంటారు సిరి ఒక చిన్న స్కూల్లో ఉద్యోగం సంపాదించింది.

ఒకనాడు "సిరీ. నీవు పిల్లలు పుట్టకుండా ఆపరేషను చేయించుకో. ఎందుకయినా మంచిది" అన్నది రంగ.

"ఎందుకు మంచిదంటావు!"నవ్వింది రంగ. "మే మిద్దరం ఒక యింటిలో కాపురం చేయటం కల్ల నీ కెందుకా భయం?" అన్నది.

"ఎందుకయినా మంచిది"రంగ బలవంతంమీద సిరికి ఆపరేషన్ జరిగింది. సిరికి బలం పట్టటానికి మందులు ఇచ్చి ఆమెను అన్ని విధాలా కనిపెట్టి చూస్తున్నది రంగ. సిరికి బలహీనత ఆరోగ్యం పట్ల అశ్రద్ధ- జీవితంలో నైరాశ్యము- పిల్లలను గురించిన బెంగ - వీటన్నిటినీ మెల్లమెల్లగా పోగొట్టటానికి ప్రయత్నం చేస్తున్నది రంగ.

సిరికి అర్ధరాత్రివేళ మెలకువ వచ్చి లేచి కూర్చుంటుంది. ఎదుగుతున్న పిల్లలకు తండ్రిని గురించి ఎటువంటి ఆలోచనలు కలుగుతున్నాయోనని భయపడుతుంది పిల్లలు పెద్దవాళ్ళయి తండ్రిని అసహ్యించుకుంటారేమోనని . భిన్నురాలవుతుంది. ఈ సంసారాన్ని సృష్టించి దాన్ని అలవిగాకుండా పెంచి, నన్నీ ఊబిలోదించి మీరు ఆ చిత్రకారిణి కెదురుగా కూర్చుని కిలా కిలా నవ్వుతూ కాలం గడుపుతున్నారా!" అని మనసులోనే ప్రశ్నిస్తుంది. "చిత్రకారిణి చిన్న వయసులోది. సంసార లంపటం పెరగనిది. తనతో పాటు తీరికగా కూర్చుని అహర్నిశలూ కబుర్లు చెప్పి ఆనంద వారాసిలో ముంచెత్తగలది. మరి తను! ఎదిగిన పిల్లల ఎదుట అతడితో సరస సంభాషణలు చేయటాని కిష్టపడని ఐదుగురు పిల్లల తల్లి. కాన్పులతో ఆరోగ్యం చెడిన ఇల్లాలు.

రంగకు హఠాత్తుగా బదిలీఅయింది. సిరిని అట్లా గాలికి వదిలేయటానికి బుద్ధి పుట్టక తనతోబాటు తీసుకు వెళ్ళడానికి ప్రయత్నాలు చేస్తున్నది. సిరి ఇప్పుడు రంగ అండలేకపోతే పిల్లలతో ఒంటరిగా బ్రతకలేదు. గత్యంతరం లేక రంగతో వెళ్ళటానికి నిశ్చయించుకుంది. వెళ్ళే ముందర ప్రకాశరావు కీ సంగతి ఎలా




తెలపాలా అని మార్గాలు వెతుకుతుండగా ఆరాత్రికి రాత్రి నాలుగు వాంతులయి కవల పిల్లలలో ఒకపిల్ల చనిపోయింది.

సిరికి కన్నీళ్ళు రావటంలేదు. మెదడు పనిచేయటంలేదు. ఒళ్ళంతా బిరుసుకు పోయినట్లయింది. నిశ్చలమయిన చూపులతో గోడకానుకుని కూర్చుంది. ప్రకాశరావుకు మళ్ళీ కబురు వెళ్ళింది. కాని అతడు తిరిగి చూడలేదు ఆ మరునాడు కవల పిల్లల్లో రెండో పిల్లకు కూడా వాంతులయ్యాయి. కళ్ళు తేలవేసింది,

సిరికి అయోమయంగా ఉంది. భగవంతుడు తనను నిజంగా పరీక్ష చేస్తున్నాడా అనుకుంది. తనెంత? తన బ్రతుకెంత? పిచ్చుకవంటి తనమీద బ్రహ్మాస్త్రము విసురుతున్నాడు విధాత. అన్నం నీళ్ళు లేకుండా మంచాని కంటుకు పోయింది.

కాని రంగ అంతటితో ఊరుకోలేదు. పనికట్టుకుని ఆఫీసుకు వెళ్ళింది. అక్కడ పిడుగులాంటి కబురు చెవిన పడ్డది. నెల క్రిందట ప్రకాశరావు సెలవుపెట్టి వెళ్లాడని తెలిసింది. ఎన్నాళ్ళు? ఎక్కడికి? ఈ ప్రశ్నలకు జవాబులు ఆమెకు అక్కడ లభించలేదు.

సిరిని ఓదార్చి, బుజ్జగించి తనతో తీసుకువెళ్ళిపోయింది రంగ. సిరికి నెల నెలా వచ్చే రెండువందల రూపాయల రాబడి నిలిచిపోయింది. సిరి తమ్ముడు వచ్చి బ్రతిమిలాడాడు తనవెంటరమ్మని. తల్లి కన్నీళ్లతో జాబులు వ్రాయించింది. కాని సిరి సర్వమూ రంగేనని నమ్ముకున్నానని చెప్పి తమ్ముడిని పంపించేసింది

కాలప్రవాహం ఎనిమిదేళ్లు ముందుకు సాగేటప్పటికి సిరి బి ఏ. ప్యాసయింది.

డైపు పరీక్షలో ఉత్తీర్ణురాలయింది. పెద్ద కూతురు ఇరవై ఏళ్ల దయింది. పట్టభద్ర అయింది. సంగీత జ్ఞానం సంపాదించి లలితసంగీతంలోగానకోకి లయింది. మగ పిల్లలిద్దరూ కళాశాల చదువులలోకి వచ్చారు. రంగ తన జీతంలో నుంచి నూటఏభయి రూపాయల సిరికిచ్చేస్తుంది. సిరి టీచర్‌గా సంపాదించేదీ - ఆడపిల్ల కృష్ణవేణి పాట కచేరీలుచేసిసంపాదించేదీ అంతా కలిపి తన సంసారాన్ని నెట్టుకు వస్తున్నది సిరి.

పిల్లలకిప్పుడు తండ్రి ప్రసక్తిలేదు. అతడిని పూర్తిగా మరచిపోయారు. కాని సిరి మనసులో నీఃచిన ప్రకాశరావు ఆమెను బాధ పెడుతూనే ఉన్నాడు! అతని జ్ఞాపకాలు ఆమెను రాత్రిళ్ళు నిద్ర పోనివ్వవు. కన్నీళ్ళు కార్పిస్తాయి.

హఠాత్తుగా ఒకనాడు రంగ అన్నది ఇంటికి రాగానే "సిరి. మీ ఆయన చని పోయాడనితెలిసినవాళ్ళెవరో చెప్పారు" అంటూ.

సిరికి మీద పిడుగు పట్టినట్టయింది. దగ్గర లేకపోయినా ఎక్కడో ఉన్నా డన్న తృప్తితో-ఎప్పటికయినా వస్తాడే మోనన్న ఆశతో బ్రతుకుతోంది. చని పోయాడు! కడసారిగా ముఖం చూసే భాగ్యమయినా తనకు లేకపోయింది. కుమిలిపోయింది సిరి. కాని, రాల్చటానికి అశృవులు లేవు.

అక్కడక్కడ చేస్తున్న పాటకచేరీల ప్రఖ్యాతితో తన వరుణ్ణి తనే ఎన్నుకుని రిజిస్ట్రారు ఆఫీసులో పెళ్ళిచేసుకుని తల్లి పాదాలకు నమస్కరించింది కృష్ణవేణి.

సిరికి ధైర్యం చెబుతూ ఉంటుంది రంగ. "సిరి. మీ ఆయన ఉంటే నీ పిల్లలు ఇట్లా అభివృద్ధిలోకి వచ్చేవారా? రారు. దుష్టాంగాన్ని ఛేదించాడు భగ వంతుడు అందుకే మిగతా దేహము ఆరోగ్యవంతంగా నిలిచింది" అంటుంది.

సిరి ఎంతో అయోమయంగా ఉంటుంది. ఆ విషయాన్ని తలుచు కున్నప్పుడల్లా. తన జీవితం ఇట్లా ఎందుకు తెల్లవారాలి? భర్త కొన్నాళ్ళు పరిత్యజించటం - చివరకు చనిపోవట మూనా? అతడు చనిపోయినప్పటి కంటె వదిలి పెట్టిన కాలంలోని అనుభవాలూ తన మనసులోని బాధలూ మరింతగా బాధపెట్టటం మొదలు పెట్టాయి.

"ఈ చావు అప్పుడే చస్తే ఎంత బాగుండేది! పిల్లలకు రకరకాల అను మానాలూ-అతడి మీద ఒక విధమయిన అసహ్యమూ కలగకుండా ఉండేవా!" అంటుంది రంగ.

చెవులుమూసుకుంటుంది సిరి "రంగా! అటువంటి మాటలనకే తల్లీ! నేను విన లేను!"

"పిచ్చి సిరీ! నీ వతడిని నీ దగ్గర నిలుపుకోలేక పోయావు. భార్యలో ప్రియురాలిని చాలామంది భర్తలు చూడ



లేరు. సంసారంలో బాధ్యతారహితంగా ఉండాలని కొందరు కోరుకుంటారు. నీవే కనుక సంసార బాధ్యత వహించి నట్లయితే నీ దగ్గరే ఉండిపోయేవాడుగా" అంటుంది రంగ.

"ఆయన చనిపోయినా మన వాదోప వాదాలు అలాగే ఉన్నాయి. రంగా! దయచేసి అటువంటి మాటలని నన్ను ఇంకా చిత్రవధ చేయకు" చేతులు పట్టుకుంది సిరి.

నవ్వొకటి నవ్వి "పోనిలే. ఇవాళ్టికి మరిక ఆయన ఊసెత్తను సరేనా?" అంటుంది రంగ.

సిరికూతురు కృష్ణవేణి భర్తతో కూడా వెళ్ళి పాటకచేరీలు చేస్తున్నది. మదరాసు నగరానికి అభిమానులెవరో ఆహ్వానించగా వెళ్ళింది. పాటకచేరీ అద్భుతంగా ఉన్నది. తమిళ ప్రేక్షకులెంతో ప్రశంసించారు. సంపన్నురాలొకామె బంగారు పైటపిన్ను బహూకరించింది. అందరూ లేచిన తరువాత ఆమెను కారువరకూ సాగనంపి వెనుదిరగబోయిన కృష్ణవేణి డ్రైవర్ సీట్లో ఉన్న ఆయనను చూసి ఉలిక్కి-పడ్డది! ఆమె గొణిగిన మాటలు పెదవుల మధ్యనే నలిగిపోయాయి. మళ్ళీ మళ్ళీ

తిరిగి చూసింది. ప్రక్కన పెనిమిటి ఉన్నాడు, తలవంచుకుని సాగిపోయింది అనుమానం నిజమయితే తలఎత్తుకొని తిరగగలరా? తన కాపురంకూలిపోదూ?

దీపదీపాలవేళ రంగ యింటిముందర క్రీనీడలాంటిది ముందుకు సాగింది. ధైర్యము తెచ్చుకొని అడుగులో అడుగు లేసుకుంటూ వరండాలో నిలబడిన ఆ నీడను చూసి రంగ "ఎవరు? ఏంపని?'' అంటూ గద్దించింది. మరికొంత సేపటికి ముఖంలోకి తెరిపారచూసి ''మీరు చని పోలేదూ!" అన్నది కనుబొమలుపైకెత్తి.

''అంటే! ఎవరు చనిపోయారు?" సిరి కొడుకులు మురళీ వేణూ గదిలో నుంచి బైటికివచ్చారు.

"ఇతడు చనిపోయి పదిసంవత్సరాలు కావచ్చింది." నిర్వికారంతో అన్నది రంగ.

ఆ నీడ బిక్కచచ్చిపోయింది.

మాటల సందడికి సిరి లోపలి నుంచి వచ్చింది.

క్రీనీడ సిరికి సమీపంగావచ్చి "సిరీ నేను చనిపోయినమాట నిజమే. కాని - మళ్ళీ జన్మించాను." అన్నది ఆమె రెండుచేతులు పట్టుకుని.

"కాదు_మీరు చనిపోలేదు. అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ బ్రతికే ఉంటారు. మనం చనిపోవద్దు. బ్రతుకుదాం రండి'' పిల్లలవంక చూడకుండా రంగకు కళ్ళ తోనే పిల్లల నప్పగించి అతడి చెయ్యి పట్టుకుని ముందుకు నడిచింది సిరి. అద దైన సిరి-భర్తను ఎటువంటి పరిస్థితుల లోనూ మరిచిపోలేని సిరి. జరిగినదంతా తన పొరపాటు వల్లనే జరిగిందని తప్పు లన్నీ తనమీద వేసుకున్న సిరి.

అతడి నీడకూడా పిల్లలమీద పడటం ఇష్టంలేని రంగ, "బ్రతికి ఉండే చచ్చిన వాళ్ల సంగతి మీ కెందుకర్రా? మీ తరం చచ్చినా బ్రతికి ఉండాల్సింది! రండి లోపలికి" ఇద్దరి చేతులూ పట్టుకుని తీసుకువెళ్ళింది.



"ఇవాళ నువ్వు బజారు కెళుతున్నావా ?" అన్నాడు ఒక నైట్ వాచ్ మన్ భార్యతో.

"దేనికి? ఏం కావాలి?" అన్నదామె.

"ఒక అలారం గడియారం కావాలి"

"అదెందుకు ?"

"మూడు రోజుల్నుంచీ లేటుగా నిద్రలేస్తున్నా. ఇంటికి వచ్చేటప్పటికి ఆలస్యమైపోతూంది"

# కృష్ణాపహసాగరం

పాపా 010

అచ్చు పనిమీద సాగరం ఊరు వెళ్ళిన మర్నాటి పొద్దుటే శ్రీకంఠం భార్య పార్వతమ్మ వచ్చింది. గోదావరిని చూసి భోరుమంది. ఆవిడ చెప్పినదాని సారాంశ మేమంటే-గోదావరి వెళ్ళిపోడానికి నువ్వే కారణం అంటూ భార్యను శ్రీకంఠం వేధిస్తున్నాడు, గొలుసు అమ్మేశాడు, గుర్రప్పందేలకు వెళ్లాడు. ఇంతలో ఇంటికి రాడు. జరుగుబాటు యిబ్బందిగా కూడా ఉంది. బుజ్జికి మళ్ళీ సుస్తీగా ఉంది. గోదావరిమీద బెంగ పెట్టుకున్నాడు. వీధిలో కాచుకుని ఎదురు చూస్తూంటాడు. సరిగ్గా తినడంలేదు. పిని పినీ అని పలవరిస్తున్నాడు - ఇవీ విశేషాలు.

బుజ్జిముఖం చూసైనా, బుజ్జికోసం ఎలాగైనా ఓసారి రమ్మని కోరింది! గోదావరి రాలేనని చెప్పింది.

పొద్దుట ఆరింటికి వచ్చిన పార్వతమ్మ వచ్చింది వచ్చినట్టుగానే పదింటికి పట్నం వెళ్లి తిరుగు బస్సుకి వెళ్లిపోతూ, "బుజ్జి కేంచెప్పమంటావు? రావాలి సుమీ, ఎలాగైనా రావాలి! రాకపోతే బుజ్జిమీద ఒట్టు!" అంటూ గుమ్మం దిగింది మొదలు, కని పించినంత దాకా అంటూనే వెళ్లింది.

గోదావరి మనస్సుని అదుపులో ఉంచుకోలేకపోయింది. ఏది విన్నా, 'పినీ!' అన్నట్టే వినిపిస్తూన్నది. దేన్ని చూసినా బుజ్జి ముఖమే కనిపిస్తున్నది.

సాగరం వచ్చేదాకా ఆగమన్నది సోమ్మవ్వ. సాయంత్రానికి తిరిగి వచ్చేస్తా నన్నది గోదావరి. వెళ్లేముందు వేణు గోపాలస్వామి గుడి సింహద్వారం ముట్టు కొని మరీ వెళ్లమన్నది అవ్వ. కాని గోదావరికి అదేమీ గుర్తులో లేదు. బుజ్జిని చేతులారా హత్తుకొని ఎత్తుకోవాలి, అంతే!

వెళ్లేముందు అయిదువందలు తీసి పట్టుకుంది.

*    *    *    *

"పినీ! పిన్నీ!" అంటూ కాళ్లకు చుట్టేసుకున్నాడు బుజ్జి. ఈ బుజ్జిని విడిచి ఇన్నాళ్లూ ఎలా ఉండగల్గింది తను?! పూర్వజన్మల్లో యశోద తనేనేమో!...

*    *    *    *

బుజ్జిదగ్గిర కాలాన్నే మర్చిపోయింది. రెండురోజులైన సంగతి గుర్తేలేదు. బుజ్జికింకా కొంచెం జ్వరం తగుల్తూనే ఉంది.

హటాత్తుగా ఊడిపడ్డాడు శ్రీకంఠం. గోదావరి వచ్చినది గమనించి మనిషికి మనిషినే మార్చేసుకున్నాడు.

తను చేసిన గొడవంతా మర్చిపోతున్నాడు. అదృష్టవంతురాలివే కాకుండా మంచిదానివి కాబట్టే బుజ్జికోసం వచ్చినందుకు పొంగిపోతున్నా నన్నాడు చిన్నదానివి గాని కాళ్లు పట్టుకోవా లని పిస్తుందన్నాడు అంత మంచితనం యెలా వచ్చిందో గోదావరికి అంతుబట్టలేదు

బుజ్జి జర్వం ఆవాళ పూర్తిగా పోయింది. దగ్గిరే ఉండమంటున్నాడు- గోదావరిని కదల్నివ్వడం లేదు

"పిన్నీ! క..." అన్నాడు బుజ్జి

"కథ చెప్పాలా? ... కొత్త కథ చెప్తాను-ఎవరూ చెప్పంది, విను... విను," అంటూ మెల్లగా కథ చెప్పడం మొదలుపెట్టింది —

**బంగారు మురళి కథ**

అనగనగా వ్రేపల్లె అనే గొల్లవాళ్ల ఊళ్లో యశోదమ్మ అనే ఒక అమ్మ ఉండేది. ఆ అమ్మకి కృష్ణుడు అనే ముద్దులకొడుకు ఉండేవాడు. కృష్ణుడి నాన్న నందుడికి చాలా ఆవులు, బోలెడు డబ్బు ఉండేవి అంటే యశోదమ్మ మాంఛి డబ్బుగల అమ్మ అన్నమాట."

"ఊఁ..."

"కృష్ణుడికి బంగారంతో ఒక పిల్లిని గగ్ర చేయించి యిచ్చింది వాళ్లమ్మ. బంగారంతో పిల్లనగ్రోవి చేయించాలంటే చాలా డబ్బు అవుతుందన్నమాట కృష్ణుడంటే అంత ముద్దు యశోదమ్మకు. పిల్లిని గగ్రనే మురళి అంటారు బంగారు మురళి, యిచ్చిందన్నమాట, ఊదుకో దానికి"

"ఊఁ..."

"కృష్ణుడికి నేస్తాలు చాలామంది వాళ్లలో ఒక బీద పిల్లవాడున్నాడు వాడిపేరు చెందుడు చెందుడి నాన్నకు ఆవులు లేవు డబ్బులేదు చెందుడికి మంచి బట్టలూ అవీ ఉండేవికావు. స్నేహితులు వాళ్లు తొడుక్కో-డానికి పనికిరానివి యిస్తే తొడుక్కు-నేవాడు చెందుడికి వాళ్లమ్మ ఒక వెదురుకర్రతో చేసిన మురళి యిచ్చింది చెందుడు ఆ మురళిని ఊదుతూ కృష్ణుడికి చూపించాడు. కృష్ణుడు చెందుడి మురళి తీసుకొని ఊదాడు బంగారం మురళికంటే ఆ వెదురు మురళితో ఎంతో బాగా వాయించాడు. కృష్ణుడేంచేశాడో తెలుసా?! బంగారు మురళిని చెందుడికి యిచ్చి వెదురుకర్ర పిల్లంగ్రోవిని తను తీసుకున్నాడు

'చెందూ ! నువ్వేం-యీ బంగారం మురళిని మి నాన్నకు యిచ్చి అమ్మమను దాన్ని అమ్మితే చాలా డబ్బు వస్తుంది నీకు మంచి బట్టలూ, ఆవులూ అవీ కొనమను,' అని చెప్పాడు

చెందు అలాగే చేశాడు. కృష్ణుడు వెదురు పిల్లంగ్రోవిని ఊదుతూ అమ్మ దగ్గిరకెళ్లాడు యశోద బంగారు మురళి ఏదీ అని అడిగింది

'దాన్ని చెందుడికి యిచ్చేశానమ్మా,



అది బాగా ఊదటంలేదు వాడి పిల్లం గ్రోవి తీసుకున్నాను ఇది చూడు! ఎంత బాగా ఊదుతుందో!!" అంటూ ఊదాడు. ఎంతో బాగుంది ఊదటం ఆవులన్నీ వచ్చాయి. పెయ్యలు పాలు తాగడం మానేసి గంతులేస్తూ చేరాయి గొల్లవాళ్లందరూ వచ్చారు యశోదమ్మ మాత్రం కోపం తెచ్చుకుంది కృష్ణుడి చేతిలోని వెదురు మురళి లాక్కొనిఆవుల సాల్లోకి విసిరేసింది

ఒరేయి కృష్ణమ్మా! నువ్వలాంటి వెదురుకర్ర పట్టుకోకూడదు, మనం గొప్పవాళ్లం చెందుడిలాంటి వాళ్లతో నేస్తం చెయ్యకూడదు వాడు నీ బంగారం మురళిని కాజేశాడు, దొంగ పిల్లాడు. వాళ్లు మంచివాళ్లు కారు' అని కోప్పడింది

"ఊఁ..."

యశోదమ్మ మరొక బంగారం మురళిని చేయించి కృష్ణుడికి ఇచ్చింది. కృష్ణుడు దాన్ని పట్టుకొంటూండగానే అది వెదురుకర్ర పిల్లనగ్రోవి అయిపోయింది

"ఇదేంటమ్మా! మళ్లీ వెదురు ముక్కనే యిచ్చావు?" అన్నాడు కృష్ణుడు. యశోదమ్మ ఆశ్చర్యపడింది "నీకు బంగారం మురళినే యిచ్చాన్రా నాయనా, ఏంటో మరి!" అంది.

అప్పుడు కృష్ణుడు అన్నాడు, 'నువ్వు తప్పుచేశావు. బీదవాళ్లు, వాళ్లు మననేం చేయలేరని చెప్పి చెందుడిని దొంగ అన్నావు. వాళ్లు మంచివాళ్లుకారు అన్నావు అందుచేతనే నేను దొంగను, చెడ్డవాడిని అయ్యాను గనకనే నేను పట్టుకోగానే వెదురుముక్క అయ్యింది. నువ్వు మరెప్పుడూ అలాగ బీదవాళ్లని అలా అనకూడదు తెల్సా! అందరు పిల్లలూ నేనే అనుకో. ఎవర్ని చెడ్డ అన్నా నాకే తగుల్తుంది. మరెప్పుడూ

అలా అనుకోను - అనను - అను !" అన్నాడు.

యశోద అలాగే అంది మరెప్పుడూ బీదవాళ్లని పెద్దవాళ్లని అనను-అనుకోను అని వెంటనే వెదురుముక్క బంగారం మురళి అయింది.

కృష్ణుడు ఆవులసాల్లోకి పరుగెత్తి వెళ్లి చెందుడిచ్చిన మురళిని పట్టుకున్నాడు. అదీ బంగారం మురళే అయింది.

"చూశావా ! అమ్మా తప్పు తెలుసుకొని, తప్పు చెయ్యం అనగానే యిది కూడ బంగారం మురళి అయింది దీన్ని కూడా చెందుడికే యివ్వు, వాళ్లు చేసిన వెదురు పిల్లంగ్రోవినే యిమ్మను. దాన్నే నా దగ్గిరుంచుకొని ఊత్తాను కావలిస్తే దానికే బంగారంతో కట్లూ అవీ కట్టించు ముత్యాలు కుచ్చుకట్టు" అన్నాడు కృష్ణుడు

'అలాగే కృష్ణయ్యా!' అని యశోద కృష్ణుణ్ణి ఎత్తుకొని వెన్నముద్దలు తినిపించింది.

"విన్నావా బంగారు మురళి కథ !" అని ముగించింది గోదావరి. కథ వాడికి బాగా ఉందనిపించినప్పుడు బుజ్జి ఊం కొట్టడు, కళ్లతోనే చెప్తాడు.

"పిన్నీ ! మరి . పా. గో" అన్నాడు బుజ్జి. "పాడతాలే !...ఆ పాటే పాడతాను మరి...," అంటూ గోదావరి,

"గోరంత దీపమ్మ
కొండలకు వెలుగు
గోపాలకృష్ణమ్మ గోవులకు వెలుగు
మాడంత దీపమ్మ మేడలకు వెలుగు
మా చిన్న అబ్బాయి మా కళ్ల వెలుగు
జో జో..." అంటూ పాడుతూందే

బుజ్జి కళ్లు మూస్తున్నాడు. పాడితే ఆపాటే పాడాలి బుజ్జికి యెన్నిసార్లయినా

గోదావరికి నచ్చిందీ, వచ్చిందీ ఆ పాటే. ఆ పాట పాడినప్పుడల్లా గోదావరికి నాన్న జ్ఞాపకం వస్తాడు 'మాచిన్న అబ్బాయి-బదులు మా చిన్న అమ్మాయి-అని పాడుతూ జోకొట్టేవాడు. గోదావరికి ఆ పాట మహా యిష్టం, ఎన్నిసార్లు పాడడానికైనా

బుజ్జిని చూసుకొంటూ రెండు రాత్రులై నిద్దరలేదు గోదావరికి అలాగే బుజ్జి మంచం పక్కనే చాపమీద నిద్ర పోయింది

* * *

...మళ్లీ కళ్లు తెరిచేసరికి...తను శ్రీకంఠం చేతుల్లో ఉంది కెవ్వుమని విదల్చుకొని నేలమీద పడింది అది బుజ్జి ఉన్న గదికాదు శ్రీ కంఠ తలుపు అడ్డుగెడ బిగించి, రెండు కాళ్లూ ఎడంగా పెట్టి నిల్చుని నవ్వుతూ ప్రారంభించాడు. "నువ్వేదో రంభా ఊర్వశివని మోహం పట్టలేక కాదు, నా కసి తీరాలి ! వాడేదో అమృత భాండమని చేసుకున్నాడే, ఆ పాలకుండలో విషం నింపి వొదిలి



పెడతాను. బతికున్నంతకాలం నువ్వు కుళ్లిపోవాలి!

''ఆరోజు వీధిలో నిలబెట్టి అవమానిస్తుంటే తొంగికూడా చూశావుకావే! ద్రౌపది డాబామీంచి తొంగిచూసి నవ్వింది నువ్వు కనపడకుండా పరాభవం చేశావు

"రావణుడు కీచకుడు చాలా మంచి వాళ్లేనంటాను. స్త్రీనిఆశించారంతే, పాపం అమాయకులు నాది దుర్యోధనుడి తెగ దుర్యోధనుడు కూడా మంచివాడే, నలుగుర్లో బట్టలు లాగేస్తే చాలను కున్నాడు. మొన్న మొన్నటి నౌకాళీ అత్యాచారాల ఆ ఘోరముష్కరులు కూడా నాకు సాటిరారు. వార్ని జాతిమత వైషమ్యాల అజ్ఞానంవల్ల అఘాయిత్యాలు చేశారు 'అంతకు మించినవాళ్లు యిక్కడే ఉన్నారని నేను రుజువుచేస్తాను. నీ మీదే మోహమో ఏదో ఉంటే నేనిలాగ పెద్ద ఉపన్యాసాలిస్తూ నిల్చోను. కసి! నా కసి ఎంత న్యాయమైందో చెప్పి మరీ కసి తీర్చుకుంటాను నా నెత్తిమీద గాయం మానిన పెద్ద చార జుట్టు అడుగున కనిపించదు గాని, అది మీ

అమ్మ లేచిపోయిన దానికి నేను పొందిన శిక్షలాంటి మచ్చ !.. "

"నన్ను చంపు, కత్తి తెచ్చిపొడు!'' గోదావరి ఎదుటి గోడకు జేరబడి నోరు విప్పగలిగినంత మేర అన్నది

"ఉరి తీస్తారు తర్వాత నన్ను భార్య పిల్లడూ ఉన్నారు !'

''నేనే ఆత్మహత్య చేసుకున్నట్టు కాగితం రాసిస్తాను."

"నా కసి తీరడానికి నీ చావు చాలదు నువ్వు బతుకుతూనే యమ యాతన పడాలి నీ మీద చాలా ఆశలు పెట్టుకున్నాను. మీ అత్తకు తోడుగా పనికీ దానికీ సర్దుబాటుగా ఉంటావనీ, నీ వల్ల ఇంటికి సాయంకూడా ఉంటుందను కున్నాను. కొంతమంది, పెళ్లయినవాళ్లు కూడా పేరుకి ఉద్యోగాలు చేస్తూ బోలె డంత సంపాదిస్తూ, వేణ్ణీలకి చన్నీల తోడన్నట్లు గుట్టుగా ఇళ్లెత్తుతున్న ఆడ వాళ్లు నాకు తెలుసు నీకూ మూడు ముళ్లూ వేద్దామనుకున్నాను కూడ. వయసుంటే చాలు ఆడది ఎంతకైనా తగును. అలాంటివాళ్ల నెంతమందినో నేను యీ పట్నంలో ఎరుగుదును. అంతా సమాజంలో గౌరవం పొందుతూన్న వాళ్లే. నిన్నూ అలాగే మంచి వెలుగులో పెడదామనుకున్నాను కాని అంతా తలకిందులు చేశావు !...మీ అత్త రెండో ఆట సినిమాకెళ్లిందిలే ! కన్న బిడ్డ జ్వరంలో ఉన్నా ఆ మహాతల్లికి సినిమా చూడకతప్పదు ! మొదటిరోజే చూసేసి తెల్లారగానే అందరికీ చాటాలి! . నువ్వెంత కేకలు పెట్టినా లాభంలేదు. తప్పించుకోలేవు ! నా కసితీరా..."

అంటూ శ్రీకంఠం అడుగు ముందుకు వేశాడు.

ఆ గదిగోడల నిండా దేవుళ్ల పటా లున్నాయి ఊదొత్తుల పొగతో అద్దాలు మసిబారి దేముళ్ల కళ్లకేదీ కనిపించ నివ్వకుండా !

శ్రీకంఠం గోదావరిని పట్టుకున్నాడు ఆమెలో అగ్నిపర్వతం బద్ధలైంది తలుపులు వేసి పిల్లిని కొట్టగూడదన్నట్ల యింది దయ్యంపట్టినట్లు గోదావరి రెండు చేతులతో శ్రీకంఠం కంఠాన్ని గోళ్లతో గుచ్చేస్తూ నొక్కేస్తూంటే విలవిల లాడు తున్న వాడిని పడదోసింది అంతసత్తువ ఎలా వచ్చిందో తానేం చేస్తున్నదో తెలీకుండానే చేసింది శ్రీకంఠం అక్కడ ఉన్న తిరగలి, దాని కానించి ఉన్న పొట్టి ఇనప రోకలిమీద పడ్డాడు. తలంతా నెత్తురుమయం నేలమీద పారుతూంది. తెలివిలేదు. చావుబతుకుల్లో లాగ కొట్టుకుంటున్నాడు

గోదావరి కాస్సేపు కర్రగట్టి నిల్చుండిపోయి, మెరుపులాగ గడ తీసి తలుపు తెరిచి దూకింది బుజ్జి సుఖంగా నిద్రపోతున్నాడు చీకూ చింతా లేని బుజ్జి ముఖాన్ని చూసి గోదావరి ఒక్క పెట్టున పగిలినట్టు బావురుమంది.



ఎదురుగా గూట్లో ఆవుకి చేరబడి వేణు వూత్తున్న గోపాలుడి బొమ్మ కనిపించింది. అప్పుడు జ్ఞాపకం వచ్చింది. వెళ్లే ముందు వేణుగోపాలస్వామి సింహద్వారం తాకి వెళ్లమన్న అవ్వమాట! నీళ్లు నిండిన కళ్లకి మసక మసగ్గా కనపడుతున్న బుజ్జి ముఖాన్ని చూస్తూ రెండు చేతులూ పైకెత్తి జోడించింది. క్షణం ఆగకుండా వీధిద్వారం తెరుచుకొని చీకట్లో రోడ్డుమీదకు పరుగెత్తింది.

*　　*　　*

రవిక చిరిగింది. చీరా చిరుగులు వేలాడుతున్నాయి. అక్కడక్కడా పగిలిపోయిందేమో, దుమ్ముకొట్టుకుని ఉంది. ఒంటినిండా, చీరనిండా బురద, జుట్టంతా రేగి చిందరవందరగా ఉంది. గోదావరి కాదు! పిచ్చిదో, బిచ్చగత్తో! పరుగెత్తుతున్నట్లు వెళ్తూంది. ఈదురు గాలి వీస్తున్నది. చిన్న తుప్పరవడుతున్నది. రోడ్లు నిర్మానుష్యంగా ఉన్నాయి. లైట్లు ఆరుతూ వెలుగుతూ ఉన్నాయి. ఎవరో తరుముకొస్తున్నట్లుందని రోడ్డులైటు కింద ఆగి నిల్చుంది! రిక్షామీద ఎవడో సేట్ అర్ధరాత్రి బండికి వెళ్తున్నాడు. బిచ్చగత్తె అనుకొని పావలా కాసు విసిరాడు. "బాబూ ఇలాంటి ఏబ్రాసి రకంవారీ సరుకు మరీ ఎక్కువై పోతున్నారు!" అంటూ రిక్షావాడంటున్న మాటలు వెళ్ళిపోతున్న రిక్షానుంచివినపడుతున్నాయి. ఆనాలోచితంగా పావలాబిళ్ల తీసింది. రిక్షాపోయిన వేపే గబగబా నడుస్తూంటే కాలికేదో తగిలింది. బాల్ పాయింటు పెన్ను; పావలా కాసు—పెన్ను! కలం తీసి అరచేతిమీద నొక్కి—రాసింది, రాస్తూంది! పరుగెత్తింది.

స్టేషన్ చేరింది. రాత్రులు కవర్లు అవీ అమ్ముతుంటారు. అయిదు పైసలు ఎక్కువ. ఇన్‌లాండు కవరు తీసుకొని 'ఐదుపైసలు యివిగో నమ్మి' అంటూన్నది వినిపించుకోకుండా ప్లాట్‌ఫారం చిట్ట చివరకు చేరుకుంది. అక్కడో విరిగిన బెంచీ ఉంది. దూరంనించి వెల్తురు



పడుతూంది జనం పల్చగా ఉన్నారు బెంచీమీద ఆనించి గబగబా ఏదోరాసి అడ్రసూ రాసి అందించింది ఎర్ర డొక్కు కూడా దగ్గర్లోనే కనిపించింది, పడేసింది

రాస్తున్నప్పుడే ఒక రైలు వెళ్ళింది. కొంత సేపటికి మరొకటి వచ్చింది ఎక్కింది రైలు కదలకుండా దిగి పోమన్నాడు టిక్కట్ కలెక్టరు వెళ్తూ, బిచ్చగత్తె అనుకునే రైలు కదిలింది కాకినాడకో, రాజమండ్రికో చేరుకోవాలని ఎక్కింది కాని ఆ బండి అటు వెళ్ళేది కాదు. దిగుపకెళ్ళేది. ఉస్సురనుకుంటూ కిందకూలబడింది దొడ్డి తలుపు దగ్గిర "విజయనగరంలోనే దిగితే సరి !... కాని ఏంలాభం ?..."అనుకుంటూంటే చేతికేదో తగిలింది పర్సు ! అంతా కునికిపాట్లు పడుతున్నారు, తీసింది తెరిచి చూసింది రెండు వందలూ చిల్లరా ఉన్నాయి గోదావరి ముఖం వికసించింది మొల్లో దోపుకుంది...భీముడిపట్నం! భీముడిపట్నంలోనే తను పుట్టింది...

"..ఎచ్చట బుట్టి నచ్చటి కేగుట నైజము ప్రాణికోటికిన్..." పోతన పద్యపాదం స్ఫురించింది

విజయనగరం వచ్చింది, దిగి పోయింది

*   *   *

విజయనగరం నుండి భీముడిపట్నం వెళ్ళే బస్సు అందింది. భీమిలి చేరుకుంది. చిన్నతనంలో షికార్లు తిరిగిన సముద్ర తీరం, గుట్టలు, కొండ, నరసింహస్వామి ఆలయం, జీడితోటలు, ఎత్తుమీదనుంచి చూస్తుంటే నేత్రానందంగా కనిపించే అపార సాగరం, అదొక అందాల స్వర్గ సీమ !

దూరంగా పెద్ద గుట్ట ఉంది దిగువనే సముద్ర తరంగాలు దానిమీదకు చేరుకుంది గోదావరి

"...చివరకు గోదావరి చేరేది సాగర మేగా-బంగాళాఖాత సాగరం! " అన్న మాటలు చెవుల్లో గింగురు మంటున్నాయి, సముద్రం ఘోషలో కూడ...



# అడుసు తొక్కిన మనిషి

గుత్తుల భాస్కరరావు

గదినిండా బెడ్‌లైటు బ్లూవెల్తురు పరుచుకుని ఉంది. తెరిచిన కిటికీలోంచి తెరల్ని తోసుకొచ్చిన గాలి సన్నజాజుల వాసన మోసుకొస్తుంది.

మంచానికి అవతలి అంచున పడుకున్న వసంతని "వసూ, నిద్రపోతున్నావా'' అన్నాడు కృష్ణమూర్తి.

''ఉహు" అంది మోచేతి మీద పైకిలేచి చూస్తే వసంతా తనవైపే చూస్తుంది. కనురెప్పలు చేపమొప్పల్లా కొట్టుకుంటున్నాయి.

ఒకరౌండ్ దొర్లి ఆమెదగ్గరకు జేరి ''నాకేం తోచడంలేదు వసూ" అన్నాడు.

''ఏంకావాలిట అయ్యగార్కి?''

"కమ్మటి కథ చెప్పు. వింటూవింటూ నిద్రపోతాను.''

''మన ఒప్పందం ప్రకారం ఈ రాత్రికి రాకాసిలోయలో రాకుమారుడి కథ చెప్పాను'' అంది వసంత.

''తప్పదంటావా!''

''అన్నమాటే '

కృష్ణమూర్తి ఆలోచనలో పడ్డాడు ఏంచెప్పాలా అని. ఏదో తోచింది. లేచి కూర్చుని ''ఈసారి కథకాదు, నా అనుభవం చెబుతాను" అన్నాడు.

"అలాగే కానివ్వండి." శేషతల్పశాయి మాదిరి పడుకొని వినడం మొదలుపెట్టింది వసంత.

"నా కాలేజీ రోజుల్లో హోటల్లో భోం చేసేవాణ్ని. ఆ వూరికి అదొక్కటే హోటల్ కావడంవల్ల నాలాంటి ఒంటి ప్రాణాలకి గత్యంతరం లేకపోవడంవల్ల ఆ హోటల్‌యజమాని నిరంకుశత్వాన్ని ప్రదర్శించేవాడు పప్పు గోంగూర పేరుతో పప్పులో పచ్చగడ్డి కలిపేవాడు రసం సాంబారు పేరుతో కాలకూటవిషం పోసేవాడు. నేటి బాలలే రేపటి పౌరు లన్నట్టు .. యివాళ్ళకూర మిగిలితే రేపు చట్నీగా అవతరించేది

"ఆ హోటల్‌యజమాని కౌంటర్‌లో గోళ్ళుతింటూ ఉండేవాడు. అతను భోం చెయ్యకుండా గోళ్ళుతింటూ సంపాదిం చాడు భోంచేసి కష్టాలు పడ్డది మేము," అంటూ ఆపాడు కృష్ణమూర్తి.

"బావుంది హోటల్ వ్యాఖ్యానం. కథ అయిపోయిందా?"

"ఆగు తొందరపడితే ఎలా? అసలు కథ యిక్కడ ఉంది. వాడు గడ్డిపెట్టినా కస్టమర్స్ విసుగుచెందని విక్రమా ర్కుల్లా నిలిచారు. ఆ తరువాత రెండు మూడు హోటల్స్ వెలిసినా దీని వసూళ్లు తగ్గలేదు బ్రహ్మచార్లు, ఫామిలీ పుట్టింటి కెళ్ళిన సంసార్లు... ఒకరేమిటి? .. ఏమీ తోచక భోజనానికొచ్చేవాళ్ళు .. చాలా మందితో హోటల్ రద్దీగా ఉండేది. దానికి కారణం ఏమిటో తెలుసా?"

"ఎవరు?"

"హోటల్‌వాడి కూతురు."

"ఏమిటీ! కూతురా? ఆ అమ్మాయి వడ్డించేదా?"

"అలావడ్డించినాబావుణ్ను. 'భోజనం తయారు' బోర్డుకట్టగానే అప్సరసలా తయారై ఆ హోటల్లోనే తచ్చాడేది వాళ్ల యిల్లూ హోలూ ఒకటేనేమో, ఎప్పుడూ భోజనాలహాల్లోనే తిరిగేది. నువ్వు ఏమీ అనుకోనంటే చెబుతాను అబ్బ ..ఆడ పిల్లకాదు..." అంటూ ఏమీ చెప్పలేక శూన్యంలోకి వ్యామోహంగా చూశాడు.

"ఆడపిల్ల కాకపోతే గాడిదపిల్లా?"

"నీ కలానే ఉంటుంది ఆమెనుచూస్తే ఆడవాళ్ళకే వెర్రిపుడుతుంది. పేరు సుందరి. నా ఫ్రెండొకడు 'ఆడది కాదు అల్సేషన్‌డాగ్' అనేవాడు. మనిషి తెల్లటి తెలుపు గొంతుకలో నీళ్ళుపోసు కుంటే కంఠంలో కనిపించేవి ఊరంత టికీ అందగత్తె ఏడు మల్లెపువ్వులెత్తు కూడాతూగదు."

"అంటే ఒక మల్లెపువ్వు ఈక్వల్స్ టు పది పన్నెండు పౌన్లా?"

"హాస్యం ఆడకు. ఆ ముక్కుండేది . ఆ డిజైను ముక్కు నూటికి కోటికి ఒక్కరికే ఉంటుంది. ఆమెని చూసి జనం వెర్రెత్తిపోయేవారు."

"యింతకీ ఏమిటి మీరు చెప్పేది?"

"వసూ, యింతవరకూ వచ్చాక అసలు విషయం దాచకూడదు. సుంద రిని నేను ప్రేమించాను."



వసంత ఒక్కక్షణం అదిరి మళ్ళీ మామూలుగా నవ్వేసింది "మీ మొహం మీరు ప్రేమించినా ఆ అమ్మాయి కంటి కొసలతో కూడా చూసి ఉండదు."

''చూసింది వసూ సుందరి నేనంటే ప్రాణం యిచ్చేది నాకోసం అని ప్రత్యేకంగా అసలు నెయ్యి పంపేది! స్పెషల్ కూరలు పంపేది. దూరంగా ఉంటూ నా భోజనాన్ని కనిపెట్టుకొని ఉండేది."

''ఒకనాడు వాష్‌బేసిన్ దగ్గర చేతులు కడుక్కుంటుంటే నన్ను రమ్మని సైగచేసి డాబామెట్లుఎక్కి పైకి వెళ్ళింది. నేను ఎవరూ చూడకుండా...మెల్లగా డాబాపైకి వెళ్ళాను. నాకోసం విరబ్లూసిన గులాబీమొగ్గలా నిల్చుంది సుందరి. మల్లెదవనం కనకాంబరాల కాంబినేషన్‌తో తల కాంగ్రెస్ జెండాలా ఉంది. అన్నీ పూలే! అది తలకట్టుకాదు, పూలకొట్టు. బలే ముచ్చటగా ఉంది. 'మరి...యిక్కడికి ఎవరైనా వస్తే?' అని భయం వెలిబుచ్చాను. 'ఏమీ భయంలేదు ఈ డాబా పైన పాడుబడిపోయింది. ఎవరూ వాడ్డం లేదు' అంది. చొరవచేసి చేతులు పుచ్చుకున్నాను. ఆకులా అల్లాడిపోయింది 'సుందరీ నేనంటే ఎందుకింత అభిమానం. నాలో ఏంచూసావు?' అన్నాను. 'ఏదో చూసాను. అందుకే అంత యిష్టం. మీకెందుకీ కష్టాలు. మా

నాన్నగారి దిక్కుమాలిన హోటల్లో ఎన్నాళ్ళిలా భోంచేస్తారు' అన్నది. సుందరినన్ను త్వరలో గృహస్థుకావాలని కోరుతున్నట్టు అనిపించింది. అదీ తనతో.

'అంటే నన్ను ప్రేమిస్తున్నావా?'

'నానోటితో పలికించాలని పట్టుదలా?' తాంబూలం వేసుకుందేమో తెరచుకుంటున్న చిన్ననోరు ఎర్ర త్రికోణాన్ని గుర్తుచేసింది

'నేను అదృష్టవంతుణ్ణి సుందరీ'

'నేనూ అంతే. జన్మజన్మలకీ మీరే నా భర్త' అంది ప్రతిరాత్రి హోటల్లో భోజనం అయిన వెంటనే డాబామీదికి ఎవరూ చూడకుండా రమ్మని...మాట తీసుకొంది. నేను డాబామీదికి వెళ్ళేసరికి కళ్ళలో జ్యోతులు వేసుకొని అభిసారికలా ఎదురుచూస్తుండేది. మేము చెప్పుకొన్న తియ్యటి కబుర్లు...గడిపిన శారద్రాత్రులూ లెక్కలేనన్ని అంత తియ్యటి అనుభూతులు ఎవరికీ కలిగిఉండవు...

"ఎందరెందరో్ని ఏడిపించి, వడదెబ్బ కొట్టించి, కాల్చి బూడిదచేసిన సుందరి ...అందని ద్రాక్షగుత్తిలాంటి సుందరి నాకోసం అర్రులు చాచడం నాకే ఆశ్చర్యం కలిగించేది "

వసంత మౌనంగా విని "సుందరిని అంత యిదిగా ప్రేమించి పెళ్లెందుకు చేసుకోలేకపోయారు?" అంది.

కృష్ణమూర్తి మొహంలో కారు మేఘాలు అలుముకున్నాయి. "సుందరి ప్రతిసారి అనేది 'వయసులో ఉన్నాం. పెళ్ళిచేసుకొందాం' అని. నే ననేవాణ్ణి 'వయసుకేం తన్నుకుంటూ వస్తుంది. రావల్సింది కాళ్ళమీద నిలబడగలిగే స్తోమత. అది వచ్చింతరవాతే మన పెళ్ళి. అలా అని సుందరిని నా చేతులారా పోగొట్టుకొన్నాను. ఉద్యోగం, స్తోమత సంపాదించి సుందరికోసం ఆ ఊరు వెళ్ళేసరికి...ఆలస్యమై అంతా అయి పోయింది. చంటిబిడ్డతో కనిపించింది సుందరి

"అలా సుందరి అన్యాక్రాంతమై పోయింది నా హృదయంలో యింకి పోయి...స్మృతి మిగిల్చి వెళ్ళిపోయింది" అంటూ బాధగా అన్నాడు కృష్ణమూర్తి.

వసంత మొహంలో కృష్ణమూర్తికి సానుభూతి కనిపించింది.

"వసూ దాపరికం లేకుండా నా ప్రేమ కథ చెప్పాను. నేను ఒకే ప్రశ్న అడుగుతాను చెప్పు!"

"అడగండి."

"నువ్వు మన పెళ్ళికిముందు ఎవరైనా ప్రేమించావా?" వసంత ఉలిక్కిపడింది. లేచికూర్చొని "మీ కేమైనామతి పోయిందా ఏమిటా మాటలు?"

"పోనీ ఎవరైనా దృష్టిలో పెట్టుకోలేదా...అరె, నేనేమీ అనుకోను. చెప్పు నాకు చాలా యింట్రెస్టె." వసంతకి ఒళ్లు మండింది "బావుంది మీయింట్రెస్టు




కోసం ఎవడో ఒకణ్ని ప్రేమించినట్టు చెప్పుకోమంటారా."

"నాకున్న థ్రిల్ కూడా లేదు నీ జీవితానికి "

"చాలుగాని యిక నిద్రపోండి" అంటూ నవ్వుతూ ఒక్కదుప్పటీ కలబోసి కప్పింది వసంత.

* *

అది వసంతకు నిద్రపట్టని రాత్రుల్లో మూడోది. కనులు మూసుకొని ఎంత ప్రయత్నించినా నిద్ర గగనకుసుమమై పోయింది కృష్ణమూర్తి నిశ్చింతగా నిద్రపోతున్నాడు. 'మగమహారాజు' అనుకొంది జుగుప్సగా. అలా అనుకోడానికి నిద్రకి దూరమవడానికి కారణం అతని ప్రేమకథ. కారకురాలు సుందరి కళ్ళముందు వద్దనుకున్నా సుందరి రూపం మెదులుతూంది, కృష్ణమూర్తి ధోరణిలో. తెల్లటి తెలుపట. ఏడుమల్లె పువుల ఎత్తట. కంఠంలో నీళ్లుపోస్తే కనిపిస్తాయట. ముక్కు సంపెంగ మొగ్గట. సిగ్గులేదు వర్ణించడానికి. వసంతకి ఊహించేకొద్దీ వెగటు పుట్టింది.

సుందరేమిటి. వయసు వత్తిడికి యవ్వనంలో ఉన్న ప్రతి ఆడదీ మెరుస్తుంది. మెరవక చస్తుందేమిటి? అది బావుందని మంచివాడనుకొన్న ఈ మొగాడు ఎగబడ్డం ఏమిటి

డాబామీద చెప్పుకున్నకబుర్లు,గడిపిన శారద్రాత్రులు...ఊహించేకొద్దీ ఊహకందని దూరాలకి తీసుకుపోయి వసంతకి దుఃఖం ముంచుకొచ్చింది

కృష్ణమూర్తి చెబుతున్నంత సేపూ ఎంతోనిగ్రహించుకొంది ఏడుపురాకుండా. విశాలహృదయం ఉన్న ఆడదానిలా నవ్వింది పైగా. ఎదురుగా ఏడ్చేస్తే అలుసయ్యే మాట నిజంగానీ...ఎలాదాచుకోవాలీ దుగ్ధని.

కృష్ణమూర్తి ఉత్తముడు అనుకొంది గానీ తలో ప్రేమకథ గందరగోళం ఉన్న మామూలు మగాళ్ళ జాబితాలోని వాడే. యిన్నాళ్ళు తనవైపు చూపిస్తున్న

ప్రేమ అనురాగం అంతా బూటకం. ఒక వేళ తనలో సుందరిని చూసుకొని యిష్ట పడుతున్నాడేమోనన్న అనుమానం వచ్చి ఒళ్ళంతా కంపరం పుట్టింది వసంతకి 'ఛీ ఏం మొగాళ్లు' అనుకొంది, చాలా మంది ఆడవాళ్ళలా. అసలీమనిషి ఎందుకు ప్రేమించాలి..ప్రేమించిఎందుకు తెలియజెప్పాలి...చెప్పి తనలో బడ బాగ్ని రగిలించాలి? మరో ఆడదైతే బట్టలు నాలుగూ సర్ది ఈపాటికి పుట్టింటికి పోయేది

వసంత ఏడుపు ఆపుకొని...మంచం దిగి...టేబిల్ ముందుకి నడిచింది. నర్సాపురంలో ఉన్న స్నేహితురాలికి ఉత్తరంవ్రాసి సుందరి గురించి వివరాలు సేకరించాలని, ఆ మహామతల్లి కాపురం సరిగా చేస్తుందో కాక తనభర్త నింకా కలవరిస్తుందో కనుక్కోవాలని సొరుగు లాగింది డ్రాయర్లో కృష్ణమూర్తి డైరీ కనిపించింది. దాన్ని చూడగానే ఎప్పుడూ లేని ఆలోచన కలిగి చదవా లనిపించింది 'ఏం తప్పేముంది నువ్వే నేను నేనే నువ్వు' అంటాడుగా అవసర మయినపుడు

డైరీలో సుందరి పేరుగానీ అడ్రెసు గానీ లేదు. కానీ రెండ్రోజుల క్రితం రాసిన దాంట్లో సుందరి పేరు కనిపించి వసంతకి గుండె దడదడ ఎక్కువ యింది

జూలై 8 – 'ఇది ఊసుపోక తిన్న దరక్క చేసినపని. సుందరిలేదు సూడిదా లేదు. ఊహతో చక్కగా ఒక అపరంజి బొమ్మను కల్పించి, ఈవిడా నేను ప్రేమించుకొన్నాం. ఎంచగ్గా అని ఊరించి చెప్పాను వసంతకి చాలా నేచురల్‌గా. ఏడుపుమొహం పెడుతుందను కొన్నాను. జెలసీ ఫీలవుతుందనుకొన్నాను అలిగి వేరే పడుకుంటుం దనుకున్నాను. బాప్‌రే బాటరీలైటు పెట్టి వెతికినా మరో భావం దొరకలేదు నిర్మలంగా నవ్వింది. రేయ్ కృష్ణమూర్తి నువ్వు అదృష్టవంతు డివిరా.'

వసంతకు ఏడుపు నవ్వయింది. డైరీ మూసేసి సొరుగులో తోసింది. మంచం మీదకు గెంతి పడుకొంది. కృష్ణమూర్తి గాఢ సుషుప్తిలో ఉన్నాడు. బలిష్ఠమైన ఒక దోమ అతని బుగ్గమీద గుచ్చిగుచ్చి రక్తం తాగేస్తుంది. కసికొద్దీ బుగ్గమీద చరిచి దోమని చంపింది వసంత. అప్పటికీ నిద్రలేని కృష్ణమూర్తి ఒంటి చుట్టూరా చెయ్యి అల్లుతూ 'పాపిష్టిదాన్ని క్షమించరూ' అంది అతను మెలకువగా ఉంటే 'ఎందుకు' అని అడిగివుండేవాడు.






"మంగా!" దేవుడికి-ముఖ్యంగా లక్ష్మి దేవికి-హరతిస్తూన్న చెంగయ్య పెద్ద పోలికేక పెట్టాడు.

వంటింట్లోనుంచి పరిగేతుకొచ్చింది మంగమ్మ.

"ఇక్కడ లక్షిందేవి యేది?"

"పటాలన్నీ అక్కడే వుండయిగా!"

"పటంగాదే నీ దెవసం! పాలడబ్బా!"

మంగమ్మ మళ్లీ పరుగెత్తుకెళ్లి చిన్న కొడుకు రంగడితో వచ్చింది. వాడి చేతిలో వుంది చంటిపిల్లల పాలడబ్బా. బిక్కమొహం వేశాడు వాడు.

"నువ్వెందుకు తీశావురా అదీ?" గద్దించాడు చంగయ్య.

"ఊఁ! మరే, మా మేష్టారు ఆవు మీద కాంపోజిషన్ రానుకురమ్మన్నారు. ఆవుపాలు నీళ్లల్లే వుంటయ్యో, పొడి పొడిగా వుంటయ్యో చూద్దామనీ..."

"ఏడవలేపొయ్యావ్, ఎదవ!"

ఆ డబ్బా లాక్కుని, దేవుడి పటాల పక్కనే పెట్టి గంట గొడుతూ హారతిచ్చి కళ్ల కద్దుకుని, ఇవతలపడి అప్పుడుగాని కాఫీగ్లాసు అందుకోలేదు చంగయ్య.

చంగయ్య పాలడబ్బాకి అంత ప్రాముఖ్యం యివ్వటానికి కారణం లేక పోలేదు. అతగాడి అసలు సంపాదనంతా పాలడబ్బాల మీదే! అది మినహా యించగా వచ్చే సంపాదన కూటికీ

గుడ్డకి మాత్రమే సరిపోతుంది. మరి పై ఖర్చులో? మందులూ, మాకులూ, బట్టలూ, చదువులూ, సినిమాలూ, షికార్లూ...?

పై ఖర్చులు లేందెవెరికి? అందరికీ వున్నాయి. అందరూ ఏదో విధంగా పై సంపాదన చేస్తూనేవున్నారు. లైసెన్సు లిచ్చే ఆఫీసరుగారు తన కళ్లెదురుగానే నలుగురిదగ్గర నాలుగు వేలుచ్చుకుని పెళ్లాం పిల్లలతో వూటి వెళ్లొచ్చాడు మొన్న వేసంగిలో. మాష్టార్లు ప్రయివేట్లు చెప్పి పిల్లల పెళ్లిళ్లు చెయ్యటం తను చూస్తూనేవున్నాడు. ఆఖరికి టాక్సీ వాళ్లూ, హోటల్ సర్వర్లూ, వీధుల్లో చెత్తపోగేసుకెళ్లే మునిసిపల్ వర్కర్లు-అందరూ "టిప్పు"లు సంపాయిస్తున్న వాళ్లే!

కాఫీ తాగి, షాపు తాళాలు తీసుకుని, చెప్పుల్లో అడుగెడుతూవుండగా నిద్ర మంచంమీదనుంచి పరుగెత్తుకొచ్చాడు పెద్ద కొడుకు కళ్లు నులుముకుంటూ ఎదురుగా నిలబడ్డాడు.

'మళ్లీ యేదో వచ్చిందట్టుందే' అనుకున్నాడు చంగయ్య.

దీనవదనంతో చూస్తున్నాడు పెద్ద కొడుకు.

"ఏంట్రా? ఇంకా తెల్లార్లా నీకూ ఐదుంబావైపోతే?''

"ఇందాకే లేచా నాన్నా! మళ్లీ నిద్ర రాస్తేనూ..."

"ఏడవలేకపోయావ్! ఇప్పుడేంటి?"

"ఓ పుస్తకం కొనుక్కోవాలి నాన్నా! పాతిక రూపాయలవుతుంది. పాత పుస్తకాలెవరూ అమ్మటంలేదు..."

"మొన్నేగా రొండొందల రూపాయల పుస్తకాలు కొన్నావ్?"

"ఇదింకోటి నాన్నా! మా ప్రయివేటు మాష్టారు తప్పకుండా కొనుక్కోమన్నారు. లేకపోతే పాసవటం కష్టమన్నారు"

"ఓరి మీ సదువులు దొంగల్దోలా! ఎంతెంత కర్చెడతన్నార్రా! పుస్తకాలంటే ఏదో నాలుగైదు రూపాలవుద్ది గాని మరీ పాతికేసి రూపాయంతేంట్రా?"

"నూటేబై రూపాయల పుస్తకాలు కూడా వున్నాయి నాన్నా. అంత కర్చయితే మా నాన్న ఒప్పుకోడంటేనూ, పోనీ యిది కొనుక్కోమన్నారు మాష్టారు."

"నాకు తెలవకడుగుతాను అసలేంట్రా యీ సదువులూ? కాలేజీకి ఫీజులూ గట్టి, ఇన్నిన్ని పుస్తకాలూ కొని, ప్రయివేట్లూ చెప్పించి-ఇంతా కర్సెట్టి మళ్లీ మార్కులేయించుకోవటానికి యెట్టాగూ లంచాలు బెట్టాలయ్యె! అందుకే ఈ సదువులు మనకొద్దు. సుబ్బరంగా కొట్లో గూకోరా అంటే యినవయ్యె నువ్వు."

"ఈ చదువు నా కోసం కాదు నాన్నా? నీ కోసమే! రేప్పొద్దు న్నేను సేల్

టాక్సు ఆఫీసరుగా వస్తే నీకు లాభమా నాకు లాభమా?"

ఈ మాటతో మెత్తబడ్డాడు చంగయ్య.

"సరే సూద్దాంలే మజ్జాన్నం!" అంటూ బైటికి కదుగేశాడు.

"మజ్జాన్నం నే కాలేజి కెళ్లిపోతా గదు న్నానా!"

"అయితే సాయంకాలం..."

"నేరా నా కొట్టుకి?"

"నేనే వత్తాలే!"

చంగయ్య వెళ్లిపోయాడు. రాత్రి పదకొండు గంటలుదాకా రాడని సింగ రాజుకీ తెలుసు అయినా వూరు కున్నాడు.

* * *

దుకాణం తెరిచి లక్ష్మీదేవి పటం ముందు అగరొత్తులు వెలిగిస్తూండగా టవర్ క్లాక్ ఆరుగంటలు కొట్టింది. రోజూలాగే.

కేలండరు పైగాగితం చించేసరికి ఈ నెలలో మూడు వారాలై పోయాయని తెలిసింది.

మెల్లిగా బేరాలు మొదలయ్యాయి కొట్లో కుర్రాళ్లు సరుకిస్తుంటేతన కుర్చీలో కూర్చుని డబ్బు లందుకుంటున్నాడు చంగయ్య.

ఒక పెద్దమనిషి నరాసరి చంగయ్య దగ్గరికొచ్చి రహస్యంగా "ఓ పాల డబ్బా కావాలి సార్!" అన్నాడు.

ఇంత రహస్యంగా అడుగుతున్నా డంటే అతనికి వ్యవహారమంతా తెలుసన్నమాట! అందుకు సిద్ధంగానే వున్నాడన్నమాట! కనక నిర్భయంగా మాట్లాడుకోవచ్చు.

"ఇరవై రూపాయలవృద్ధి..."

"అలాగే!" అంటూ జేబులోనుంచి నోట్లు బైటికి తీశాడు పెద్దమనిషి

"డబ్బా సాయంత్రం వస్తది. డబ్బి చ్చెల్లండి!"

కిక్కురుమనకుండా డబ్బిచ్చి వెళ్లి పోయాడు పెద్దమనిషి

రహస్యంగా అడగటం తెలియని వాడికి, పాలడబ్బా అంటే యేమిటో తనకి తెలియదని చెబుతాడు చంగయ్య. తనెప్పుడూ పాలడబ్బా మొహం యెరగ నంటాడు. దా న్నెప్పుడూ చూడ లేదంటాడు చూసినా తన దగ్గర లేవంటాడు. జాలికూడ పడతాడు.

అందుచేత ఈ వ్యవహారం తెలియని వాళ్లు సాధారణంగా పాలడబ్బాల కోసం చెంగయ్యకొట్టుకి రారు. వచ్చే వాళ్లంతా తెలిసినవాళ్లే! ముఖ్యంగా నెలాఖరు రోజుల్లో! అందుకు కారణం వుంది. ఊళ్లో అన్ని షాపులవాళ్లూ కంపెనీనుంచి పాతికో ముప్పయ్యో డబ్బాలకంటె ఎక్కువ సంపాదించుకో లేరు నెలకి ఆ కాసినీ ఇరవయ్యో తారీఖులోగా అందరి దగ్గరా అయి పోతాయి. ఆ తర్వాత మళ్లీ ఒకటో

తారికుదాకా వాళ్ళదగ్గర నిలువెత్తు బంగారం కొలిచినా ఒక్క డబ్బా కూడ పుట్టదు. కాని చంగయ్యదగ్గర అలా కాదు కంపెనీ నుంచి ఎలాగో నెలకి వంద డబ్బాల కోటా సంపాదిస్తాడు మళ్లీ ఒకటో తారీకు దాకా అమ్ముతూనే వుంటాడు. అన్ని దుకాణాల్లోను సరుకై పోతే అప్పుడందరికీ చంగయ్యే గతి! నెలాఖరు రోజుల్లో చంగయ్యే సర్వాధి కారి! లక్షలమీద వ్యాపారం చేసేవాళ్ల దగ్గర్నుంచీ అందరూ చంగయ్యతో మంతనా లాడవలసిందే! ఈ ఆపద్బాంధ వుడి సంగతి తెలియని ఇళ్లల్లోని పసి పాపలు బర్రెపాలో మరేవో తాగి డాక్టర్ల చుట్టూ తిరగవలసిందే!

కొట్లో బేరాలు సాగుతూనే వున్నాయి.

ఈ లోగా ఇంకొకాయన వచ్చి ఓ ఇరవై చదివించుకు వెళ్లాడు.

మరికాసేపటికి ఇంకొకాయన వచ్చి "వున్నాయా?" అనడిగాడు, మెల్లిగా

"ఇరవై!" చంగయ్య సమాధానం.

''అన్యాయం! కంపెనీ రేటు పది రూపాయలు! ఆ రేటులోనే మీకు రెండ్రూపాయ ల్లాభంవుంది కాదంటే పోనీ ఇంకో రెండ్రూపాయలేసుకుని పన్నెండు కమ్మవచ్చు. అంతేగాని మరీ డబల్ రేటు..."

"మా దగ్గర్లేవండి డబ్బాలూ? ఉళ్లో రేటు చెప్పాను. మీకు అవసర మంటన్నారు గనక పోనీ తెప్పించి పెడ దామనుకున్నాగాని, మీ డబ్బంతా నేనే తినేసినట్టు మాటాడతారేంటి? అసలు మా దగ్గర డబ్బాల్లేవు వెళ్లిరండి లేనిపోనిది నాకెందుకు?"

"కోప్పడకండి! మీరు మంచివారుగా కన్పించారు గనక నాకూ న్యాయం చెప్ప బుద్ధేసింది. అంతేగాని మీతో తగూ పెట్టుకుందామనీ కాదు, కంప్లైయింటు చేదామనీకాదు ముందు మా అవసరం."

"న్యాయం అంటారేంటండి న్యాయం? ఊళ్లో ఎక్కడా దొరకని వస్తువు మీకు సంపాయించిపెట్టటం అన్యాయమా? నే పడ్డ కష్టానికి మీరు కాస్త యెక్కువ రేటు యివ్వటం అన్యాయమా? మీ పసి పాపమీద జాలితో నేను ఒప్పుకుంటు న్నానేగాని లేకపోతే యీ గోలంతా నాకెందుకు? ఇదంతా అన్యాయమను కుంటే మీ సొమ్ము నాకొద్దు వెళ్లిరండి. అన్యాయపు సొమ్ము నాకొద్దనే వద్దు!"

''కోప్పడకండి సార్! మీరు చెప్పే దంతా న్యాయమే! నేనూ ఓ చిన్న గుమాస్తాని ఒక్క పాలడబ్బా కిరవై రూపాయలు ఖర్చయితే ఇంకా మేం బతికేదెలా చెప్పండి ఆ బాధతో, భయంతో అన్నానే గాని..."

"మీకు భయమైతే మాకు మాత్రం భయంలేదా? మాకు మాత్రం ఖర్చు ల్లేవా? పిల్లల్లేరా? ఆళ్లకి సదువుల్జెప్పిం చక్కర్లేదా? బట్టలు కుట్టించక్కర్లేదా? పెళ్లిళ్లు చెయ్యక్కర్లేదా? మాకు మాత్రం

ఎక్కణ్ణించొస్తది డబ్బు చెప్పండి. మీరు మా పిల్లల సదువుల్జెప్పిచ్చండి, మీ పిల్లకి పాలు తాగిత్తాంమేం ! ఇందులో అన్యాయ మేముంది ?''

"............''

"—కావాలంటే మీరు కంప్లెయింటు చేసుకోండి ఈ మాత్రం కూడ దొర కక్కుండా పోద్ది సరుకు ! వూళ్లో పసి పిల్లలంతా పాలులేక అలమటించి పోతారు, మీ పుణ్యమా అని ! వెళ్లిరండి. వెళ్లి కంప్లెయింటు చెయ్యండి. నా దగ్గర సరుకూ లేదు, నాకు బయమూ లేదు ! వెళ్లిరండి !''

కాళ్లూ గడ్డం పుచ్చుకుని బ్రతిమాలిన తర్వాత సరేనంటూ ఇరవై రూపాయలూ పుచ్చుకుని సాయంత్రం రమ్మని పంపించేశాడు చంగయ్య.

ఆయన వెళ్లిపోయింతర్వాత "లేక పోతే చిన్న గుమాత్తా అంట, చిన్న గుమాత్తా ! అంత చిన్న గుమాత్తా అయితే పిల్లల్నెవరు కనమన్నారు? డబ్బా పాలెవరు అలవాటు జెయ్యమన్నారు ? తల్లి పాలేమైపోయాయి ? కాచి తోడెట్టు కుంటన్నాడా ? అమ్మగారి అందం చెడ గూడదు మల్లా ! ఈళ్లకోసం అడ్డమైన గడ్డీ తిని పాలడబ్బాలు సప్లై చెయ్యాలి మేము, పావలా లాభం లేకుండా !" అనుకున్నాడు చంగయ్య.

కాసేపయ్యాక ''కంప్లెయింటు చెయ్యడుగదా కొంపదీసి !" అనుకున్నాడు.

"ఏమైనా సరే లేవని జెప్పి పంపిత్తే పోయేదేమో!'' అనికూడ అనుకున్నాడు.

"అయినా కంప్లెయింటు చేసేవాడైతే గుట్టుచప్పుడు గాకుండా జేసేత్తాడు గాని అట్టా యెందుకు మాట్టాడతాడులే!" అని సరిపెట్టుకున్నాడు.

ఎందుకైనా మంచిదని మధ్యాహ్నం భోజనాని కెళ్లకుండా విరిగిపోయిన నాలుగు బిస్కెటు ముక్కలు తిని సింగిల్ టీ తెప్పించుకు తాగి కొట్లోనే వుండిపోయాడు.

రాత్రి ఎనిమిదిగంటలు దాటాక సుబ్బయ్య మాష్టారొచ్చారు కొట్లోకి.

"రండి మాష్టారూ" అంటూ ఆహ్వానించి స్టూలు మీద కూర్చోమన్నాడు చంగయ్య.

నాలుగేళ్లనాడు చంగయ్య పెద్ద కొడుకు ఈ మాష్టారు దగ్గరే ప్రయివేటు చదివాడు. చదివి తప్పాడు. అందుచేత చంగయ్య రెండు నెలల జీతం యెగ్గొట్టాడు. ఏమనుకున్నారోగాని మాష్టారూ అడగలేదు. ఆయన పాఠాలు బాగాచెబుతారని వూళ్లో మంచి పేరుంది.

''మా అమ్మాయి వూరినుంచొచ్చింది. దాని పిల్లడికో పాలడబ్బా కావాలి. ఊళ్లో యెక్కడా దొరకలేదు. అందరూ మీ దగ్గర దొరుకుతాయని చెప్పారు

అంచేతొచ్చాను" చెప్పదల్చుకున్నది మూడు ముక్కల్లో చెప్పేశారు మాష్టారు.

"ఎక్కడా దొరకటం లేదు మాష్టారూ!" నీళ్లు నమిలాడు చంగయ్య, ఆకాశంలోకి చూస్తూ.

"మీ దగ్గర దొరుకుతాయని ఊరంతా కోడై కూస్తుంటేనూ!"

"ఎక్కడైనా దొరుకుతాయేమో కనుక్కోవాలండీ కుర్రాణ్ణి పంపించి కనుక్కుంటా కాసేపయ్యాక రండి!"

"దొరికితే రెండో మూడో తెప్పించండి! కరువుగ వున్నట్టుంది!"

గతుక్కుమన్నాడు చంగయ్య

"రెండో మూడోనా! చాలా ఖరీదుగా వున్నాయండీ! అరే మొన్నెంతకిరా తెచ్చావ్?" కొట్లో కుర్రాణ్ణడిగాడు.

"ఇరవై!" చిరునవ్వు దాచుకుంటూ కుర్రాడు జవాబిచ్చాడు

ఈసారి మాష్టారు గతుక్కుమన్నారు.

"ఏమిటీ? ఇరవయ్యా? డబ్బా?"

"మరేనండి సరుకు దొరకటం లేదెక్కడా?"

"సరే అయితే ఒకటి తెప్పించండి!"

డబ్బిప్పుడే ఇమ్మని బలవంతం చెయ్య లేకపోయాడు చంగయ్య, బహుశః వెనక జీతం ఎగ్గొట్టినందువల్ల కాబోలు

మాష్టారు వెళ్లిపోయారు.

తొమ్మిది గంటలయ్యేసరికి, అలవాటు ప్రకారం వీధిలో సగం షాపులు కట్టేశారు. తొమ్మిదిన్నరకి మరికొన్ని కట్టేశారు. పావుతక్కువ పదింటికి అందరూ కట్టేశారు, ఒక్క చంగయ్య తప్ప.

పొద్దుటినించీ వచ్చి ఇరవైలు చదివించుకున్న వాళ్లందరూ వచ్చి తమ తమ డబ్బాలు భద్రంగా కాగితాల్లో కట్టించుకుని పట్టుకుపోయారు.

టంగ్‌మని పదిగంటలు కొట్టేసరికి మేష్టారొచ్చారు షాపులోకి. ఆయన్ని చూస్తూనే "అరే మేష్టారి డబ్బాయేదిరా?" అన్నాడు చంగయ్య. డబ్బా హాజరైంది మాష్టారిముందు

ఆశ్చర్యంతో చూశారు మాష్టారు.

"తీసుకోండి, మీకే!" అన్నాడు చంగయ్య

భద్రంగా కాగితంలో చుట్టివుంది డబ్బా!

"తొరగా తీసికెళ్లిపొండి, మళ్లీ మేం కొట్టు కట్టేసే టైమైపోతోంది. ఏంటట్టా జూస్తారూ?"

జేబులోనుంచి ఇరవై రూపాయల నోటు తీసిస్తూ "ఏం లేదు. ఆ పక్క నిలబడి ఇందాకట్నించి చూస్తున్నాను. మీ కుర్రాళ్లెవరూ బైటికెళ్లలేదు. ఎక్కణ్ణించొచ్చింది డబ్బా? బ్లాకు మార్కెట్టా? సీలు సరిగా వుందా? లేకపోతే..."

"ఛ!" అనుకున్నాడు చంగయ్య మనసులో ఆ బ్లాకు మార్కెట్టనే మాట ఇంతవరకెవ్వడూ అనలేదు. పైగా ఈయన మామూలు ధోరణిలో అనే

స్తున్నాడు కాస్తయినా రహస్యం లేకుండా. కాస్త ఒళ్లు మండింది చంగయ్యకి.

ఇరవై రూపాయల నోటుని అటూ ఇటూ తిప్పి చూసి "దీనిమీద సంతకం చేసివ్వండి !" అన్నాడు నోటుని మాష్టారి చేతికిస్తూ

''ఏం, ఏం ?'' కంగారుగా అన్నారు మాష్టారు నోటందుకుంటూ

"ఏంలేదు, దొంగ నోటయితే రేప్పొద్దున మీకే యిచ్చేద్దామని" కసి కొద్దీ అన్నాడు, నోటు మంచిదేనని తెలిసి కూడా.

''బాగానేవుందే ! దీనికేం ?"

''అన్నీ ఒక్కలాగే వుంటాయి సార్ ! బ్యాంకువాళ్లు చెప్పేవరకూ మనకేం తెలియదు "

పోనీ ఇంకో నోటిద్దామని కాబోలు జేబులు తడుముకున్నారు మాష్టారు. చిల్లర తప్ప మరేం తగల్లేదు.

ఆఖరికి సంతకం చెయ్యక తప్ప లేదు.

డబ్బా తీసుకు వెళ్లిపోతూ ''దొంగ నోటా ! ఈ సంగతేదో కనుక్కో వలసిందే !" అని గొణుక్కున్నారు మాష్టారు.

'నీ సంగతేదో కనుక్కోవలసిందే !' అన్నట్టు వినబడింది చంగయ్యకి.

కొంచెం భయంవేసింది. కొంపతీసి ఈయన కంప్లైయింటు చేస్తే ? నోటు మీద సంతకం చేసిచ్చానని ఋజువు కూడ చెబుతాడేమో ! ఏమో ! "బ్లాకు మార్కెట్టా" అని మామూలు గొంతుతో బిగ్గరగా అన్న మనిషి కదూ ఈయన? తెల్లవారేసరికి ఎవడైనా వచ్చి చెకింగు చేస్తానంటే ?

లక్ష్మీదేవి పటానికి దణ్ణంపెట్టు కున్నాడు చంగయ్య

కళ్లు తెరిచేసరికి పెద్దకొడుకు ఎదురుగా వున్నాడు.

"నీకోసం మజ్జాన్నం ఇంటికొచ్చి కూచున్నా నాన్నా ! నువు రాలేదేం ?" అనడిగాడు

''పనుండి రాలేదులే !''

''మరి నాకు డబ్బిచ్చెయ్ ! నేనెళ్లి పోతా ?"

"ఇప్పుడేం కొంటావు షాపులన్నీ మూసేస్తేనూ ? రేపొద్దునిత్తాలే !"

"అట్టా కాదు ఇప్పుడు ప్రయివేటునుం చొస్తున్నా. ఇహనుంచీ రాత్రిళ్లక్కడే పడుకుంటా. రేపొద్దు నటునుంచటే కాలేజి కెళ్లిపోతా పుస్తకం కొనుక్కుని..."

మెరుపులాంటి ఆలోచన !

మాష్టారిచ్చిన ఇరవై రూపాలనోటు ఇటు తోసేస్తే పీడ విరగడైపోతుందను కున్నాడు చంగయ్య.

ఆ నోటూ, మరొక ఐదు నోటు తీసి యిచ్చేశాడు

పెద్దకొడుకు వెళ్లిపోయాడు

మరి కాసేపటికి షాపు కట్టేసి ఇంటికి

బయల్దేరాడు చంగయ్య ఈ వ్యాపారంలో భయం వుంటుంది అందుకే ధైర్యం కావాలి, తెలివితేటలు కావాలి అనుకున్నాడు

దారిలో అయోధ్య మండపంలో దాసుగారు హరికథ చెబుతున్నారు.

"శ్రీమద్రామాయణాన్ని రచించిన వాల్మీకి ఎవరు ? మొదట ఒక బంది పోటు దొంగ! దార్లు కాచి ప్రయాణీకుల్ని హింసించి, దొరికినదంతా దొంగతనం చేసి తన దారపుత్రాదుల్ని పోషించుకునే వాడు ! కాని ఆయనే ఆ తర్వాత..."

"వాల్మీకులవారే అట్టాంటి పనిచేసినప్పుడు నేను ఈ చిన్న వ్యాపారం చెయ్యటంలో తప్పేముంది ?" అనుకుంటూ ఇల్లు చేరుకున్నాడు చెంగయ్య.

* * *

తెల్లారింది.

ఆరు గంటలకల్లా షాపు తెరిచి అమ్మవారి ముందు అగరొత్తులు వెలిగించాడు చెంగయ్య !

"చంగయ్యగారూ !"

అటు చూశాడు చంగయ్య. ఎవరో కాదు, బ్రహ్మయ్య. బ్రాంది షాపు బ్రహ్మయ్య.

"ఏంలేదు, అర్జెంటుగా ఓ పాల డబ్బా కావాలి !"

"పాలడబ్బా కావాలా ? అర్జెంటా ?" ఆలోచిస్తూ అన్నాడు చంగయ్య

"రేటు గురించి ఫర్వాలేదు ఇరవైయేగా ! ఇదిగో !" నోటు తీసిచ్చాడు బ్రహ్మయ్య

అందుకుంటూ ఆశ్చర్యపోయాడు చంగయ్య. అది రాత్రి మాష్టారిచ్చిన నోటు ! "ఎవరిచ్చారీ నోటు ?" అనడిగాడు.

"మన కెవరిస్తారూ ? గల్లాపెట్టేగా ! రాత్రి యెవరో యిచ్చారు !"

కళ్లు గిరగిరా తిరగాయి చంగయ్యకి.

ఇంకెవడిస్తాడు ? ఆడే ! రాత్రి తొమ్మిదీ ముప్పావు తర్వాత ఏ షాపులూ వుండవు ! తెల్లారింతవరకూ ఇంకెవరూ షాపులు తెరిచివుండరు, ఆడే ఇచ్చాడు. అనుమానం లేదు. ఎందు కిచ్చాడు? అందుకే ! తాగటానికి ! నేను గడ్డి గరిచి పాపం మూటగట్టుకుని సంపాయించే దిందుకా ?_అంటే, "బెమ్మయ్యగారూ, మీరు మావాడిచేత సారాతాగిత్తే నేను మీ పాపాయిచేత పాలు తాగిత్తా" నన్నట్టయిందన్నమాట ! ఛీ ఛీ ! ఎదవ బతుకు !

"అరే గాడిది కొడకా !" అంటూ బైటికి పరుగెత్తాడు చంగయ్య బకాసురుడిలా.

నిర్ఘాంతపోయి నిలబడ్డాడు బ్రహ్మయ్య






ఆర్థిక ఇబ్బందులవలన ట్యూషన్లు చెప్పాలే తప్పితే దానంత నరకం మరొకటి ఉండదు. పిల్లలు ట్యూషన్ మాష్టారనగానే తమ హోమ్‌వర్క్ చేసే కూలీ అనుకుంటారు. వారికి ఒక్క మార్కు అటు, ఇటుగా వస్తే నిలేసి తల్లి. తండ్రులు అడుగుతారు.

ఈ సంవత్సరం ట్యూషన్లు చెప్పాలని లేకపోయినా స్నేహితుడు బలవంతం చేశాడు.

"చెల్లాయి వివాహం, తమ్ముడి చదువుకోసం అని శ్రమపడ్డానురా. ఇక విశ్రాంతిగా ఉండాలని ఉంది."

"అది కాదురా ఆనంద్ ! ఈ ట్యూషన్ చెప్పి చూడు. పిల్లలంతా తెలివయినవారే. వారిని ఒక గంట చదివించడమే నీ పని." వేణు బలవంతం చేశాడు. మా ఇద్దరి మధ్య ఉన్న స్నేహాన్ని పురస్కరించుకుని, వాడి మాట కాదనలేక శ్రీపతిగారింటికి ట్యూటర్‌గా వెళ్లాను. వేణు చెప్పింది నిజమే. ఆయన రెండుగంటలకు వందరూపాయలు ఆఫర్ చేశారు. ముగ్గురు పిల్లలకు ట్యూషన్ చెప్పాలి. అదికాక ప్రతిరోజూ కాఫీ, ఫలహారం వచ్చేవి. 'ఏమండీ ! ఈ నెల వీడికి చాలా తక్కువ మార్కులు వచ్చాయని' గుణిసేవా రెవరూ లేరు.

"హల్లో ఆనంద్ !" చిరునవ్వుతో కన్పించినప్పుడు మాత్రం పలుకరించే

వారు. ఆయన కంట్రాక్టరేకాక చాలా వ్యాపారాలు, వ్యాపకాలున్న మనిషి. ఇంకా ఇంట్లో ఎవరుంటారో తెలియదు. నేను వెళ్లేసరికి రమేష్, సురేష్, సుధ పుస్తకాలతో స్టడీరూమ్‌లో కూర్చుంటారు. అరగంట గడిచేసరికి ఫలహారం, కాఫీ వస్తుంది. నెల కాగానే రమేష్ సీలు చేసిన కవరు తెచ్చి ఇస్తాడు. అందులో వందరూపాయ లుంటాయి.

"రోజూ ఫలహారం యెందుకూ?" ఓ రోజు పనివాడిని కసిరాను. వాడు వినయంగా చెప్పాడు.

''అమ్మగారు పంపారు.'' నా పై అంత అభిమానం చూపే అమ్మగారిని చూడాలని అన్పించింది. పెద్దింటి స్త్రీలను పిలిచి చూస్తానని యెలా చెబుతాను! ఆ ఇల్లాలి రూపం నా మన్యపలకంమీద ఊహాచిత్రం రూపం దిద్దుకుంది. పసుపు కుంకుమలతో కలకలలాడే నిండు ముత్తయిదువ. ఆమె కన్పిస్తే, ఒక్కసారి చెయ్యెత్తి నమస్కరించాలని పించింది. ప్రతిరోజూ ఫలహారం చేస్తూ, నా ఊహాలలో అతి గౌరవ స్థానం ఆక్రమించుకున్న స్త్రీమూర్తికి నమస్కరించేవాడిని.

ఆ రోజు చాలా సేపు ఉండి పోయాను. ఫస్టుటర్మ్ పరీక్షలు జరుగుతున్నాయి. వారికి ప్రశ్నలు జవాబులు రాయిస్తున్నాను. శ్రీపతిగారి మేఘగర్జన విన్పించింది. వెంటనే స్త్రీ ఆర్తనాదం, గందరగోళంగా ఉంది. ఏమిటని పిల్లలను అడగటం అంత సంస్కారం కాదని కూడా తెలుసు.

"అమ్మను కొడుతున్నారు..." సుధ గుసగుసగా వాళ్లన్నతో అనటం విన్పించింది. ఒక్కసారి వారివంక చూచి వచ్చేశాను. మరో రోజు అమ్మ ఊరు వెళ్లాలి, రెండువందల రూపాయలు కావాలని అన్నది. గంటలో అంత డబ్బు శ్రీపతిగారే తప్ప యెవరూ సర్దుబాటు చేయరని తెలుసు. గబగబా వెళ్లాను. ఇల్లంతా గందరగోళంగా ఉంది. శ్రీపతిగారు ఉగ్రరూపం దాల్చి బయటికి వచ్చాడు. నన్ను చూచి ఉలిక్కిపడటం గమనించాను.

"యెప్పుడొచ్చావ్ ఆనంద్?"

"ఇప్పుడే వస్తున్నాను." అతని ముఖంపై చిరునవ్వు వెలసింది.

"ఈరాత్రి మీకు శ్రమ ఇస్తున్నాను. అర్జంటుగా ఊరు వెళ్లాలి. ఓ రెండు వందల రూపాయలు కావాలి."

"దానికేమోయ్! పట్టుకెళ్లు." వెంటనే జేబులో చేయిపెట్టి వందరూపాయల నోట్లు యిచ్చారు. ధన్యవాదాలు అర్పించి మెట్లు దిగుతుంటే పైభాగంనుండి మూల్గు విన్పించింది, శ్రీపతిగారు భార్యను యెందుకు హింసిస్తారో అర్థంకాలేదు.

దీపావళిరోజు భోజనాలకు పిలిచారు. లక్ష్మీపూజ, మర్నాడు సత్యనారాయణ వ్రతం. సాధారణంగా, వ్రతాలు,

పూజలు అంటే తప్పించుకునే నేను, ఆ రోజు ప్రత్యేకంగా వెళ్లాను. నా పై అంత అభిమానం చూపే మాతృ మూర్తిని చూసి నమస్కరించాలని. హాలునిండా ఆశ్రిత జనులు, బంధువులు, స్నేహితులు కూర్చుని ఉన్నారు. జరీ పంచె కట్టుకుని శ్రీపతిగారు హుందాగా తిరుగుతున్నారు.

"రండి అయ్యగారూ..." అంత వరకు పూజ సామాగ్రి అమరుస్తున్న బ్రహ్మడు పిలిచాడు "చిన్నతల్లి అమ్మగార్ని పిలువు" సుధతో బ్రాహ్మడు చెప్పాడు. శ్రీపతి కూర్చున్నాడు. నేను కుతూహలంగా చూస్తున్నాను.

హాల్లో వెయ్యివాట్ల బల్బు వెలిగింది. ముదురాకుపచ్చ పట్టుచీరలో అప్పుడే అరవిచ్చిన గులాబిలా ఉందో యువతి. తలవంచుకుని వెళ్లి శ్రీపతి ప్రక్కనున్న పీటపై కూర్చుంది. నా వెన్ను జలదరించింది. ఈ మెరుపుతీగె అతని భార్యా! ఇది కలా? బ్రాహ్మడి మంత్రాలు కర్ణ కఠోరంగా విన్పించాయి. మరోసారి అటు చూశాను. తీరుగా ఉన్న మెడపై ముత్యాలహారం వెలవెల బోతుంది. వీపుమీదగా జారిన జడ నేలపై జీరాడుతుంది. మరొక్కసారి ఇటు తిరిగితే! నేను కోరుకున్నట్టు ఆమె తిరుగలేదు. యెదుటి విగ్రహంపై ఏకాగ్రత నిలిపినట్టు ఒకే చోట ముడుచుకుని కూర్చుంది. కుడిచేయి మాత్రం ముందుకులేచి పసుపు, కుంకుమ, పూలు మంటపంలో పెడుతుంది.

సత్యనారాయణ, నిత్యపారాయణ

ముత్యాల హారతిదే...నీకు పచ్చలా హారతిదే?

ఎవరో ముత్తయిదువు పాటకు ఈ లోకంలోకి వచ్చాను. ఒకటిన్నర గంట ఆ సుందర విగ్రహాన్ని చూస్తూ గడిపాను. ఛ...ఛ—నాలోని సంస్కారం ఏమయింది? పరాయి స్త్రీనిగూర్చి మధురంగా ఆలోచించటమా! ఆమె లేచి, స్త్రీలున్నచోటికి పోబోయింది. అందరి కళ్లు ఈర్ష్యగా చూస్తున్నాయి.

"ఏమేయ్...నిన్నే!" శ్రీపతిగారి కంఠం కర్కశంగా విన్పించింది. ఆమె వెనుతిరిగింది. ఆ తిరగడంలో ఓ ప్రత్యేకత, అందం కన్పించాయి.

"ఈ ప్రసాదంపళ్లెం పట్టుకు వెళ్లు." అది తీసుకుని, మాయం అయినట్టు వేగంగా తప్పుకుంది. భోజనాలకు కూర్చున్నాం. పదార్థాలు చేదుగా, విషం మింగినట్టు అన్పించాయి. వెళ్లిపోతే సభ్యతగా ఉండదని కూర్చున్నాను. మరొక్కసారి ఆ మూర్తి...ఆ అప్సర.. దర్శనం అవుతుందేమోనని చూచాను. బయట వేసిన షామియానాలో అందరూ కూర్చున్నారు. నేను హాల్లోనే ఓ కుర్చీలో కూర్చుని, ఫిల్మ్ ఫేర్ తిరగెయ్యసాగేను.

"మాష్టారూ! తాంబూలం" సుధ చిన్న వెండి పళ్లెంతో వచ్చింది. అప్రయత్నంగా తల ఎత్తాను. ఎదురు తలుపులో చిరునవ్వుతో నిల్చున్న మెరుపుతీగె మాయం అయింది.

"తీసుకోండి."

తీసుకున్నాను. అది తియ్యగా. అమృతంలాగా తోచింది. సుధను దగ్గరగా పిలిచాను.

"తాంబూలం యెవరిచ్చారు?"

"అమ్మ ఇచ్చింది." ఆ మాట నాకు కర్ణకఠోరంగా విన్పించింది.

అమ్మలు...అమ్మ అనుకున్నాను

"మీ అమ్మ పేరు?"

"హేమలత" సుధ యెవరో పిలిచినట్టు పరుగులుపెట్టింది. నా మతి పోసాగింది. యెంత చక్కని రూపం! రూపానికి తగిన పేరు. శ్రీపతి మాత్రం ఆమెకు తగిన భర్త కాడు.

"ఒంటరిగా ఉన్నావేం ఆనంద్?" అతని మాటలకు ఉలికిపడ్డాను అ తరువాత యెన్నోసార్లు కావాలనే పని కల్పించుకుని చాలాసేపు ఉండి పోయేవాడిని. వారంలో రెండు, మూడుసార్లు శ్రీపతి గర్జింపులూ ఆమె ఆర్తనాదాలు విన్పించేవి. అతను కొట్టే ప్రతి దెబ్బ నా హృదయంపై పడినట్టే అన్పించేది. కావాలని పిల్లల చదువుపై అత్యంత శ్రద్ధ చూపసాగేను. ఒకోసారి పరధ్యాసగా ఆలోచించేవాడిని. గబ గబా ఇంట్లోకి వెళ్లి శ్రీపతిని నాల్గు తన్ని ఆమెను హృదయానికి హత్తుకోవాలని పించేది. వెంటనే విచక్షణ మేలుకునేది. కొందరు స్త్రీలకు దెబ్బలు తినటం కూడా ఒకవిధమయిన సుఖాన్ని ఇస్తుందట. ఆమె ఆ కోవకు చెందినదేమో! ఓ రోజు గేటుదగ్గర నిలబడిన పనిమనిషిని చూచాను.

"యెల్లిపోతున్నారా పంతులోరూ?"

"ఏం తీరికగా ఇక్కడున్నావ్?"

"ఆ ఇంట్లో జరిగే భాగోతం రోజు సూడాల. ఓ పున్యకత కాదు, కీర్తన కాదు." విసుక్కుంది.

"శ్రీపతిగారంత మంచివారు కదా? ఆమె నలా యెందుకు చావగొడతారు?" ధైర్యంచేసి అడిగాను.

'ఆయన మొగమారాజు. ఏంజేసినా చెల్లుతుంది. ఆయన సొమ్ముజూసి పెండ్లి చేసుకున్నది ఆడదానిలా పడి ఉండొద్దూ! రోజూ సాకులే! అక్కడికి చిలక్కి చెప్పినట్టు చెప్తానా? ఆయన ముందల్తో పోతాడంట...మరదలితో కులుకుతాడంట. మొగోడు, ఆయంతో పందెమా?"

నా కొల్లు మండిపోయింది. మొగోడు అంటూ ఓ వంక పురుషునికి పట్టంకడుతూనే, మళ్లీ స్త్రీకి అన్యాయం చేస్తున్నారని. తెల్లకాగితాలు నలుపుచేస్తూ వ్యాసాలమీద వ్యాసాలు రాస్తారీ మహిళా




మణులు. పైనుండి సన్నగా ఏడ్పు విన్పిస్తూనే ఉంది.

"అంత అందమయిన భార్య ఉండగా ఆయన బయట యెందుకు తిరుగుతారు ?" అన్నాను.

"ఏం సత్యకాలం మనుషులయ్యా ! రుసులు బాబా...రుసులు. ఇంట్లో యెంత కమ్మగ ఉన్నా హోటేలుకెల్లరు..." వేదాంతం చెబుతున్నట్టు నవ్వింది. భారంగా అక్కడినుండి కదిలిపోయాను. అమ్మ చెల్లిని పురుటికి తీసుకువచ్చింది. తాత్కాలికంగా అన్నీ మరచిపోయాను. చెల్లితో కబుర్లు చెప్పుకుంటూ గడిపేవాడిని.

"అన్నయ్యా !"

"ఏమ్మా ?"

"అమ్మ నీ గురించి చాలా దిగులు పడుతుంది."

"దిగులా ! యెందుకు ?"

"పెళ్ళి చేసుకోవటం లేదని."

"దిగులెందుకే ? కొన్నాళ్ళు సుఖంగా ఉంటాం."

"మేమంతా మా అత్తగారిళ్లలో సుఖశాంతులు కరువు చేశామన్నమాట !" అంది కోపంగా.

"ముక్కు మీద కోపం..." అన్నాను.

"చెప్పరాదు అన్నయ్యా ! పోని నీ మనసులో యెవరున్నారో చెప్పు." నా మనసులో ఉన్నవారి సంగతి చెబితే ఇంకేమయినా ఉందా ?

"నన్ను వెతకమంటావేమిటి ?"

"అంత పని మాత్రం చెయ్యబోకు" అన్నాను భయం నటిస్తూ. మర్నాడు చెల్లి పట్టుబడితే, ఆమెను తీసుకుని కాచిగూడా, ఆంజనేయస్వామి ఆలయానికి వెళ్లాను. ప్రసాదం తీసుకుని బయటకు వస్తుంటే, చెల్లాయి స్నేహితురాండ్రు కన్పించారు. వారు కబుర్లలోపడి నా మాటే మరిచిపోయారు. నెమ్మదిగా

ఒక్కొక్క మెట్టు దిగుతూ, చేతిలో కొబ్బరి ముక్కలు యాచకులకు పంచి పెట్టాను.

"ఆనంద్ బాబూ !''

ఇంత మధురమయిన కంఠం యెవరిది ! నన్ను అలా పిలిచేవా రెవరు? వెనుదిరిగాను. కారు తలుపులు తీసుకుని నిల్చుంది హేమలత ! నా స్వప్న సామ్రాజ్యంలోని మహారాణి.

''నన్ను గుర్తించలేదా ?" అన్నది చిన్నబుచ్చుకుంటున్నట్టు.

"లేదు. అకస్మాత్తుగా చూచానా... అందుకే. ఆలయానికి వెళ్లరా ?" అన్నాను దగ్గరగా చూడటంవల్ల మతి పోతుంది నాకు.

"భగవంతడు కూడా లంచాలుంటేనే కనికరిస్తాడు నా దగ్గర ఏముందని అతనికి లంచంపెట్టను ! నేను అసహ్యించుకునేవి...ఏవయినా ఉంటే భగవంతుని పేరు...మాతృ మూర్తి... కన్నతల్లి అని పూజ చేస్తారే ఆ తల్లి పేరు...''

''మీరు ఆవేశపడుతున్నారు."

"ఒహ్ ! పరిసరాలే గుర్తుండవు సంవత్సరాని కోసారి అరుదుగా లభించే స్వేచ్ఛలో" అంది యెటో చూస్తూ.

"భగవంతుని పేరు పలనివారు, ఆ రోజు అంత కుదురుగా పూజ చేశారేం?''

"ఆ మాత్రం ఊహించలేరా ? దెబ్బలకు అలసిపోయిన శరీరానికి కాస్త సుఖం ఇద్దామని..."

''ప్రతిరోజూ నా కోసం ఫలహారాలు పంపి శ్రమపడుతున్నారు."

"నాకు ఆనందం కలిగించేది అదొక్కటే అంటే మీరు నమ్ముతారా.." అంటూనే చటుక్కున వెళ్లి కార్లో కూర్చుని మరో దిక్కుకు చూడసాగింది. ఏమిటా అని వెనుతిరిగాను. ఓ వయసులో ఉన్న విధవరాలు, ఓ పుణి స్త్రీ దిగివస్తున్నారు. వారి వెనకాల డ్రయివరు ప్రసాదంపళ్లెం పట్టుకు వస్తున్నాడు. అక్కడ నిల్చోడంబావుండ దని అప్పుడే ఆలయానికి వెడుతున్నట్టు పైకి వెళ్లిపోయాను. ఏదో అసంతృప్తిగా ఉంది. నన్నారాధించే స్త్రీని తర్వగా వదిలిపెట్టినందుకు కాబోలు ! స్త్రీల పట్ల ఘనీభవించే నా హృదయంలో తీయని స్పందన ప్రారంభం అయింది.

ఆ రోజు మామూలుగా ఫలహారం చేస్తున్నాను. సమోసాల మధ్యనో కాగితం కన్పించింది. నెమ్మదిగా తీసి జేబులో వేసుకున్నాను. ఆ రోజు కాలం స్తంభించిపోయినట్టుగా అన్పించసాగింది. పాఠం పూర్తిచేసి బయటపడ్డాను. ఇంటికి వెళ్లేవరకు ఓపికలేదు. ఉత్తరం విప్పాను.

''ఆనంద్

నిన్నేమని సంబోధించాలి ? నా ఊహా లోకంలోని రాజకుమారుడివనా, లేక



నాకీ పంజరంనుండి విముక్తి కల్గించ టానికి అవతరించిన దేవతామూర్తి వనా? మౌనంగా నీ మధురమైన గొంతు వినటం నా కార్యకలాపాలలో ఒకటి. నీవు సుధకు రాయించిన వ్యాసం చదివాను. స్త్రీ పట్ల మీకున్న పూజ్య భావం సానుభూతి చూచి ఈ ఉత్తరం రాస్తున్నాను. నాకీ ఇంటినుండి విముక్తి కావాలి. నాకు మార్గదర్శకులు మీరు కావాలి. ఈ నరకంలో ఉండలేను. అమ్మ ఆశలకు బలి అయ్యాను. నల్గురి పరాయి స్త్రీలతో తిరిగే శ్రీపతి నన్ను కొన్నాడు. అతనంటే నాకు అసహ్యము, ద్వేషము. మిమ్మల్ని గేటులో మొదటి రోజు మేడపైనుండి చూచాను. వెంటనే తెలియని మధుర భావమేదో నన్ను ఆవహించింది. అపవిత్రమైన శరీరం అక్కరలే దనుకుంటే నాకేదో బ్రతుకు తెరువు చూపండి.

మీ

హేమ.''

నా ఒళ్ళంతా ముచ్చెమటలు పోశాయి. నన్ను కటకటాల వెనక్కి తోయించ టానికి అయిదు నిమిషాలు పట్టదు శ్రీపతికి. నా హృదయంలో కదలాడే అవ్యక్తమైన భావాలకు హేమ రూప కల్పన చేసింది. సంకోచాలు అన్నీ వది లేశాను. నేను ఏ పనిచేసినా అమ్మకు

చెప్పి చేయాల్సిందే. దొంగచాటు వ్యవహారాలంటే విపరీతమైన చికాకు. చెల్లాయి పురుటికి సహాయం చెయ్యటానికి వదిన కూడా వచ్చింది. అందరిముందు నా నిర్ణయం తెలిపాను. "ఏంట్రా! మతిగాని పోలే కదా? దేశం గొడ్డుపోయిందా? వివాహం కాని కన్యలే లేరా?"

"మరిదీ! సంఘ సంస్కర్త వు కావాలనుకుంటే ఇలాంటి పనులే చేయాలని ఏంలేదు." వదిన వెటకారం చేసింది. "యెంత విడ్డూరం! ఒకసారి వివాహం అయిన స్త్రీ మళ్లీ పెళ్లికెలా అంగీకరిస్తుందయ్యా?" అసహ్యంగా, ఆశ్చర్యంగా చూసింది.

"సంఘ సంస్కరణ! అలాంటి పెద్ద మాటలు వద్దులే వదినా!" అన్నాను. పోయిన నెలలో "స్త్రీ-స్వాతంత్రం" అంటూ వ్యాసం రాసి ప్రథమ బహుమతి కొట్టేసిన, వదిన నేతి బీరకాయ చందమని ఈనాడే తెలిసింది

"మతిపోయిందా అన్నయ్యా! అది ఆడదా, గాడిదా? పిన్నికీ పెదనాన్న కెంత తేడా? కిక్కురుమనకుండా కాపరం చెయ్యలేదూ?" చెల్లాయి నిరసనగా చూచింది. నాకు నవ్వు వచ్చింది.

"అవివాహితలూ - మాతృత్వము." అంటూ రాత్రంతా కష్టపడి స్త్రీలకు అనుకూలంగా రాసిన చెల్లాయి, మన దేశంలో, నాయకుడి దగ్గరనుండి కర్షకుడివరకు ప్రాకిపోయిన జబ్బు ఏదయినా ఉంటే చేతలకు మాటలకు యెక్కడా పోలిక లేకపోవటమే. ఒక స్త్రీని సహృదయంతో అర్థంచేసుకోలేక నెరజాణలు, స్త్రీ కన్యగా ఉండి, తల్లి అయితే గౌరవిస్తారట! పూజిస్తారట!

అమ్మ గొణుక్కుంటూనే ఉంది. చెప్పటం నా ధర్మం అనుకున్నాను. వేణుతో విషయమంతా చెప్పాను. వాడికి ఇష్టం లేకపోయినా, తన గౌరవం నిలుపుకోవటాని కన్నట్టు అంగీకరించాడు. హేమను ఆ యింట్లోనుండి తప్పించడం యెలా? శ్రీపతిగారితో ముఖాముఖి తలపడే ధైర్యం లేదు. మామూలుగా అయిందిటికే ఆయనిల్లు చేరాను. ఏనాడూ లేనిది ఆ సమయంలో ఆయన కారు కన్పించింది విశేషం ఏమిటా అనుకుంటూ వరండాలో అడుగుపెట్టాను. లోపలినుండి గొడవగా కొన్ని గొంతులు విన్పిస్తున్నాయి. "నిన్నే! కాంతంకెదురు చెప్పే గుండెలా నీకు?" శ్రీపతిగారి గొంతు. "ఆవిడపై అంత అభిమానం ఉంటే, ఆవిడతో ఊరేగండి. నేను యెవరి దాసిని కాను." నిర్భయంగా, అయినా మధురంగా ఉంది హేమ గొంతు.

"అదొక్కటే కాదు. ఆ పంతులు గాడికి రోజూ దేవుడికి ప్రసాదం పంపినంత భక్తిగా కాఫీ, ఫలహారాలు పంపుతుంది." కాంతంలా ఉంది. ఆవిడ శ్రీపతి విధవ మరదలు.

"నీకంటే నీతిమాలిన దాన్ని కానులే అక్కయ్యా..." అంతే. దబ్బుమని క్రిందపడిన చప్పుడు, ఆ వెంటనే హేమ ఆర్తనాదం విన్పించాయి. ఆగలేక పోయాను. కర్టెను తొలగించి లోపలికి వెళ్లాను. నేలమీద పడిన హేమను, వాకింగ్ స్టిక్‌తో అడ్డదిడ్డంగా బాదే స్తున్నాడు. వెనుకగా వెళ్లి అతన్ని ఆపాను.

"ఆనంద్ !...నువ్వు...నువ్వా ?"

"నేనే...బలవంతులయిన మీరు ఒక అబలపై చేయిచేసుకోవటమా ?'

"ఊం..."అతను నన్నూ, హేమను మార్చి మార్చి చూశాడు. నా దృష్టి హేమ నడుము దగ్గర ఆగిపోయింది. ఎర్రగా కంది రక్తం చిందేలా ఉంది. ప్రాకుతూ ముందుకు జరిగింది, రెండు చేతులు జోడించింది.

"ఆనంద్‌గారూ ! మీ పాదాలకు నమస్కరిస్తాను. నన్నీ నరకంలోనుండి తప్పించండి" అత్యంత దయనీయంగా ఉంది.

"కాంతం చెప్పింది నిజం అన్న మాట." అతని కళ్లు నిప్పులు కురు స్తున్నాయి. బెత్తం ఎత్తాడు. దాన్ని లాగి అవతల పారేశాను

ఇద్దరం ప్రత్యర్థుల్లా చూసుకున్నాం.

''నువ్వెవడవోయ్ !"

"పౌరుడిని. ఒక నిండు ప్రాణిని హత్య చేస్తుంటే సహించలేను " అని జోడించిన చేతులుపట్టి లేపాను హేమను. అతను మండిపడ్డట్టు చూచి ముందుకు దూకాడు.

''నీకు మూడిందిరా. నా ఇంట్లో వారిపై, నా ముందే చేయివేస్తావా ?" నా కాలరు పట్టుకున్నాడు. యెక్కడ లేని ధైర్యంతో విదిలించేశాను.

"జాగ్రత్త ! మర్యాదగా మసలుకుని, నీ ప్రవర్తన మారితే హేమలత వస్తుంది. లేదా తన బ్రతుకేదో తను చూసుకుం టుంది'' అన్నాను దృఢంగా.

"ఓహో ! ప్రాణంతో గడప దాట గలననేనా నీ ధీమా ?''

"దివ్యంగా" అన్నాను. ''నే వచ్చిన ఆరు నెలలనుండి చూస్తున్నాను. ఒక్క రోజయినా ఆమెను కొట్టకుండా వదిలావా ?"

"అది మా స్వవిషయం.''

"అచ్చం మియ్యాఖాన్ లాగేమాట్లాడు తున్నారు. మీరు నాపై కేసుపెట్టండి," నిర్లక్ష్యంగా అని, పదమన్నట్టు హేమ వంక చూచాను. ఆమె కుంటుతూ ముందుకు నడిచింది. ఇంట్లోని స్త్రీలంతా శాపనార్థాలు పెడుతున్నారు. డ్రయివరు రంగంలోకి వస్తాడనుకున్నాను. అతను ప్రతిమలా నిల్చున్నాడు. వరండా మెట్లు దిగుతుండగా శ్రీపతి కంఠం కర్కశంగా విన్పించింది.

''ఒక్కసారి గేటు దాటావంటే మళ్లీ గడప త్రొక్కలేవు.''

"ఆ అవసరం రాదు." నీరసంగా జవాబు ఇచ్చింది హేమ.

రిక్షాలో కూర్చున్నాం.

"యెక్కడికి పొమ్మంటారు ?" నా కేం తోచలేదు.

"మొదట ఏదయినా క్లినిక్‌కు తీసుకు వెళ్లండి." హేమ గొంతు నీరసంగా ఉంది. ఆ తరువాత స్పృహతప్పి పోయింది. మిసెస్ దేశాయి క్లినిక్ ముందు రిక్షా ఆపించి, చేతులపై యెత్తి తీసుకు వెళ్లాను. అప్పటివరకు నేను చూడలేదు. తలపై యెక్కడో చిట్లినట్టుంది. రక్తం నా బట్టలను పాడుచేసింది. మిసెస్ దేశాయి నాకు పరిచయస్తురాలు, అందుకే వెంటనే అడ్మిట్ చేసుకుంది.

"ఎవరు ఆనంద్ ! రాక్షసంగా హింసింపబడింది," అన్నది చేతులు కడుక్కుంటూ. వివరాలు అన్నీ చెప్పాను.

"శ్రీపతిగారి భార్యా ?" ఆమె నోరు వెళ్లబెట్టింది." ఆనంద్! ఏ గవర్నమెంటు ఆస్పత్రిలోనో చేర్పించి సర్టిఫికేట్ తీసుకో. ఆయనతో వైరం తెచ్చుకోవటమా ?" అన్నది.

"ఈ రాత్రికి ఉండనివ్వండి రేపు చేర్పిస్తాను." హేమ గదిలోకి వెళ్లాను. ఈ సారి సరిగ్గా చూచాను. అందమైన శరీరంపై యెన్నో గాట్లు, కమిలిన మచ్చలు. ఆమె దయనీయ స్థితికి దుఃఖం వచ్చింది. శ్రీపతి డబ్బున్న వాడు. ఆతను ఏదయినా చేయగలడు. రెక్కల ఆధారంతప్ప మరేం లేని నేను ఆయనతో తలపడటం! సాహసం చేశాను. హేమను యెక్కడుంచాలి ? అమ్మ జవాబు ఇచ్చేసింది నాకు, తనకు ఏంసంబంధం లేదని. చెల్లాయి పాపను కూడా చూడనివ్వలేదు. బడిలో సూటి పోటి మాటలు భరించటం కష్టంగా ఉంది. ఆ రోజే హేమను ఆస్పత్రినుండి డిస్‌చార్జీ చేశారు. ఇద్దరం ఆస్పత్రి ముందున్న గార్డెన్‌లో కూర్చున్నాం.

"మీరు...మీరు బాధపడుతున్నారా ?" పాలిపోయిన ముఖంతో అడిగింది.

"నిన్ను తీసుకొచ్చినందుకు కాదు. మన చుట్టూ ఉన్నవారి ప్రవర్తనకు." మృదువుగా ఆమె చేయి నొక్కాను.

"నేను మెట్రిక్ పాసయ్యాను. ఏదయినా ఉద్యోగం దొరకదా ?"

"ప్రయత్నం చేద్దాం" అన్నాను. విడాకులు లభించేవరకు యెక్కడో ఒక చోట ఉంచాలి. సంఘసేవికురాలు, సాంఘిక విప్లవం తెచ్చిన వీరవనిత కరుణామయి గుర్తుకు వచ్చింది. ఉత్సాహంగా లేచాను. రిక్షా చేసుకుని ఇద్దరం ఆమె ఇంటికి వెళ్లాం. ఖద్దరు దుస్తులలో అతి సాధారణంగా ఉన్న ఆమెను చూడగానే నమస్కరించ బుద్ధేసింది. ఓపికగా హేమకథ చెప్పాను. విడాకులు లభించే వరకు ఆశ్రయం ఇవ్వమని కోరాను.

"ఏమయ్యా ! ఇదేం సానికొంప అనుకున్నావా ? ...ఏమ్మా శ్రీపతి

లాంటివారి సహచర్యం మరో జన్మ ఎత్తినా దొరుకుతుందా? హైద్రాబాద్ మొత్తం కొనగలడు" తలవాచే చీవాట్లు పెట్టింది తిరిగిన చోట్లూ, జరిగిన అవమానాలు రాస్తే అదో గ్రంథం అవుతుంది పురుషుల కంటే స్త్రీలే నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించారు పది గంటల రాత్రి హోటలు గది తప్ప మరే ఆశ్రయం దొరకలేదు కలాలు కదలంగానే కాదు, స్త్రీకి తోటి స్త్రీపట్ల హృదయాంతరాళంలోనుండి పుట్టుకు రావాలి సాను భూతి మర్నాడు భారంగా బడికి వెళ్లాను లీజర్ పిరియడ్ ఉంటే స్టాఫ్ రూమ్ కెందుకని బయట చెట్టు కింద కూర్చున్నాను ప్యూన్ నర్సయ్య వచ్చాడు

"మీ కోసం యెవరో వచ్చారు సార్!"

"ఎవరూ?" అతని వెనకాల వెళ్లాను శ్రీపతి ముఖం చూచి తల వంచుకున్నాను

'ఆనంద్!" అతని పిలుపులో కోపం లేదు ఏదో రాజీకి రావాలనే ఆదుర్దా ఉంది

"క్షమించండి శ్రీపతిగారూ! హేమలత కోలుకుంది ఆమెను హింసించనని మాటిస్తే మీ వెంట వస్తుంది''

"అక్కరలేదు ఆనంద్ నాటి పొరపాటే ఈ వయసులో పెళ్లేమిటి? సుధావాళ్లమ్మే ద్వితీయ కళత్రం మీకు స్వయంగా నా చేతుల మీదుగా వివాహం జరిపిస్తాను''

నమ్మలేక పోయాను ఇదేదో కుతంత్రం కాదుకదా!

"నమ్మకం కలగటం లేదుకదా!" ఆయన నవ్వారు ఆయన మాట ఆయన నిలుపుకున్నారు మర్నాటి పేపర్ల నిండా ఆయన ఫోటోలే ఆయన త్యాగనిరతిని విశాలభావాలను కొనియాడారు 'నేను హేమలతను రక్షించటానికి మరో దారిలేక వివాహం ఆడాను భార్య అనే హక్కుంటే తప్ప స్త్రీ ఒక పురుషుని అండలో ఉండలేదు సరియైన జోడీ కుదరాలని ఇన్నాళ్లు చూచాను యువకులకే సాహసం తెగింపు ఉండాలని ఆనంద్‌ను అంగీకరింపజేశాను" ఇలా సాగింది ఆయన స్టేట్‌మెంటు నాకు నవ్వు వచ్చింది ఇదో చదరంగపు ఎత్తు రాబోయే ఎన్నికలకు రాజమార్గం

"భారతరత్న'' అనే బిరుదు ఇందిరమ్మ కిచ్చారు ఈయన కిస్తే బావుండేది" హేమ పడీ పడీ నవ్వింది ఇంత పెద్ద పట్టణంలోనూ మాకిల్లు దొరకలేదు మా ఫోటోలు శ్రీపతి పుణ్యమా అని పేపర్లలోకి యెక్కాయి ఒక్కచోట రెండు గదులు దొరికాయి కాని అక్కడి నివసించేవారంతా, సిగరెట్ ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులు

"హేమా! ఇక్కడ ఉండగలవా?"

"మనసులో కల్మషాలు లేకుండా మోటుగా నాల్గు తిట్టుకున్నా, సాను భూతి, భూతదయ ఉంది వారిలో. నాకేం ఇబ్బంది లేదు, అన్నది హేమ. వారంరోజులలో హేమ అన్నమాట నిజం అని తేలింది. చిరునవ్వుతో గుమ్మంలో నిల్చుండే హేమ కన్పించక పోతే నాకేదో అశుభంగా తోచింది.

"హేమా!"

మూర్తీభవించిన శోకదేవతలా ఉంది ఆమె. ఆమె చాలాసేపు ఏడ్చింది అన టానికి కళ్లు ఉబ్బిఉన్నాయి. ఆదుర్దాగా చేయి పట్టుకున్నాను.

"అసలేమయింది హేమా?"

"మీ అమ్మా, చెల్లి వచ్చారు మిమ్మల్ని వదిలిపోతే వెయ్యి రూపాయలు ఇస్తామన్నారు."

"నువ్వేం అన్నావు?"

హేమ కళ్లు నానుండి ఏం దాచ లేవు. ఆమె ఏమందో అర్థంఅయింది.

"డబ్బు అక్కరలేదు. నేను ఆయన జీవితంలోనుండి తొలగిపోతాను అన్నావు కదూ?" జవాబుగా నా భుజంపై తల వాల్చి వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఇటు చూడు హేమా! నాల్గు సంవత్సరాలు ఏడ్చావు చాలదా?" ఆమెను నా కభిముఖంగా తిప్పాను. "ఇకనుండి నీ పెదవులపై చిరునవ్వే తప్ప కంటిలో తడి నేను చూడ కూడదు."

"ఆనంద్! జీవితాన్ని మనము ఒక కోణంనుండే చూశాం. రెండవ కోణం నుండి ఆలోచించలేదు. రేపు మన పిల్లలు..." పూర్తి చేయలేకపోయింది. నాకు నవ్వు వచ్చింది.

"ఆవేశావేం? మన పిల్లలను వెలి వేస్తారని కదూ నీ భయం. బూజుపట్టిన భావాలు ఒకొక్కటే మలుపుకు పోతు న్నాయి. మనపిల్లల కాలంనాటికి సంఘం ఇలాగే ఉండదు." ఓదార్చాను.

"మీ అమ్మగారు..."

"చెప్పు, అగావేం?"

"ఇరుగు పొరుగులనందరిని పిలిచి యాగిచేశారు. రేపటినుండి వాళ్లు నా ముఖాన పేడ చల్లేస్తారు..." అవును. ఆ యిల్లే కాదు. ఆ ఊరే వదలాలి. ఎలా?

"నా వల్ల మీకు..."

"చాల్లే తెలివి. ." మృదువుగా కసురు కున్నాను. హేమకోసం ఏదయినా త్యాగం చెయ్యాలనే నా ఆధాధన ఆమెకేం తెలుసు!

భోజనం తరవాత హేమవడిలో తల పెట్టుకు పడుకున్నాను. ఆమె ముఖం అలా గంటలు, గంటలు చూడటం నాకు సరదా. అకస్మాత్తుగా డి. ఇ. ఓ. గారి మాటలు తళుక్కున నా మదిలో మెరిశాయి.

"ప్రతివాడు పట్నంలో ఉండాలనుకుంటే యెలా? 'మొండిచింత' అనే ఊరుందయ్యా! సౌకర్యాలు లేవనుకో, మరక్కడ హైస్కూల్ తీశారు కదా! ఒక్క గ్రాడ్యుయేటు వెళ్లడు. ఎవరిని వేసినా ఏదో సాకు, లేదా పైవారి రికమెండేషన్ తెస్తారు. మనం బాగుపడేది యెప్పుడో!"

నిజంగా నేను వెడితే? అవును హేమ సమక్షమే నందనవనం అవుతుంది. ఒకరిని ఒకరం చూస్తూ జీవితాంతం గడపవచ్చు.

"హేమా!" అరిచాను.

"ఏమిటి?" భయంగా చూచింది.

"మనం ఈ ఊళ్లో ఉండం" అన్నాను. మర్నాడుదయమే డి. ఇ. ఓ. గారి దగ్గరకు వెళ్లాను.

* * *

మొండిచింతకు రైలుప్రయాణం చేయాలి. తరువాత బస్సులో ఇరవై మైళ్లు వెళ్లాలి. బస్సు దిగాక పదిమైళ్లు యెడ్లబండిలో ప్రయాణం. మూడు మైళ్లు బండిలో ప్రయాణం చేసేసరికి విసుగు వచ్చింది నా ఒడిలో తలపెట్టి హాయిగా నిదురబోతుంది హేమ. తెలతెలవారుతుండగా ఊరుదగ్గరకు వచ్చాం.

హేమ ముంగురులు సవరిస్తుంటే యెన్నో విషయాలు కళ్లముందు కదలాయి. జనవరి ఇరవై ఎనిమిదిన వివాహం, ఫిబ్రవరి పదిహేను లోపలే యెన్ని మార్పులు.

"కులపాంసకురాలు. నా కొడుకును నాశనంచేసింది." అని అమ్మ, "అన్నయ్య ఎంతకు తెగించాడని" చెల్లి అనుకుని ఉంటారు. కోపం తగ్గాక వారే అర్థం చేసుకుంటారు.

"సార్! ఇదిగో ఇదే పెద్ద గుడి. దండం పెట్టుకోండి." బండివాడి హెచ్చరిక విన్పించింది. ఆలయం ముందు బండి ఆగింది. బయట నుండే నమస్కరించాను "భగవంతుడా! నీ ఉనికే సత్యమయితే, ఈ మనుష్యుల్ని, మనుషులుగా చేయి. మాటలకు, చేతలకు సంబంధం ఉండాలని వారిని ప్రేరేపించు" అని ప్రార్థించాను.

"దిగరా సర్?"

"శుచిగా మరోసారి వస్తాను, పద.

ఉషోదయమయింది...మా జీవితాలలో కూడా ఉషోదయం అయినట్టే అన్పించింది. అది మరచి నిదురబోయే హేమను మైమరచి చూడసాగేను. బండి ఊళ్లో ప్రవేశించింది.






## 1

రామకృష్ణయ్య సాయంకాలం షికారు నుండి తిరిగివచ్చాడు. కాళ్ళు కడుక్కుంటుండగా అతని భార్య శ్రీదేవి చెప్పింది. "మీకోసం ఎవరో మళ్ళా వచ్చారు."

ఆ వచ్చిన అతను సూర్యారావు. నమస్కారాల తరువాత అతనిని తన గదిలోకి పిలిచి, కుర్చీ చూపించాడు రామకృష్ణయ్య.

"ఏం సూర్యారావ్! చాలకాలం తరువాత..."

"అవును మాస్టారూ! ... ఈ మధ్య తీరిక కొంచెమైనా దొరకడంలేదు. రానందుకు మరోవిధంగా అనుకోకండి."

"ఏమైనా కథలు వ్రాశావా?"

"అందుకోసమే వచ్చింది. ఈ ఉగాది పోటీకి పంపించాలని వ్రాశాను. మీరు వినిచెప్తేనాకు సంతృప్తి కలుగుతుంది."

"అయితే చదివి వినిపించు."

సూర్యారావు కవరులోని కథను బైటకితీసి చదివి వినిపించాడు. రామకృష్ణయ్య చాలా శ్రద్ధగా విన్నాడు. కొంచెంసేపు ఆలోచించితన అభిప్రాయం వెలిబుచ్చాడు.

"సూర్యారావ్! సన్నివేశాలను హైదరాబాద్, విజయవాడలలో నడిపించావు. కాని అవి అతికినట్లులేవు. కథానాయిక నాయకుడి చిన్ననాటి స్నేహితురాలని చెప్పడానికి చాల శ్రమపడ్డావు. చివరకు పెళ్ళితో కథ ముగించావు. ఇటువంటివి ఎన్నో కథలు వచ్చాయి. మామూలుగా ప్రచురించడానికి అవకాశముండవచ్చు,

కాని పోటీలలో ఈ కథకు స్థానముండక పోవచ్చు.

''మాస్టారూ! మా దృష్టివేరు, మీ దృష్టివేరు. అందుకే మీకు వినిపించనిదీ కథ పంపదలచుకోలేదు. నాకెంతో బాగుంది. మా వాళ్ళందరూ విని చాలా బాగుందన్నారు...దయచేసి ఏ విధంగా మార్పుచేస్తే బాగుంటుందో చెప్పండి.''

"నీకు చాలా బాగా తెలిసిన ఊళ్లలో కథ నడుపు. భాష కొంచెం సరళంగా వ్రాయి. సన్నివేశాలలో కూడా మార్పు తీసుకొనిరా. నాయిక గురించి శ్రద్ధ తీసుకో. నాయకుడిలో ఆత్మవిశ్వాసం, నిజాయితీ చూపించు. చివరకు వారిద్దరూ పెండ్లాడడానికి పరిస్థితులన్నీ అనుకూలంగా ఉన్నా, నాయిక మనస్సు మరొక సామాన్యుని మీద ఉన్న సంగతి తెలుసుకొని, నాయకుడు స్నేహితునిగా వైదొలగాలని ప్రయత్నంచేస్తే, ఆమెకు నాయకుని యందు అనురాగం కలుగుతుంది. కథను ఇంతటితో ఆపితే పర్యవసానాన్ని పాఠకులే తమకు తోచినరీతి అన్వయించుకుంటారు,'' అన్నాడు రామకృష్ణయ్య.

సూర్యారావు నమస్కారంచేసి వెళ్ళిపోయాడు మరి కొంచెంసేపటిలో జగన్నాథం వచ్చాడు. ఇతని కథలు చాలాపత్రికలలో పడ్డాయి.

"నమస్కారం మాస్టరుగారూ! నా కథ ఒక్కసారి వినిపించి పోదామని వచ్చాను. రేపు సాయంకాలం పోస్టులో కథ పంపకపోతే పోటీకి అందదు."

జగన్నాథం చదివిన కథను రామకృష్ణయ్య చాలా శ్రద్ధగా విన్నాడు. దీనిలోని సమస్య దైనందినం కలిగేవాటి కన్న భిన్నంగా ఉంది. కథ చెప్పడంలో కొత్తదనంలేదు. పాత్రలు సహజంగా లేవు. సంభాషణలు లోకాన్ని మరామ్మత్తు చేయవలసిన ఉపన్యాసాలు. చివరకు సమస్యవిడదు. గిరిజనయువతిని ప్రేమించిన ఫారెస్టరు ఆమె తల్లిదండ్రులను ప్రార్థిస్తాడు, ఆమెను తనకిచ్చి పెళ్ళిచేయమని. కులంలోని పెద్దలు దానికి అంగీకరించరు. రహస్యంగా ఆమెను లేవదీసుకునిపోయి, తల్లిదండ్రులకు కొంతడబ్బు చెల్లించవచ్చునని కొందరు సలహా చెప్తారు. గిరిజనులను ఉద్ధరించి వర్ణాంతరవివాహం చేసుకొని ఆదర్శప్రాయుడు కాదలచిన ఆ ఫారెస్టరు ఇటువంటి పనికి అంగీకరించడు. అతని తరపువారు, ఆమెతరపు వారు ఉపన్యాసాలతో పాఠకుని బాధిస్తారు.

''జగన్నాధం! గిరిజనుల ఆచార వ్యవహారాలు బాగా తెలియందీ, ఈ సమస్యను చర్చించకూడదు. ఊహించడంతో కథ తయారుకాదు. కొండలతోను, వాటిపై నివసించే జనులతోను సన్నిహితసంబంధం కలిగి ఉండాలి. కనీసం అటువంటివారిని బాగా సంప్ర

దించి సందేహనివృత్తి చేసుకోవాలి పాఠకులచేత కథచదివించాలని ప్రయత్నిస్తే దీనిని మార్చాలి. సంభాషణలు పరిమితంగాఉంచి, కొండల గురించి కొంచెం హెచ్చుగా వ్రాయాలి. కొత్తగాఉద్యోగం దొరికిన ఫారెస్టరు శరీరసౌష్ఠవమున్న కొండదొరకూతుర్ని వశంచేసుకోవాలని ప్రయత్నిస్తాడు. తన శరీరంమీద చేయి వేయడానికి భర్తకు మాత్రమే అధికారముందని, బలవంతం చేయడానికి ఏ ప్రయత్నం జరిగినా, మొలనున్న కత్తితో తన గౌరవాన్నికాపాడుకోడం తెలుసునని ఆ కొండపడుచు చెపుతుంది. అధికారి కళ్లు విడతాయి. కాని కథలో బిగువేమీ కనిపించదు. రాజకీయాలు, సంఘ సంస్కారాలు కొండవాళ్ళ జీవితాలకు ముడిపెడితే, ఆ అమాయకులకు అన్యాయం చేసినట్లవుతుంది" అన్నాడు రామకృష్ణయ్య.

జగన్నాథం వెళ్ళిపోయాడు. రామకృష్ణయ్య కూతురు వచ్చి తండ్రిని భోజనానికి రమ్మంది. పట్టుపంచ కట్టుకొని అతను సిద్ధమవుతుంటే తాసిల్దారుగారమ్మాయి విమల వచ్చింది. బంట్రోతును సాయం తీసుకుని.

"నమస్కారం మాస్టారూ!" అంది విమల.

"ఆశీస్సులు విమలా!" అన్నాడు రామకృష్ణయ్య.

"వేగమే వద్దామనుకున్నాను. కాని వ్రాస్తుంటే ఆలస్యమయిపోయింది"

"కథలు వ్రాస్తున్నావా విమలా?"

"అవును మాస్టారూ! మొదటి కథ మొదలుపెట్టాను. అది ఇప్పుడు పూర్తయింది. మీకుచూపించి పోటీకి పంపాలని అనుకుంటున్నాను."

"చాల సంతోషమయిన విషయం విమలా! నీ బోటి చదువుకున్నవాళ్ళు వ్రాస్తే, లోకం చాలా ఆదరంతో స్వీకరిస్తుంది."

"అవును మాస్టారూ! మా అమ్మ, స్నేహితురాండ్రు, అందరూ వ్రాయమన్నారు. బియ్యే ప్యాసయినదానను ఆపాటి వ్రాయలేనా అని అనుకున్నాను. వారంరోజులై కొట్టుకుంటుంటే, ఒక పది పేజీలు మాత్రమే వ్రాయగలిగాను."

"విమలా! రచయిత కష్టాలు నీకు ఇప్పుడు తెలిశాయన్నమాట. అందరూ వ్రాయడం చాల సులువైన పని అనుకుంటారు."

"వ్రాసిన తరవాత లోతుతెలిసింది."

"కథ నే చదివేదా!"

"అదియింకా సాఫు వ్రాయలేదు.మీరు చదవడం కష్టమవుతుంది."

"అయితే చదివి వినిపించు."

విమల చదవడం మొదలుపెట్టింది. ప్రతీ రెండునిముషాలకు రామకృష్ణయ్య ముఖంలోకి చూచింది. అతను ఏదో పూనినవాడిలా, చైతన్యం లేనివాడిలా,




సమాధిలో ఉన్నవాడిలా కనుపించాడు. కథ పూర్తిఅయ్యేవరకు అతను ఈ లోకంలోలేడని ఆమెకనిపించింది. అంతా విన్న పది నిముషాలవరకు అతనేమీ మాట్లాడలేదు. అతని అభిప్రాయం వినడానికి ఆతృతపడుతున్న విమలకు ప్రతీనిముషం ఒక యుగమయింది. కొద్ది సేపటిలో ఆ నిశ్శబ్దం చీలిపోయింది.

"అమ్మాయ్! నువ్వు కథలు వ్రాయడానికి మరో పది సంవత్సరాలేనా పడుతుంది. అదేనా చాలా కృషి చేసిన తరువాత. ఈకథగురించి నాఅభిప్రాయం అడక్కుండా ఉంటేనే మంచిదేమో.

విమలముఖం వివర్ణమయింది.

"ఫరవాలేదు, చెప్పండి మాస్టారూ?" ఆమె ప్రాధేయపడింది.

"విమలా! నీకు తెలుగు వ్రాయడం తెలుసా? గ్రాంథికమేదో, వ్యావహారిక మేదో తెలుసా? పాత్రలు, కథలో వారికున్న ప్రాముఖ్యత తెలుసా? ... ఏం చెప్పడం కోసం ఈ కథ వ్రాశావు? ఇందులో మొదలేది? ... పతాకస్థాయి ఎక్కడుంది?...ముగింపెక్కడ? సన్నివేశాలలో సహజత్వం ఏమేనా ఉందా? సమాజాన్ని ప్రతిబింబించే ప్రయత్నం కూడాలేదే... ఏ హృదయం కదలించడానికి, ఏ మనస్సును ఆనదింపజేయడానికి వ్రాశావు? కథ వ్రాయడంకన్న సులువైన పనిలేదని అనుకున్నావు. కథ వ్రాయడమంటే ఒక కళాఖండాన్ని సృష్టించడమన్నమాట మరచిపోయావు"

అతని మాటలలోని నిర్దాక్షిణ్యానికి విమలకు దుఃఖమొచ్చింది. కళ్లంట నీళ్లు తిరిగాయి మొదటి రచనా యత్నం విఫలమయినందున ఆమె అభిమానం దెబ్బతింది. రామకృష్ణయ్య ఊహా సౌధంనుండి క్రిందకు దిగివచ్చాడు. చీర చెరగుతో కళ్ళుఒత్తుకుంటున్న విమలను చూచేసరికి అతనికి తనుచేసిన తప్పు తెలిసివచ్చింది.

"సారీ! విమలా! ఆవేశంలో ఏదో అనేశాను. కథల విషయంలో చాలా సీరియస్‌గా మాట్లాడడం అలవాటయింది. ఇంతకీ ఇది నీ మొదటి ప్రయత్నం. మరేం అనుకోకు."

విమల మాట్లాడలేదు. మళ్ళా లోపలి నుంచి పిలుపు వచ్చింది. వడ్డించిన వంటకాలు చల్లారిపోయాయి.

రామకృష్ణయ్య టేబిలు డ్రాయరు లోంచి ఒక వ్రాతప్రతి తీసి విమల కిచ్చాడు.

"విమలా! ఈ కథ చదువుతుండు! నేను పదినిముషాలలో భోజనంచేసి వస్తాను,..." రామకృష్ణయ్య యింట్లోకి వెళ్ళిపోయాడు.

అతను భోజనంచేసి వచ్చేసరికి కొంతకాలం పట్టింది. అప్పటికి విమల ముఖంలో ఒక తేటదనం కనబడింది.

"కథ ఎలాగుంది విమలా?"

"చాలా బాగుంది మాస్టారూ, దీనిని ఏ పత్రికకూ పంపలేదా?"

"లేదు...ఈ మధ్య నా కథలను తిప్పి పంపుతున్నారు..."

"మరెందుకు వ్రాశారు?"

"అదేమరి...ఇదో వ్యసనం...... వ్రాయకపోతే నిద్రపట్టని పరిస్థితి ఏర్పడింది.

"మీకు అభ్యంతరం లేకపోతే ఒక విషయం అడుగుతాను. కోపంరాదు కదా!"

"అడుగు విమలా!"

"నా కీ కథయివ్వండి. పోటీకి న పేరున పంపుకుంటాను. మీ పేరు పంపితే వేసుకోడంలేదని మీరేఅన్నారు"

రామకృష్ణయ్య ఒక్కసారి చకిత డయాడు. అతను అనుకోలేదు, విమల ఇలా ధైర్యంగా అడుగుతుందని. తన భోజనానికి వెళ్ళినప్పుడు విమల ఆలో చించిన విషయమిదా!

"ఈ కథ గురించి చాల శ్రమ పడ్డాను. ప్రత్యేకమయిన శ్రద్ధతీసుకొని వ్రాశాను. భాష, భావం, శిల్పం...... వీటిలో కొత్తదనం చూపించాను. పాత్ర లలో జీవం పోశాను. జీవితంలో ఒక చోట తలుపు తెరచుకొని, దివ్యమయిన వెలుగొకటి కనబడి, తెలియకుండానే తలుపు మూసుకుంటుంది. ఆ వెలుగు మనస్సునుండి జారిపోకుండా నిలుపు కోవాలని ప్రతీపాఠకుడు తపిస్తాడు."

"మరి పోటీకి మీ పేరునే పంపించండి"

"నా పేరున పంపితే అది తిరిగి వస్తుంది. అప్పుడప్పుడు బహుమతులు వచ్చిన రచయిత కథకు అంత విలువ ఉండదు."

"అందుకోసమే నేను అడుగుతున్నది. నా పేర కథ పంపనీయండి"

అతను ఆలోచిస్తున్నాడు.

"రామకృష్ణయ్యగారు మంచిరచయిత లని లోకానికి తెలుసు. అందుచేత ఆయన పంపిన కథను కొంతమంది



చదవకుండా తిప్పిపంపవచ్చు. కాని విమలాదేవి ఎవరికీ తెలియదు. ఈ రోజులలో స్త్రీల రచనలకు ప్రోత్సాహం లభిస్తున్నది. మీ కథ వెలుగు చూడా లంటే యింతకన్న మంచి అవకాశం లేదు.''

రామకృష్ణయ్య కొంచెం తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. విమల మాటలలో సత్యం లేకపోలేదు. నలుగురు చదివి ఆనందిస్తేనే కథ. లేనినాడు దానికీ చిత్తు కాగితాలకు భేదమేముంది?

"మరో విషయం మాస్టారూ! నా పేరున కథ పంపితే బహుమతిరావచ్చు. అదృష్టంమీద ఆధారపడి ఉంది...అలా బహుమతివస్తే పేరు మాత్రమేనాది. ప్రతిఫలం మీది. మీరు ఎన్నో కథలు వ్రాయగలరు. ఒక కథ నాకిచ్చినందు వల్ల మీకేమీ లోటుండదు.''

రామకృష్ణయ్యఆలోచించాడు. విమల చెప్పింది చాల బాగుంది. తను కూడా అంత నిస్సంగికాడు. కళను కళ కోసం ఆరాధించే పిచ్చివాడుకాడు. పురుషార్థం దక్కుతుంది, కథను విమల కిస్తే.

"నువ్వు వయస్సులో చిన్నదానివైనా దూరాలోచన కలదానివి. ఇది నాకు అంత యిష్టంలేదు. అయినా తప్పదు. నా యింటి పరిస్థితులు కూడా బాగులేవు ఇది నేను నీకు చేసిన సహాయంకాదు. నువ్వే నాకు చేసినది. నేను కథను నీ

కివ్వడానికి అంగీకరిస్తున్నాను. ఈ విషయం నీకు, నాకుమాత్రమేతెలిసినది.

"చాలా థాంక్స్ మాస్టారూ! మీకు వాగ్దానం చేస్తున్నాను. ఈ విషయం మరెవ్వరికీ తెలియదు. కథ ప్రచురింపబడి ఏ బహుమతి దొరికినా, కనీసం మామూలుగా డబ్బువచ్చినా, ఎంత పెద్ద మొత్తమయినా, ఎంత చిన్నదైనా, మీకది విధిగా యిస్తాను."

"మంచిది విమలా!"

విమల వెళ్ళిపోడానికి లేచింది. రామకృష్ణయ్య డ్రాయరు తెరచి మరిరెండు కథల వ్రాతప్రతులు ఆమె కిచ్చాడు. వాటిగురించి కొంచెంసేపు చెప్పాడు.

"వీటినిచదువు. కథలెలావ్రాయాలో నీకు తెలుస్తుంది. వీటిని చదివి మళ్ళా నా కిచ్చేయ్. ఈరెండు కథలంటే నాకు చాలా అభిమానం మరచిపోకు విమలా!"

"చదివి నేనేతెచ్చి యిస్తాను మాస్టారూ... సెలవు తీసుకుంటాను."

విమల వెళ్ళిపోయింది. రాత్రిపదిన్నర అయింది. చలిగాలి వీస్తున్నది. లెక్కల మాస్టారు రామకృష్ణయ్య వీధి తలుపులు వేసుకొని పడక గదిలోకి వచ్చాడు. పిల్లలిద్దరూ కుక్కిమంచంమీద పడుకున్నారు. నల్లటి కంబళికి చింకి చీర జోడించి శ్రీదేవి వారికి కప్పింది.

పందిరిమంచంమీద ఒక పక్కకు తిరిగిన భార్యను చూచాడు ఆ కథక చక్రవర్తి. ఆమె చినిగిన రవిక వీపును బయటపెడుతోంది. దానిమీదజారుతున్న చీరపైటంచు మీద కుట్లు స్పష్టంగా కనిపిస్తున్నవి.

రచయితలలో ధనవంతులు మన దేశంలో తేరనే చెప్పుకోవాలి. ఉన్నా ఎక్కడో అరుదుగా ఉంటారు. చాలమంది రామకృష్ణయ్యవలెనే రచనను జీవితభృతికోసం అమ్ముకోకుండా, మరో పని చేస్తుంటారు.

ఉత్తమ మయిన ప్రపంచ కథా సాహిత్యమంతా పుక్కిటబట్టి, రచనా శిల్పంలోని మెలకువలు బాగా తెలిసి, సంభాషణా రచనలో సిద్ధహస్తుడై, మృదువైన హాస్యానికి పెట్టినపేరై, శైలి సౌకుమార్యంలో అగ్రగామియై, చదువరులను ఆనందసీమలకు కొనిపోయే రామకృష్ణయ్య నిత్యజీవితావసరాలకు కూడా యిబ్బంది పడుతున్నాడంటే అతిశయోక్తికాదేమో!

## 2

మాఘమాసంలో విమలకు పెండ్లయింది. ఎలమంచిలిలో కాలేజీ లెక్చరరుగా పనిచేస్తున్న శ్రీధర్ కి ఆమెకి పెండ్లయింది. రామకృష్ణయ్య పెండ్లి పత్రికకోసం ఎదురు చూచాడు. బహుశా పెండ్లితొందరలో ఆడపెళ్ళివారు మరచిపోయారేమో! పెండ్లి అయిన మరునాడు బ్రహ్మాండమైన రిసెప్షను జరిగింది. కనీసం రిసెప్షనుకేనా విమలకు జ్ఞాపకం వచ్చి కబురు పంపవచ్చునని ఎదురు

చూచాడతను. ఒక్క హెడ్మాస్టరును తప్ప మరే మాస్టర్లను పిలువలేదు. రామకృష్ణయ్య మనస్సును సమాధాన పరచుకున్నాడు, తనను పిలిచి మిగిలిన మాస్టర్లను పిలువకపోతే బాగుండదు.

ఇంతలో స్కూలుఫైనలు పరీక్షలు వచ్చాయి. కుర్రాళ్ళకు లెక్కలుచెప్పడం పరీక్షలలో పర్యవేక్షకుడుగా పని చేయడంతో రామకృష్ణయ్యకు తీరిక దొరకలేదు. అనకాపల్లిలో ఎవరికీ బహుమతి వచ్చినట్లులేదు. వస్తే కనీసం పోస్టుమాస్టరేనా కబురు పంపించేవాడు. ఉగాదికింకా నాలుగు రోజులుండనగా ప్రత్యేక సంచిక వచ్చింది.

స్కూలులో డ్రాయింగు మాస్టరు ముందు కొన్నాడు సంచిక. ఉగాదికథల పోటీలో మొదటి బహుమతి శ్రీమతి విమలాదేవి శ్రీధర్ గెలుచుకుంది. ఆమె బియ్యేప్యాసయింది. భర్త ఎలమంచిలిలో కాలేజీ లెక్చరరుగా పనిచేస్తున్నారు. ఆమె కొన్ని వందల కథలు వ్రాశారు. కాని తన రచనమీద విశ్వాసం కుదరక, కథలు ప్రచురణార్హాలుకావని ఏపత్రికకు పంపలేదు. ఆమె వినయంగా తనకు కథ సరిగా వ్రాయడమే రాదని యిప్పుడు కూడా చెపుతున్నారు. మృదువుగా గీతాలను ఆలపించడం, తూలికతో ప్రకృతిని చిత్రించడం ఆమెకు హాబీలు.

"తాసిల్దారు గారమ్మాయి విమలే కదూ!" అడిగాడొకమాస్టరు.

"ఆ పిల్లే!......మరేం..." అర్థోక్తిలో ఆగిపోయాడు రామకృష్ణయ్య.

"ఏం, ఆగిపోయారేం?........." డ్రాయింగు మాస్టరడిగాడు.

"మరేంలేదు... చూడండి ...... జగన్నాధానికిగాని, సూర్యారావుకిగాని ఏమైనా బహుమతులు వచ్చాయా?"

రెండవ బహుమతి హైదరాబాదులో ఒకరికి వచ్చింది. మూడవ బహుమతి కలకత్తాలో వారికి వచ్చింది. కన్సలేషను బహుమతులలో సూర్యారావు కొకటి వచ్చింది. జగన్నాధం కథ సాధారణ ప్రచురణ కెన్నుకోబడింది.

ప్రత్యేక సంచిక డ్రాయింగుమాస్టరు దగ్గిర తీసుకొని, క్లాసు పిల్లలను ఒక గంట ముందుగావదిలేసి, రామకృష్ణయ్య మొదటి బహుమతి పొందిన కథ 'మలుపు' చదవడం మొదలు పెట్టాడు. అందులో ఒక్క అక్షరంకూడా విమల మార్చలేదు. కేవలం రచయిత పేరు మాత్రం రచయిత్రి పేరుగా మారింది. ఒకసారిచదివాడు. రెండవసారిచదివాడు. మూడుసార్లు చదివాడు. పుస్తకంమూసి ఆలోచనలో పడ్డాడు. ఇన్నాళ్ళకు తన కథకో ఉత్తమస్థానం లభించింది. కళను గుర్తించి గౌరవించే స్వతంత్రాభిప్రాయాలు గల న్యాయనిర్ణేత లున్నందుకు సంతోషించాడు. తరువాత ఎవరినోటంటవిన్నా విమలాదేవి గురించి

ఆమె కథ గురించి పొగడ్తలు కురిసి పోయాయి.

ఇంటికి వెళ్లగానే శ్రీదేవితో ఈ సంతోషకరమైన విషయం చెప్పాలనుకున్నాడు రామకృష్ణయ్య. రహస్యంగా విమలాదేవి వాగ్దానం గురించి కూడా చెప్పాలనుకున్నాడు. బహుశా ఆమె అర్థం చేసుకోలేదేమో? ...తన తెలివి తక్కువ తనానికి ఆమె విచారించవచ్చు. మొదటి బహుమతి తక్కువేమీకాదు... రెండువేల అయిదువందల రూపాయలు. కథ తన పేరను పంపి ఉంటే... దురదృష్టవంతుడి కథ నెవరు చదువుతారు?

సాయంకాలం సూర్యారావు వచ్చాడు. రెండు ఆపిల్ పళ్ళు తీసుకొనివచ్చి రామకృష్ణయ్య చేతిలో పెట్టాడు.

"మాస్టారూ! మీరు చెప్పిన ప్రకారం కథ మార్చి పంపించాను. రెండువందలు కన్సలేషన్ బహుమతివచ్చింది. ఇదంతా మీ చలవే" అన్నాడు సూర్యారావు.

రామకృష్ణయ్య మనసు ఆనందంతో నిండిపోయింది.

"ఇందులో నా గొప్పతన మేముందోయ్! ఏదో చిన్న సలహా!... కాని నాకు చాలా సంతోషమయింది మన వూరివారిద్దరికి బహుమతులు రావడం— మొదటి బహుమతి విమలకు— నీకు కన్సలేషను బహుమతి...నువ్వు ప్రయత్నిస్తే ఒకనాడు మొదటి బహుమతి వస్తుంది" అన్నాడు రామకృష్ణయ్య.

"మాస్టారూ?...మీదయఉంటే చాలునంతే!......"

సూర్యారావు వెళ్ళిపోయాడు. జగన్నాధం కూడా వచ్చి తన కృతజ్ఞత తెలుపుకున్నాడు.

ఆ సాయంకాలం ఆలస్యంగా చీకటి పడినట్లుంది రామకృష్ణయ్యకు. రాత్రి విమల, ఆమెభర్త వస్తారని నమ్మకంతో ఎదురు చూచాడు. వాళ్లారాత్రి రాలేదు. మర్నాడు కూడా రాలేదు. అలా ఉగాది వెళ్ళిపోయింది. తరువాత ఒక వారం, మరోవారం కూడా వెళ్ళిపోయాయి.

బహుశా విమల ఎవరికీ రహస్యం చెప్పలేదని రామకృష్ణయ్య అనుకున్నాడు. ఈ విషయం చాల సున్నితమైనది. భర్తతో చెప్పడానికి ఆమె సంకోచించి ఉండవచ్చు. ఆ రోజురాత్రి తనతో ఆమె చేసిన వాగ్దానం జ్ఞాపకం వచ్చి, మనస్సును సమాధానపరచుకున్నాడు. ఆవిడకు కలిగిన ఇబ్బందు లేమిటో! అవకాశం ఇంకా దొరకలేదు కాబోలు. లేకపోతే రాకుండా ఉంటుందా!

రెండవవారం నుండి వారపత్రికలలో పాఠకుల ఉత్తరాలలో మొదటిబహుమతి పొందిన కథకు ప్రశంసలు రాసాగాయి.

"చాలా కాలానికి తెలుగు పాఠక లోకానికి ఓ చక్కనికథ లభించింది."

"కథ చదివిన తరువాత, మనస్సునొక దివ్యమైన కాంతి అలముకున్నట్లుంటుంది."




"ఇందులో భాష, భావం, శైలీ.... అన్నీ ప్రత్యేకంగా ఉన్నాయి. రచయిత్రి చాల ప్రజ్ఞాశాలిని ..."

"కథకు 'మలుపు' అన్న పేరు ఎందుకు రచయిత్రి పెట్టారో చివరకు తెలుస్తుంది. ఈ మలుపు అతి సహజంగా ఉంది..."

"చదివాను కథ రెండుసార్లు, మూడు సార్లు, ఎన్నోసార్లు... ... మనస్సును విడువకుండా ఉంది ఈ కథ..."

కథను, రచనాశిల్పాన్ని, మృదువైన భాషను, చక్కని శైలిని, ముగింపును చాలమంది మెచ్చుకున్నారు.

రామకృష్ణయ్య మనస్సులో బరువుగా నిలిచిన ఆశ రోజు రోజుకు క్షీణించ సాగింది. విమల ఏదైనా ఉత్తరమేనా వ్రాస్తుందేమోనని అతనుఎదురుచూచాడు. రెండు ఉత్తరాలు ఆమె చేసిన వాగ్దానాన్ని జ్ఞప్తికి తెస్తూ వ్రాసి, పోస్టుచేసే వేళకు మనస్సు మార్చుకొని చింపి వేశాడు. అత్తవారింట్లో ఎవరిచేతిలో నైనా తాను వ్రాసిన ఉత్తరం పడితే. ఆ యింటికోడలిమీద లేనిపోని అను మానాలు బయలుదేరవచ్చు.

హైస్కూలులో పెద్ద పరీక్షలు వచ్చాయి వాటిలోపడి రామకృష్ణయ్య కొంతవరకు విమల గురించి మరచి పోయాడు. ఆలస్యానికి అతను మరి కారణాలు ఊహించలేకపోయాడు.

స్కూలు ఎండకాలం సెలవులకు మూసివేశారు. వైశాఖం వెళ్ళిపోయింది. జ్యేష్ఠం వచ్చింది. ఎండలు పెళ్ళుమని కాస్తున్నాయి. ప్రతీరాత్రీ రామకృష్ణయ్య ఆరుబయట వాలు కుర్చీలో కూర్చొని విమల ఎందుకు రాలేదో అని ఆలోచి స్తుండేవాడు. ఆఖరికి మరి ఆలోచించ డానికి శక్తిలేక, నిద్రలేని రాత్రులను గడుపలేక, ఒక ఆదివారం ఉదయం ఎలమంచిలి బయలుదేరి వెళ్ళడానికి నిశ్చయించాడు.

వేసుకున్నాడు. శ్రీదేవి కాఫీ, టిఫిన్ యిచ్చి పక్కనే నిలుచుంది.

"మధ్యాహ్నం భోజనానికి వస్తారా?" అడిగింది యిల్లాలు.

"ఎంత సేపు ... ఒక గంటపని... వెళ్ళడం ఒక గంట-రావడం ఒకగంట. భోజనం వేళకు తిరిగివస్తాను. పర్సు టేబిల్ మీద ఉంది. బస్సు ఖర్చుకి డబ్బులున్నాయో లేవో చూడు" అన్నాడు రామకృష్ణయ్య.

శ్రీదేవి పర్సులో డబ్బులు చూచింది. రూపాయ కొంచెం చిల్లర ఉంది.

"వెళ్లడానికి సరిపోతుంది." అంది శ్రీదేవి.

చాలు. అటునుంచి పరవాలేదు." అన్నాడు కొంచెం ధైర్యంగా రామకృష్ణయ్య.

"ఎవరేనా శిష్యుడు కనిపిస్తాడనా! మన దగ్గిర ఉన్నది మనది... ఒకరిస్తారన్నది మనను చేరేదాకా మనదికాదు."

"అయితే నువ్వేచూడు..."

శ్రీదేవి పెట్లో వెదికింది. ఎక్కడా దొరకలేదు. పక్కింటి వాళ్లనడిగి అప్పు తెద్దామనుకుంది. టిఫిన్ తింటున్న కుర్రాడు, ఆడపిల్ల ముందుకొచ్చారు.

"ఎవరినేనా అడగడమెందుకమ్మా! మా డబ్బీలలో దాచుకున్నవి నాన్న యిచ్చినడబ్బులే కదా! తీసుకోఅమ్మా!" అన్నాడు కుర్రాడు.

దక్కి- వాళ్లవేపు చూస్తూఉండిపోయారు. పిల్ల తను దాచుకున్న డబ్బులలో ఒక అర్థరూపాయి యిచ్చింది. కుర్రాడొక రూపాయి చిల్లర యిచ్చాడు. శ్రీదేవి ఆ చిల్లరనంతా జాగ్రత్తగా పర్సులో ఉంచింది.

రామకృష్ణయ్య బస్సులో కూర్చున్నాడు. బయలుదేరడానికి కొంచెం వ్యవధిఉంది. అతనుఆలోచనలోపడ్డాడు. శ్రమ ఒకరిది....అదృష్టం మరొకరిది. విమల చాల అదృష్టవంతురాలు...రెండు వేల కథలలో ఆమె పంపిన కథకే బహుమానం రావడం ఊహించలేనిది. ఆ రచనకేదో చిన్న బహుమతి వస్తుందని అనుకున్నాడు ... కాని ... అందులో అంత విలువ ఉంది ... తన గొప్పదనాన్ని గుర్తించింది లోకం ... రామకృష్ణయ్యకు నవ్వొచ్చింది. అప్పుడే ఆలోచనలు తప్పుదారిన పడుతున్నాయి. కథలు తన వెవరూ తీసుకోడంలేదు.... తిప్పి పంపుతున్నారు ... విమలాదేవి కథను అంగీకరించి బహూకరించారు... అందులో నిజం ఆమెకు తెలుసు. తనకు తెలుసు...ఇవన్నీ ఇప్పుడు ఆలోచించినా ప్రయోజనంలేదు. ప్రస్తుతం ఆలోచించవలసినది, ఆమె తన కెంత ప్రతిఫలం యిస్తుందని ... బహుశా ఆమె చేసిన వాగ్దానం ప్రకారం రెండువేల అయిదు వందలూ యివ్వదేమో... ఆమె భర్త



కూడా అంగీకరించక పోవచ్చు...... వాగ్దానం రహస్యంగా జరిగింది....కాని బహుమతి అందరికీ తెలిసివచ్చింది.... అందరూ ఆ డబ్బుఏమయిందని అడుగుతారు...బహుశా ఆమె డబ్బంతా యివ్వలేదు...కనీసం వేయి రూపాయలిచ్చినా చాలును...అయిదువందలు పెట్టి యింటి పెంకు తిరగవేయించవచ్చు. మూడు వందలుపెట్టి కుటుంబానికంతటికీ బట్టలు కొనుక్కోవచ్చు. మిగిలినరెండు వందలతో వేసవిని హాయిగా గడపవచ్చు. బహుశా అంత కూడా ఆమె యివ్వలేదేమో!...కనీసం అయిదువందలిచ్చినా చాలు. మూడువందలతోనే పడకగదిమీది పెంకు తిరగవేయించి అయిందనిపించవచ్చు. మిగిలిన రెండువందలతో బట్టలు కొనుక్కోవాలి ... ఇంట్లో అందరివి చినిగి పోయాయి. లేనిపోని ఆశలకు పోకుండా ఉంటే మంచిది. ... ఆఖరుకి ఎంతలేదన్నా ఒక వందరూపాయలకు లోటుండకూడదు. అదే తను ఆశించిన ప్రతిఫలం... మిగిలినవంతు అదృష్టవంతురాలిది.

ఈ ఆలోచనలతోపాటు బస్సు ప్రయాణంచేసి ఎలమంచిలి చేరుకుంది.

లెక్చరరు శ్రీధర్‌గారిల్లు వెతుక్కోడానికి అట్టేకాలం పట్టలేదు.

"మొదటి బహుమతి వచ్చిన విమలాదేవిగారిల్లా!...స్టేషను వెనుక...ఎడమ

చేతి పక్క వీధిలో...చివారిమేడ...అదే వారిల్లు!'' ఎవరో చూపించారు.

ఆ యిల్లు పెద్దది వీధిలో సావడి విశాలంగా ఉంది. దానికి యినుప కట కటాలున్నాయి. రెండు మూడు చిన్న బెంచీలున్నాయి. ఎండ కొంచెంముదిరింది వస్తూవస్తూ, ఆత్రుతలో గొంతుకకేదో అడ్డుపడినట్లుతోచి, ఒక సోడా త్రాగి వచ్చాడు రామకృష్ణయ్య.

ఆ పెద్ద యింట్లో ఎంతమందో ఉన్నట్లు లేదు. పనిపిల్ల ఒకతె యిల్లు ఊడుస్తుంది. బహుశా విమల, మొగుడు మేడమీద ఉన్నారు కాబోలు. ఆదివారం అతనికి కూడా సెలవులే...... కొత్త దంపతులు...

"ఓ పిల్లా! అమ్మగారు లేచారా?" అడిగాడు రామకృష్ణయ్య పనిపిల్లను.

"ఏయమ్మగోరు?... కథలురాస్తారే ఆరా...నేక ఆరి అత్తమ్మగోరా?" పని పిల్ల అడిగింది.

పనిపిల్లకు కూడా తెలుసు విమల కథలు వ్రాస్తుందని ... ఈ సంఘంలో కథా రచయితకు ఎంతగౌరవమైన స్థానం!

''కథలు వ్రాస్తారే... ఆమె ...... విమలమ్మగారు"

"ఆరా!...యిప్పుడే నెగిసినారు,.."

"అయితే చిన్న ఉపకారంచేద్దూ!

పనిపిల్ల దగ్గిరికి వచ్చింది.

"అనకాపల్లినుంచి రామకృష్ణయ్య మాస్టారు వచ్చారని చెప్పు...అంతే ... అంతేచాలు" అన్నాడు రామకృష్ణయ్య. తడబడుతూ!

"అలానే. మీరిక్కడ కూసోండి. అమ్మగోరు తానమాడిన తరువాతసెపతా కూసోండి..."

మూలనున్న బెంచీమీద రామ కృష్ణయ్య కూర్చున్నాడు.

ఇల్లూడ్చే పనిపిల్ల లోపలికి వెళ్ళి ఎప్పటికీరాదు. అమ్మగారు స్నానమాడేరో లేదో, పిల్ల చెప్పడం మరచిపోయిందో రామకృష్ణయ్య లేస్తున్నాడు. ఇంట్లోకి చూస్తున్నాడు, తిరిగివచ్చి బల్లమీద కూచుంటున్నాడు. పనిపిల్ల లోపల తిరుగుతున్నది. తొమ్మిది దాటింది. ఎండ అప్పుడే ముదురుతోంది,

ఒక లావుపాటి ఆయన, ఒక బక్క పలుచని అతను ఎటాచీకేసులు పట్టుకొని వచ్చారు. వాళ్లను తను చూచినట్లులేదు. వాళ్ళూ తనలాగే లోపలికి చూచి పని పిల్లను బయటికి పిలిచారు.

"చూడు! అమ్మీ! విమలాదేవిశ్రీధర్ గారున్నారా?" వలంపటి ఆయన అడిగాడు.

"అంటే...కథలురాసే అమ్మగోరా! ఆ పిల్ల అడిగింది.

''దటీజ్‌రైట్! ఆమే!..."అన్నాడు పలుచని ఆయన.

"ఉన్నారు"

"అయితే ఈ రెండు విజిటింగ్ కార్డులు అమ్మగారికిచ్చిరా! మేము నీ కోసం ఎదురుచూస్తుంటాం. ఎంతవేగం వస్తే అంతబహుమానం! చూడు నాచేతిలో ఏముందో? ..." ఆ వలంపటి ఆయన కొత్తరూపాయినోటు గాలిలో ఆడించాడు.

పనిపిల్ల చెంగునదాటి లోనికిపోయి, కళ్ళుమూసి తెరచేలోపుల వచ్చిపడింది జాపోస్తూ!

"అమ్మగారు యెంటనే రమ్మన్నారు. మేడమీద కథలురాసే గదిలో కూసున్నారు...నా యెంటే రండి..." అంది ఆ పిల్ల లోపలికి దారిచూపిస్తూ.

రామకృష్ణయ్య వేపు అనుమానంగా చూస్తూ, జోళ్లు విడిచి వాళ్ళు లోపలికి వెళ్లారు. ఆ లెక్కల మాస్టరు జేబుతడవుకున్నాడు పర్సు బరువుగా తగిలింది. అప్పుడతనికి జ్ఞాపకంవచ్చింది. దానిలో పిల్లలిద్దరూ యిచ్చిన చిల్లరనాణాలున్నాయని, ఏ మాత్రం ఆ పిల్లకు బహుమతి చేస్తే, తిరుగు ప్రయాణానికి సరిపడవని, ఆ వచ్చిన వాళ్ళకు తనకు భేదముంది. తను ఈనాటి విమలాదేవి కీర్తికి మూల కారణం. ఆవిధంగా ఆమె సంపదకు కూడా సహాయం చేసినవాడు. మరి వాళ్లెవరు! బహుశా ఆమెకు తనకంటే ఆత్మీయులై ఉంటారు. లేకపోతే తనను పిలవడంమాని వారినెందుకు పిలుస్తుంది.

పనిపిల్ల హంగామాగా వెళ్తున్నది వీధిలోకి. ఆమె చేతిలో ఫ్లాస్కు, రెండవ చేతిలో సంచీ. ఒక పావుగంట తరవాత హోటలునుండి పొట్లాలు. ఫ్లాస్కునుండి కాఫీయో టీయో పట్టుకొని వస్తున్నది.

"ఓ పిల్లా! నా సంగతి అమ్మగారితో చెప్పావా?" ఎదురుగా పోయి రామకృష్ణయ్య అడిగాడు.

"సెప్పినాను. అమ్మగోరు యేమీ జవాబు సెప్పనేదు."

"ఎవరీ వచ్చినవాళ్ళు?"

"నాకేం తెలుసు. డబ్బున్న మా రాజులు. పుత్తకాలు యేయించేవోరౌకరు కథలు రాయించేవోరౌకరు" అంటూ పనిపిల్ల లోపలికి వెళ్ళిపోయింది.

రామకృష్ణయ్యకు ఒళ్లంతా చెమట పట్టింది ఒక్కసారి. మనసు, శరీరం ఏమీ పనిచేయలేదు. తిన్నగావచ్చి మూలనున్న బెంచీమీద కూచున్నాడు నిర్మించుకుంటున్న ఊహాసౌధాలను ఒకటీ ఒకటీ కూలదోయడం ఆరంభించాడు.

ఎంతసేపయిందో...ఏవో నవ్వులు ...బహుశా విమలకూడా వాళ్ళను సాగనంపడానికి వస్తుంది...రామకృష్ణయ్య లేచి నిలబడ్డాడు...ఆమె చూపులలో పడడానికి సమయం ఆసన్నమయిందని తొట్రుపడ్డాడు. ఆమె మేడదిగి రాలేనట్టుంది. ఆ యిద్దరు కొత్తవాళ్ళే వచ్చి ద్వారం పక్కనున్న బెంచీమీద సావకాశంగా కూచున్నారు.

"ఓ అమ్మీ! ఓ రిక్షాతీసుకురా!" వలంపటి ఆయన అన్నాడు.

"శానదూరం పోవాలా...నా వొల్లి కాదు..."

"ఇగిగో చూశావా, కొత్తపావలా!..." ఈసారి పలుచని అతను ఎర చూపించాడు.

పనిపిల్ల వీధిలోకి వెళ్ళింది.

వలంపటి ఆయన సిగరెట్టు ముట్టించి అన్నాడు:

"ఆమెకు బహుమతి వచ్చిన ధనం ఏంచేసిందో?"

"మీకు తెలీదా?...ఆ ప్రశ్నకూడా నా యింటర్వ్యూలో అడిగాను. ఆమె మెడలోని పొళ్ళనెక్లెసు చూపించింది, నోటితో జవాబీయకుండా..." అన్నాడు పలుచని అతను.

"అందమైన రచయిత్రి విమలాదేవి..."

"ఆమెకన్నా చక్కనివి ఆమె రచనలు. ఆమె అంతఃసౌందర్యాన్ని అవి చూపిస్తాయి."

"కాని యిప్పటికామె వ్రాసినవి మూడే కథలు..."

"పొరపాటుపడుతున్నారు ... ఆమె వందల కథలు వ్రాశామన్నారు...కాని పత్రికలలో ప్రకటింపబడినవి మూడు మాత్రమే...అయితేనేం మూడూ మూడు రత్నాలే..."

"పత్రికలలో వచ్చిన కథలు వేస్తేనే మంచిదనిపించింది...మరో రెండునెలల్లో ఇంకో అయిదు కథలు వస్తాయి. కథా సంకలనానికి ఇప్పటినుంచీ పబ్లిసిటీ యివ్వడానికి వీలుంది...కనీసం అయిదు వేల కాపీలేనా అమ్ముడుపోకపోతే పెట్టుబడి రాణించదు."

"జంబునాథంగారూ? మీకా భయమేమీ అక్కర్లేదు. మొదటి ఎడిషన్ వచ్చిన రెండు నెలలకే మరొకటి వేయవలసి వస్తుంది."

"అందుకోసమే ఆమె కోరిన వేయి రూపాయలు ముందుగానే చెల్లించాను..."

"మీరు చేసినపని చాల దూరాలోచనతో చేసింది...ఆమె రచనలన్నిటినీ మీరు లోకానికి అందించవచ్చు..."

"ఇంతకీ ఆమె వ్రాసిన రెండో కథా మూడవ కథ నేను చదవలేదు. మీరు చదివారా వెంకట్రావుగారూ?..."

"చదివాను...చాలసార్లు చదివాను.."

"రిక్షా వచ్చేదాకా చెప్పండి..."

"రెండో కథ...ఒక వయసు మళ్ళిన ముష్టివాడు రోజూ బిచ్చమెత్తుకుంటాడు. యిల్లాలు చాల ఉత్తమురాలు... కాదనకుండా బిచ్చం వేసేది. కలిగినప్పుడు చారో పులుసో పోసేది. ఆదరించి కష్టసుఖాలు అడిగేది. ఆవిడ మొగుడు చాల అనుమానంగల మనిషి. ఒకరోజు మొగుడి కొత్త ఖద్దరు పంచ వీధిలో తీగమీద ఎండ కేస్తుందావిడ-బిచ్చానికొచ్చిన ముష్టివాడు ఆ పంచ చక్కదనాన్ని మెచ్చుకొంటాడు. ఎవరేనా ఎత్తుకుపోగలరని, తీసి దాచేయ




మని ఆ యిల్లాలితో చెప్తాడు. ఆమె బిచ్చంవేసి యింటిలోకి పోయింది. ఆ పంచెవంకే కొంచెంసేపుచూచి వాడు కూడా వెళ్ళిపోతాడు. మరునాడు ముష్టి వాడు వచ్చేసరికి యింట్లో గొడవ జరుగు తున్నది యిల్లాలిని చావగొడ్తున్నాడు భర్త. అడ్డమయిన వాళ్ళను నెత్తి కెక్కించుకుంటుందని, ముష్టివాడు తన క్రొత్త ఖద్దరుపంచ ఎత్తుకుపోడానికి ఆమెయే కారణమంటాడు. ఆమెతింటున్న దెబ్బలు మరి చూడలేక చల్లగా అక్కడ నుంచి వెళ్ళిపోతాడు. బిచ్చమెత్తడం మానేసి ఆ యిల్లాలిని ఎలా ఆపదనుంచి తప్పించాలని ఆలోచిస్తాడు. చివరకొక నిర్ణయానికి వస్తాడు. తాను చాల కాలం నుండి ప్రాణపదిలంగా జమచేస్తున్న చిల్లర డబ్బులన్నీ లెక్కపెడితే ముఫ్ఫై రూపాయలవరకూ అయింది. సాయం కాలం ఖద్దరు దుకాణంలో, అచ్చంగా అటువంటిపంచ, అత్తాకోడలు అంచుది, దొరుకుతుంది తన డబ్బుకు. దానిని జాగ్రత్తగా పట్టుకొచ్చి, యిల్లాలిని మెల్లిగా పిలుస్తాడు. బుద్ధిగడ్డితిని పంచ ఎత్తుకుపోయానని, అయ్యగారు కొట్టిన దెబ్బలకు ఆమె పడిన బాధ చూడలేక పోయానని, తనను క్షమించవలసిందని చెప్పి ఆ కొత్త పంచ ఆమె చేతిలోపెట్టి, తిరిగి చూడకుండా, ఆ యింటితో తన సంబంధాన్ని పూర్తిగా తెంపుకొని, వెళ్ళి పోతాడు. ఆమె పంచను లోపలికి తీసు కెళ్ళి దీపం వెలుతురులోచూచి, ఆ పిలు పందని బిక్షగాడిని పిలుస్తుంది, 'ఓ అబ్బీ. పంచె అంచుమీద మావారిపేరు కుట్టాను. దీనిమీద అటువంటిదేమీలేదు. ఇది మాదికాదు నాయనా!...'

"అద్భుతంగా ఉంది!..." యిల్లాలి అమాయకత్వం, ముష్టివాని మహాత్యాగం మనస్సుకు కరుణతో అభిషిక్తం చేస్తాయి.

ఆమె నడిగాను. ఈ కథకు ఏ సంఘటన మూలమని? ... ఒకసారి వీధిలో కలకల మయింది. కాసమనిషి కల్లాపుజల్లుతూ అక్కడపెట్టిన చెంబు మాయమయిపోయింది. అడుక్కోడానికి

వచ్చిన ముష్టివాడిని అనుమానించి చావ గొడతారు...ఈ దృశ్యం ఆమె మనస్సులో నిలిచిపోయింది. లోకంలో ఎందుకూ కొరగాని బిచ్చగాళ్ళకు కూడా మనసుందని, నైతిక సంపద ఉందని నిరూపించారు విమలాదేవిగారు."

"మూడోకథ?..."

"అదీ అటువంటిదే ఓ వయసులోనున్న పనిమనిషి...ఆమెపై మరులు కొన్న యింటియజమాని ... భర్తను అర్థంచేసుకొన్న యిల్లాలు. పనిమనిషి వచ్చిన తరువాత యజమానిలో కలిగిన మార్పులు గమనించిన యిల్లాలు, అతని కోరిక తీరడంకోసం ఒకనాడు అనుకోకుంటా పుట్టింటికి వెళ్ళిపోతుంది ఆ పనిమనిషి మాత్రం ఆ యజమానికో మంచి పాఠం చెప్పి, ఆ విడిపోతున్న దంపతులను దగ్గిరగా తీసుకొస్తుంది. నాకింకా ఆ కథలోని మొదటి వాక్యాలు గుర్తున్నాయి...'అమ్మగారు మంచివారు... అయ్యగారు మంచివారు. వారి మనస్సులలో పొరపొచ్చాలులేని రోజులలో ఆ యింట్లో ఆనందం తాండవించింది. కొత్త పనిమనిషి వచ్చిన కొద్దిరోజులలో ఆ ఆనందం లోపించినట్లయింది. అమ్మగారి ముఖంమీద చిరునవ్వు కనిపించినా, లోపలి విచారరేఖలు బయలుపడేవి...' అలా కథ నడుస్తుంది. చివరకాయిల్లాలు భర్త కోరుకుంటున్న స్వర్గం దూరం చేయడానికి యిష్టంలేక, ఒకనాటి మధ్యాహ్నం పుట్టింటికి వెళ్ళిపోతుంది. ఆఖరున అయ్యగారిని, అమ్మగారని అర్థంచేసుకున్న ఆ వయసులోని పనిమనిషి అంటుంది. 'బాబుగోరూ!... ఒక్కసంగతి గమనించినారా!...తమరిగోరి సుఖంకోసమే ఉన్నట్టుంది అమ్మగోరు యెళ్ళిపోయినారు. తమరు నా వొంటిమీద సేయియేయాలని తొందర పడుతున్నారు. అమ్మగోరికి అన్యాయం సేస్తున్నట్టుకూడా అనిపించనేదా?...నా వొంటిదానికే కట్టంగా ఉందే...నాకేం. మూడోమనువుదానిని. తమకు సుకమిస్తే నాకో నాలుగు డబ్బులు దొరుకుతాయి. కానీ బాబుగోరూ!...నేను యీనాడుండి రేపు పోవాలసినదాన్ని...పోతూ పోతూ మీ కుటుంబాన్ని యిడదీసి, ఎప్పుడు నవ్వే అమ్మగోరి ముఖాన నిప్పోసి పొమ్మంటారా?"

"ఈ కథలోకూడా విమలాదేవి ఎంత ఉదాత్తతగా వ్యవహరించారు! చెడిన పనిమనిషిలో ఒక సంసారాన్ని నిలబెట్టే మంచి కోరిక కలిగించి, పాఠకుల మనస్సులలో చెరగని ముద్రవేశారు."

"ముష్టివాళ్ళందరూ దొంగలని, వయసులోని పనిమనుషులు వ్యభిచారిణులని అందరూ సాధారణంగా తీర్మానిస్తే, ఈమె వాళ్ళను దేవతలుగా మలచారు."

"రచయిత్రికి ఉజ్వల భవిష్యత్తుంది."

"రాబోయే పత్రికలో 'విమలాదేవితో

ఇంటర్వ్యూ' చదివి మీ అభిప్రాయం వ్రాయండి."

"తప్పకుండా! ... మరి! కథల సంపుటి పరిచయానికి కూడా అది పనికి వస్తుందిగా!"

"జంబునాథంగారూ! మీ వ్యాపార సరళికి నమోవాకాలు...లాభంలేనిది ఏ పని చెయ్యరుకదా..."

ఇద్దరూ నవ్వుకున్నారు. వీధిలోఉన్న రిక్షామీద వెళ్ళిపోయారు.

అంతా వింటున్న రామకృష్ణయ్యకు మతిపోయినట్లయింది. లోకం తిరుగుతున్నట్లనిపించింది. వడగాడ్పు వీచడం మొదలయింది. బయటి తాపానికి హృదయంలో జ్వలిస్తున్న అవమానాగ్ని తాపానికి అతను తట్టుకోలేకపోయాడు. తాను చెప్పిన ప్రతీ అక్షరం విమలాదేవి విక్రయించింది. తన రెండు కథలను తనకు కాకుండా చేసింది.

పనిపిల్ల బయటికి వచ్చింది.

"ఓ పిల్లా! కథలు వ్రాసే అమ్మగారికి నా సంగతి జ్ఞాపకం చెయ్యి" కోపంగా, విసుగుగా అన్నాడు రామకృష్ణయ్య

అతని ముఖంలోకి కొంచెంసేపుచూచి పనిపిల్ల లోనికి వెళ్ళింది. అనుకున్నంత తొందరలో రాకపోయినా మరోపది నిముషాలలో వచ్చింది.

"అమ్మగారు రమ్మని పిలుస్తున్నారా? అతృతతో అడిగాడు రామకృష్ణయ్య.

"ఏం నేదు...ఈయాల అమ్మగోరికి నలతగా వుందట నిన్ను సూడ్డానికి తీర దని అమ్మగోరు సెప్పారని అయ్యగోరన్నారు."

పనిపిల్ల లోపలికి వెళ్ళిపోయింది.

విమలాదేవి, ఆమె భర్త శ్రీధర్ అలా ప్రవర్తిస్తారని రామకృష్ణయ్య కలలోకూడా అనుకోలేదు. ఈ ఊహించని అవమానానికి తట్టుకోలేకపోయాడు లేచినిలబడితే కాళ్ళు వణికాయి వడిగా అడుగులు వేసుకుంటూ స్టాండ్‌కుపోయి, బస్సులో కూచున్నాడు.

బస్సు బయలుదేరింది. కండక్టరు డబ్బులడిగాడు. చిల్లర అంతా అతని చేతిలోపోస్తే, వింతగా రామకృష్ణయ్య ముఖంలోకిచూచి, లెక్కబెట్టుకున్నాడు. సరిగా టిక్కెట్టు సొమ్ముంది. బస్సులో అవమానం పాలుబడకుండా రక్షించిన పిల్లలను, భార్యను తలుచుకునేసరికి అతని కళ్ళలో నీళ్లు తిరిగాయి.

ఆ బీదరచయిత కోపం తాటాకు మంటలా చల్లారిపోయింది. అతని గుండెలలో పేరుకున్న ఆశ పూర్తిగాపోయి, హృదయం తేలికపడింది.

పుస్తకాలవ్యాపారి వెళ్ళిపోతూ అన్న మాటలు అతనికి జ్ఞాపకం వచ్చాయి.

"నాలుగోకథ మలుపు ఎలా వుంటుందో చూడాలి."

అంత ఉదాసీనతలోను రామకృష్ణయ్య పెదవులమీద నొక స్వచ్ఛమైన చిరునవ్వు విరిసింది.

---




# అంటుమామిడి

రాజయ్యబావ చాలా ఆకస్మికంగా చనిపోయినప్పటికీ అతని తుది కోరిక ఏమిటో అతని సన్నిహితు లందరూ గ్రహించగలరు.

పదోరోజున "అంటుమామిడి చెట్టును పెరటిగుమ్మంలో పాతిస్తాను," అని రాజయ్య బావమరది వెం క ట చ ల ం పలికిన తరువాతనే కాకులు పిండాన్ని ముట్టుకున్నాయి.

ఇంట్లో చావుసందడి అంతా తగ్గాక వెంకటచలం అనుకున్నాడు, "అంటు మామిడిచెట్టును పాతించకపోతే ఏం?'' అని. అత నిలా అనుకోవటం ఎవరికీ తెలీదు. పక్షం రోజులు గడిచినా పెరటి గుమ్మంలో అంటుమామిడిమొక్క తల గాలికి అల్లల్లాట్టంలేదేమని ఊళ్లోవాళ్లంతా పరామర్శించుకుంటున్నారు.

వెంకటచలం తన రాజయ్యబావమీద వేరే వింత అభిప్రాయంతో ఉన్నాడు. రాజయ్య బాల్యంనుంచీ భాగ్యవంతుడు. వెంకటాచలం బా ల్య ం లో నే భాగ్య వంతుడు.

పేదస్థితికివచ్చినదగ్గర్నుంచీ వెంకటా చలం తండ్రి సుబ్బయ్యగారు అల్లుని సహాయాన్ని ఎన్నోసార్లు కోరాడు. కోరిన వేళావిశేషాన్నిబట్టి రాజయ్య తనమామకు చేయూతను అందిచ్చేవాడు. ఆసహాయం వేళ్లమీద లెక్క పెట్టగలిగినన్ని సార్లే.

రాజయ్య విచిత్రవ్యక్తి అని ఊళ్లో వాళ్ళంతా అనుకున్నప్పటికీ, రాజయ్యపై వెంకటాచలానికీ సుబ్బయ్యగారికీ వేరే అభిప్రాయం ఉండేది.

సుబ్బయ్యతల్లి రాజయ్యకు అమ్మమ్మ. ఆమె మరణించినప్పుడు పెద్దదనానికి నూరురూపాయలివ్వమని మా మ య్య అల్లుణ్ణి కోరాడు. మామచేత పెరట్లోని చిన్నినేలను వ్రా యి ం చు కుని మరీ ఇచ్చాడు పచ్చకాగితం రాజయ్య.

నాటినుంచీ పెరట్లోని చిన్న భూభాగా నికి రాజయ్య యజమాని అయాడు. పెరట్లోఅంటుమామిడిమొక్కను వేశాడు రాజయ్య. మూడేళ్ళకు పిందెలు వేసింది. దిష్టితగలకుండా రాజయ్య గుడ్డబొమ్మను కట్టా డాచెట్టుకి. రెండేళ్ళు గడిచినవి.

---

మ ధు మూ ర్తి

పల్లెలోని తోటలన్నీ పెద్దగాలికి పాడై పోయాయి కాని, రాజయ్యబావ అంటు మామిడిచెట్టు పిందెకూడా కిందపడలేదు

పల్లెలోనివాళ్లంతా రాజయ్యని అడిగారు. ఇంటికి పాతికకాయచొప్పున పంచి ఇస్తే ఊరగాయ పెట్టుకుంటామని—

"మీ అమ్మ పేరు, అమ్మమ్మ పేరు చెప్పుకుని ఊరగాయ తింటాం'' అని మరికొందరు అతన్ని పొగిడారు.

"సంతవెల యిస్తాం కావలిస్తే...ఊరగాయలకు లేకుండా తోటలు ధ్వంసం అయాయి" అని మరికొంత మంది అహంతో అడిగారు.

కాని, రాజయ్య గుండె కరగలేదు. "నన్ను అట్టే మొహమాట పెట్టకండి" అన్నాడు రాజయ్య.

అవి యింకా నిర్మాణ కార్యక్రమ ప్రభావంరోజులు కాబట్టి రాజయ్య ఇంటికి అంటుమామిడిచెట్టు పంటఅంతా ప్రశాంతంగా ఎగుమతి అయింది.

తట్టలతో మామిడికాయలను కూలీలు తీసుకుపోతూంటే ఊళ్లోని ఆడవాళ్లంతా అనుకున్నారు "జగ్గమ్మే పంచిపెడుతుందిలే ఊరగాయని'' అని.

జగ్గమ్మకి దానం అనే నీరసగుణం లేకపోలేదు. అదితండ్రినుంచితుంచుకున్న గుణం. అయితే ఆమె దాతృత్వం చెలాయించడానికి రాజయ్యయిల్లే ఆమెకు పరాయికొంప అయింది. పెళ్ళి అవక ముందు,అయింతరవాతకూడా ఆడపిల్లకి పుట్టిల్లూ, మెట్టేయిల్లూ పరాయికొంప లవటంఅనుశ్రుతంగా వచ్చే అయోగ్యత.

రాజయ్యకు డబ్బుగలవాడిననే గర్వం ఎక్కువే. కాని, ఆవూరికరణం తనకన్న ధనికుడుకదా అనిఅతనిఆత్మ వెక్కిరించినప్పుడు "ఆ... ఫరవాలేదు ... అత్తమామలకంటె అధిక ధనవంతుణ్ణికదా'' అని జవాబిచ్చుకుని సంతృప్తిపడేవాడు. అత్తమామలకంటె ప్రతి కష్టజీవి మేలు అనే సంగతి అతనుఆలోచించేవాడుకాదు.

సుబ్బరాయడుషష్టికి జగ్గమ్మ సోదరుల్ని భోజనానికి పిలిచింది. బ్రహ్మచారులు మనింటికి వచ్చారు. ఏదో నూలుపోగు వాళ్ళొంటిని వెయ్యండి'' అని జగ్గమ్మ భర్తను ప్రాధేయపడింది.

సాలెసుబ్బన్న మగ్గం మీదనుంచి తాజాగా దిగిన అంగవస్త్రాలతో బ్రహ్మచారులను పూజించి ఒళ్ళువిరుచుకున్నాడు పెళ్లాం యెదుట రాజయ్య.

వెంకటాచలం ఈ సంగతి మరచిపోలేదు. బావగారు తనబాల్యంలో చేసిన ఈ అసమానపు మర్యాదకు వెంకటాచలం విసుక్కున్నాడు. అక్కయింటికి వెళ్లటం మానేశాడు. అత్తింటికీపుట్టినింటికీ దూరం ఆరు ఫర్లాంగులే అవటంవల్ల జగ్గమ్మకి సంబరంగానే ఉంటూఉండేది. వెంకటాచలం మనసులో పెంచుకున్న విరోధం పల్లెలో ప్రాకకపోవటానికి ఈ సామీప్యమే కారణం అయింది.

సుబ్బయ్యగారు అల్లుని శపిస్తూనేచనిపోయాడు. రాజయ్య ఈ శాపాలకి వెను

వెంటనే చావలేదు. జగ్గమ్మ తన తండ్రి పోయిన దుఃఖంతో రెండు నెలలపాటు పుట్టినింట్లోనే ఉండవలసి వచ్చింది. ఊళ్లోని వాళ్ళు, పొరుగూరు వాళ్ళంతా కష్టంవచ్చినవాళ్లని పూర్తిగా పరామర్శించ టానికి రెండునెలలు గడువు కావాలి.

రెండునెలలపాటు రాజయ్యకి తాత్కాలికంగా భార్య అడ్డులేదు. కన్నతండ్రి పోయినందువల్ల జగ్గమ్మని వూళ్లోని అమ్మలక్కలు వూరగాయ అడగటానికి వీలులేకపోయింది.

ఎంకి ఆవూళ్లో కథానాయకురాలు. ఆవూళ్ళోని ధనికులకు ఆమె ఒక జలగ పేదవారిని ఆమె అందంలోని అయస్కాంతం బాధపెట్టినప్పుడల్లా వారిని ఆమె జలగలాగే సత్కరిస్తుంది. ఎంకికి తరగతుల తారతమ్యంతో నిమిత్తంలేదు ఉంటే పొట్టగడిచే ఉపాయం లేదని ఆమెకు తెలుసు.

ఎంకికి సగం కుండలోని అవకాయ నిచ్చి రాజయ్య సత్కరించాడు. రాజయ్యా పాలేరు యీ విషయాన్ని వూళ్ళో పొక్కించాడు.

ఆవకాయ తస్కరించినందుకు జగ్గమ్మకి కోపంరాలేదు కాని, ఎంకికంటె తనకిగల అర్ధాంగి హక్కును నిలుపుకో లేకపోయానని విచారించింది.

అవకాయను ఎంకికి యిచ్చినందుకు గ్రామస్థులు అవమానంగా భావించి ఆగ్రహించారు. తమకు చవికైనా వూరగాయ దక్కనందుకు ఉడుకుమోతుతనం పెంచుకుని గ్రామస్థులు దానిని ఆగ్రహంగా ప్రకటించుకున్నారు. రాజయ్యకి ఈ గ్రామస్థులెవరైనా ఎంకి చేసేటంతటి సేవ చేశారా అని రాజయ్య ఆత్మ ప్రశ్నించుకుని ఆనందించింది.

ఏడాది ఇట్టే తిరిగింది. మళ్ళీ గాలి వాన వచ్చింది. ఊళ్ళోని తోటలు మళ్ళీ మాడిపోయాయి. రాజయ్యబావ అంటు మామిడికి రవంత నష్టమైనా కలుగలేదు. వూళ్ళోవాళ్లంతా మళ్ళీ రాజయ్యబావని అడిగారు కాయలిమ్మని. ఈసారి అతని నోటినుంచి "ఇస్తాను" అనే పలుకు వెలువడింది.

రాజయ్యబావ గ్రామస్థులకి మంచి వాడయ్యాడు. కాని అతనికి రాత్రుళ్ళు నిద్ర కరువైంది. అందరికీకాయలుపంచి పెట్టటం-అతనికి అలవాటులేనిదాతృత్వం-బాధపెట్టింది. కాని, యేంచేస్తాడు? మంచితనం చూపటంలో కూడా మహా ఇబ్బంది కనిపించిందతనికి.

"రేపు కాయలు దించుతా" అని రాజయ్య గ్రామస్థులకు చెప్పివెళ్ళినరాత్రే తిరిగి రెండోసారి గాలివాన వచ్చింది. తెల్లవారేసరికి చెట్టుకాయలు క్రిందపడలేదు. చెట్టే కూలింది.

గ్రామస్థులకు ఊరగాయ లేని బెంగ, రాజయ్యకు చేత్తో పెంచి పెద్దజేసిన చెట్టు కూలిపోయినబెంగ. బెంగతో అతను మంచం ఎక్కాడు. తిరిగి అతన్ని వెదురుకర్రల వాహనంమీదకే దించారు.




(గత సంచిక తరువాయి)

లైబ్రరీలో పుస్తకాలు వెతుక్కుంటూన్న అతడికి బృంద కూడ అదే పనిలో నిమగ్నమై కన్పించింది.

"నమస్కారం" అన్నాడు.

"నమస్తే" అన్నది బృంద చిరునవ్వుతో.

"ఏం పుస్తకాలకోసం చూస్తున్నారు?" అడిగాడు.

చెప్పిందామె.

"ఆరోజు ఫంక్షన్ తర్వాత మీరు కన్పించనేలేదు నిజంగా మీ నాట్యం ఎంత బా:గుందో వర్ణించలేను. మీరు ముఖస్తుతి అనుకోవద్దు "

బృంద మనస్ఫూర్తిగా నవ్విన చిరునవ్వు మురళి మనసున సుందరంగా, తీయగా ముద్రించుకుపోయింది.

పుస్తకాలు తిరగేస్తూనే అన్నాడు. "బృందా! ఈ రోజు మీ యింటికొస్తాను."

బృందనుండి ఎటువంటి సమాధానమూ లేదు.

"విన్పించలేదా బృందా?" రెట్టించాడు మురళీకృష్ణ. ఈసారి బృంద మాట్లాడలేదు కానీ, తలెత్తి విశాల నయనాలను మరింత విశాలం కావించి చూచింది. ఆ చూపులలో ఎన్నో భావాలు!

"ఇదేమిటి? పిలవకుండానే ఇంటికొచ్చిపడతా నంటాడేమిటీ సిగ్గుమాలిన వాడు?' అని అనుకుంటున్నావా అలా చూస్తున్నావ్?"

"కాదు." నిర్మల గాంభీర్యాన్ని నింపుకొన్న విశాల నయనాలను

వాల్చుతూ అన్నది బృంద, "ఏమీ తెలియకుండానే అంతా తెలుసు నను కొంటూన్న అమాయకులేమో నను కొంటున్నాను."

"అబ్బా! మాటలు బాగానే వచ్చునే!" విపరీతాశ్చర్యం ప్రదర్శించాడు.

''అంత పాపాయిలా కన్పించానన్న మాట! నేనూ మీ తరగతిలోనే చదువు తున్నానని మర్చిపోయారా?"

"ఆహా." చిరుకోపాన్ని మరుగు పరచలేకపోయింది మురళి వదనం "నీకంటే కనీసం మూడేళ్ళైనా పెద్ద వాడినై వుంటాను. కాకపోతే ఖర్మ జాలక క్లాస్‌మేట్స్ మయ్యాం కానీ..."

నవ్వేసింది బృందం. ''వయస్సు వల్లనే విజ్ఞానం అధికమౌతుందని నేర్చు కున్నారన్నమాట, ఇంతటి చదువు తోనూ!"

మురళి నుదుటిమీద ముడుతలు పడ్డాయి ముఖం విసుగుతో ముడుచు కుంది. 'అవునులే. నీతో పరిచయం అధికంగా వద్దు మా యింటికి రాకు. అని చెప్పరాదూ, సరిపోతుంది! ఏందుకీ డొంక తిరుగుళ్ళన్నీ!" పుస్తకాలన్నీ సర్దుకుని లేచాడు వెళ్లిపోవటానికి

బృంద పెదవులపై చిరుహాసం పోలేదు ''ఒక్క నిముషం ఆగండి. నా పనికూడా అయిపోయింది, వచ్చేస్తున్నాను."

"ఎందుకూ? నేను వెళ్ళాలి."

''వస్తానన్నారుగా, మా యింటికి? కలిసే వెళ్దాం" తనకు సహజమైన దరహాస వందనంతోనే అన్నది బృంద.

ఒక్క క్షణం ఆగి అన్నాడు. "ఏమో! నీకు మనస్ఫూర్తిగా యిష్ట మైతేనే...అయినా ఆడపిల్లలకు బాయ్ ఫ్రెండ్స్‌ని యింటికి తీసుకువెళ్ళటానికి కొన్ని అభ్యంతరా లుంటాయిగా? ఆలో చించకపోవటం నాది పొరపాటే."

కాలేజీ గేటుదాటేవరకూ ఇద్దరూ మౌనంగానే నడిచారు. బృంద అడిగింది "మీరు మీ స్కూటర్ మీద వస్తారా, లేక మరో రిక్షా పిలవనా?''

"అయితే రమ్మంటారా మీ యింటికి."

అతడివేపే చూస్తూ నిశ్చలంగా అన్నది బృంద.

''ఓ! చాలా ఆనందంతో నిరభ్యంత రంగా ఆహ్వానిస్తాను కాకుంటే అభ్యంత రాలేమైనా ముందు ముందు మీకే వస్తా యేమో!"

"నాకా!! ఎందుకని?'' మురళి ప్రశ్న

''ఏంలేదు. నడవండి." సంభాషణ త్రుంచివేసింది బృంద.

చాలా ఆదరంగా ఆహ్వానించింది బృందతో వచ్చిన మురళిని గోపాల రత్నం "మా అమ్మాయి అప్పుడప్పుడు చెప్తూనే వుంటుంది బాబూ మీ గురించి.

చాలా సంతోషం, ఇలా మా యింటిని పావనం చేశారు," అన్నది.

కొద్దిగా సిగ్గును అభినయిస్తూ మురళి "రావాలని చాలా రోజులుగా వున్నా రమ్మని మీ అమ్మాయి ఎప్పుడూ ఆహ్వా నించలేదండి. ఇప్పుడైనా నా అంత నేనే వచ్చాను."

తేలిగ్గా నవ్వేసింది గోపాలరత్నం. దానికి బొత్తిగా బిడియం బాబూ. ఎవరి తోనూ అంతగా స్నేహం చేయదు. అదొక రకం పిల్ల... కూర్చోండి. ఇప్పుడే వస్తాను," అంటూనే లోపలికి వెళ్ళి పోయింది.

అంతవరకూ మౌనంగానే వుండి పోయిన బృందవేపు తిరుగుతూ, "అబ్బ! నీ సంకోచం, మౌనం చూచి మీ అమ్మగారెంత పాతకాలం మనిషో, మన కెలాటి సన్మానం లభిస్తుందో ననుకుంటూ బెదరిపోయాను," అన్నాడు తేలిగ్గా నిట్టూర్చుతూ.

నెమ్మదిగా నవ్వింది బృంద. "అయినా పట్టుదలగా వచ్చారు. సందే హం తీర్చుకోవటానికి. మీ కాలుసేతుల కికి భయం లేదన్నమాటేగా,"

ఇద్దరూ నవ్వేసుకున్నారు.

"ఇదేమిటి? ఇంకెవరూ కన్పించరేం మీ యింట్లో?" మురళీ ప్రశ్న.

"ఇంకా ఎవ్వరూ ఇల్లు జేరలే దట్లుంది." పరధ్యాన్యంగా అన్నది బృంద.

కాఫీ ఫలహారాలు తెచ్చి యిచ్చి దగ్గరే కూర్చుని చాలా ఆప్యాయంగా మాట్లాడింది గోపాలరత్నం. అతడి పై చదువుల గురించీ, కుటుంబ విషయాల గురించీ, ఆత్మీయురాలిలాగా అడిగిఅడిగి తెల్సుకుంది.

"ఎందుకమ్మా నీ కా సంగతులన్నీ?" అని తల్లితో గొణుగుతూ, మురళి వేపు తిరిగి చిరునవ్వుతో, "మా అమ్మకు సంకోచమనేది లేదు సంభాషణలో. ఎదుటివారి విసుగుదలైనా గమనించ కుండా యక్ష ప్రశ్నలు వేస్తుంది," అన్నది బృంద

గోపాలరత్నం బాధపడుతుందేమో నని ఖంగారు పడ్డాడు మురళి. 'ఛఛ. అదేం మాట బృందా! నిజంగా ఇంత ఆప్యాయంగా పలుకరించే వారంటే నాకెంతో యిష్టం. అయినా అందరూ నీలా మూతి ముడుచుకుని గిరిగీసు కూర్చునే వాళ్ళైతే, నా లాంటి వస పిట్టలేం కావాలీ లోకంలో?"

"బాగా చెప్పావు!" అంటూ తానూ నవ్వేసింది బృంద తల్లి.

భయ సంకోచాలతో ఆ యింట ప్రప్రథమంగా అడుగిడిన మురళి అమితా నందంతో తిరిగి వెళ్ళాడు తన యింటికి అనిర్వచనీయమైన అనేక ఆశారజ్జువు లలో వూయలలూగుతూ.

## 7

"ఇక వారం రోజులేగా నీ పుట్టిన రోజు బృందా?"

అల్లికపని చేసుకుంటూ తల్లి అడిగిన ప్రశ్నకు వినికూడా సమాధానం ఈయ లేదు, పుస్తక పఠనంలో నిమగ్నురాలై వున్న బృంద.

"విన్పించలేదా?" ఈసారి తన చేతి లోని పనిని ఆపి, తలెత్తి బృందను సూటిగా చూస్తూ అడిగింది గోపాల రత్నం. "ప్రోగ్రాం ఏమిటో ఇప్ప ట్నుంచీ ఆలోచించుకోపోతే ఎలా? ఇప్పటికే అసలు చాలా లేటైంది."

పుస్తకం పక్కన పెట్టి లేచింది బృంద. ఏమిటో చెప్పాలని తల్లివైపు చూచి, చెప్పలేక సతమతమౌతూన్నట్లుగా అటూ యిటూ మెల్లగా పచారు ప్రారం భించింది

"అరే! ఏమిటే అంత ఆలోచన" విస్మయంగా చూచింది తల్లి. "ప్రతి సంవత్సరం జరుపుకొనే మామూలేగా అది?"

పచారు ఆపివెళ్లి కిటికీ దగ్గర నిల్చుంది బృంద. కొద్ది క్షణాలు అలా కంటికి కన్పించే చెట్లూ చేమలను చూస్తూండిపోయింది

ఆఖరుకు వెనక్కు తిరిగి, తల్లిచూపు లలో చూపుకలుపుతూ స్థిరంగా ధీరస్వరాన అన్నది, "నాకీ సరదాలేమీ యిష్టం లేవమ్మా ఖచ్చితంగా చెప్తున్నాను ప్రతి సంవత్సరం కూడా నా కయిష్ట మైనా నీ బలవంతంమీదనే నీ యిష్టం ప్రకారం జరుపుతూ వచ్చావ్. ఈ ఏటి నుంచి మాత్రం ఇక అలా జరగటానికి వీల్లేదు.

"ఏం? ఎందుకని?" రెట్టించింది గోపాలరత్నం. ఆమె స్వరంలో చిరు కోపం చిందులాడింది.

"కోపం దేనికమ్మా?" అంటూ వచ్చి తల్లికి అతి సామీప్యంలో మరొకకుర్చీపై కూర్చుంది బృంద. "సంఘంలో మన కున్న విలువ ఏ మాత్రమో నీకు తెల్సు. తెలిసుండీ ఎందుకీ అనవసర ఆర్భాటా లన్నీ? ఏదో గుట్టు చప్పుడు కాకుండా ఇలా ఎవరికీ తెలియకుండా గౌరవంగా కాలక్షేపం కానిస్తే ఎంత సుఖం."

"ఏమిటి, మాట మాటకీ సంఘం, గౌరవం అంటావ్? మనమేంతీసిపోయాం? కళ్ళు కోపంగా పెద్దవిచేసి తిప్పుతూ, గణగణలాడుతున్న కంఠంతో ప్రశ్నిస్తూ తారాజువ్వలా లేచింది గోపాలరత్నం. 'మనకేం తక్కువని? మనమేం పాపం చేశామని ఇలా మనల్ని మనమే కించ పరచుకోవాలి?......"

"నా మాట వినమ్మా కొంచం..."

"వినను," మధ్యలోనే ఆపి ఖండి తంగా అన్నది గోపాలరత్నం "నువ్వే నా మాట విను. నేను కన్నతల్లిని."

"కాదని ఎవరన్నారు? అందుకే..."

"అందుకే నన్ను నువ్వు తీసిపారే

యకు. లోకం నీకేంతెల్సు? నాలుగింగ్లీషు ముక్కలు చదివినంత మాత్రాన ఎంతో తెలివి కలిగిందని ఎగిరెగిరిపడకు. నే చెప్తాను విను. ఎన్ని అంతఃపురాలలో నీచమైన భాగోతాలుంటాయో, ఎందరు సంసారులు చాటుమాటు అక్రమ సంబంధాలతో ఏడుస్తుంటారో, ఎందరు పెద్ద మనుషులు పేదగుణాలతో హీనంగా బ్రతుకుతుంటారో......"

తల్లి వాక్ప్రవాహం ఎంత ఆవేశపూరితంగా ఎగిరెగిరి పడ్తుందో కుమార్తె కంఠస్వరం అంత శాంత మధురమనోజ్ఞంగా పలకసాగింది. "ఈ విషయాలన్నీ ఇంచుమించుగా ప్రతిరోజూ నువ్వు చెప్పేవేనమ్మా. వినివినీ, తర్కించీ విసిగిపోయాను. నేను నీ కుమార్తెనే, వయస్సులో అనుభవంలో నిక్కంగా నీ కంటే చిన్నదాన్నే కాని, విద్యవల్ల నీ కంటె విజ్ఞానం, లౌకికజ్ఞానాలు అధికంగా కలదాన్నని నీవు ఒప్పుకోక తప్పదు.''

"ఏమంటావ్ అయితే?"

ఆ స్వరంలోని తీక్షణతకు బృంద తొణకలేదు. "మనం మన హద్దుల్లో వీలైనంతజాగ్రత్తగా, అణకువగా వుండాలంటాను. మనం ఎంత సరిగా బ్రతికినా సరే, ఎంత మచ్చలేకపోయినా సరే, సభ్య సమాజంలోని సాంసారిక వ్యక్తులకూ మనకూ మధ్య అంతరాలు చాలా వున్నాయి. ఎవరూ, ఏమిటీ, పుట్టు పూర్వోత్తరాలు, కులగోత్రాలు ఏమిటీ అని ఎవరైనా అడిగితే తలెత్తి ధైర్యంగా సమాధానం చెప్పటానికి జంకవలసిన వాళ్ళం. అంచేత, దయుంచి ఎటువంటి ఆర్భాటాలూ చేయకు. అందుకే నేను ఎవరితోనూ స్నేహాలు కూడా చేయకుండా దూరంగా వుంటాను. నేను చదువుతున్నది కో-ఎడ్యుకేషన్ కాలేజీలో."

"హుఁ" నిర్లక్ష్యంగా అన్నది గోపాలరత్నం. "అనవసరంగా అయినవీ కానివీ ఊహించుకుని బాధపడే నీలాటివాళ్ళు ఈ ప్రపంచంలో బ్రతకడం కష్టం. అనుభవహీనవు. పెద్దవాళ్ళతో వాదించకు. ఎప్పటిలాగే ఈ ఏడూ జరుగుతుంది. ఖండితంగా శాసిస్తూ సంభాషణ ముగించేసి నిష్క్రమించింది.

నిస్సహాయంగా చూస్తూ నిలిచిపోయింది బృంద.

## 8

"అక్కా. నీ స్నేహితులెవరెవరికి పంపాలో కాస్త చెప్పు," పుట్టినరోజు ఆహ్వానపత్రికలపై చిరునామాలురాస్తున్న కృష్ణకుమారి అడిగింది అక్కను.

బృంద మెల్లని స్వరాన అన్నది "నీకు తెలియదా కృష్ణా? నాకు స్నేహితులెవరుంటారు?"

కృష్ణ కంటిరెప్పలు ఆశ్చర్యంతో అల్లల్లాడాయి. "నీ క్లాస్‌మేట్స్, నీకోసం

# పెరిగే వయస్సుకు ప్రియ మిత్రము-ఇంక్రిమిన్*!

ఉప్పొంగే జీవితం. పెల్లుబికే శక్తి సంపూర్ణమైన ఆరోగ్యం! పెరిగే వయస్సులో మీ పిల్లలకు ఇన్‌క్రిమిన్ టానిక్ ఇవ్వండి. ఇన్‌క్రిమిన్ సిరప్‌లో ఉపయోగకరమైన విటమిన్లు, ఐరన్ మరియు అవసరమైన అమినో ఏసిడ్-పెరిగే వయస్సులో ముఖ్యమైనవి అన్నీ వున్నాయి.







## ఇన్‌క్రిమిన్*

## ఇన్‌క్రిమిన్ టానిక్-పెరిగే పిల్లలకు వరప్రసాదం!

డాక్టర్లు విశ్వసించే పేరు- Lederle - ఎ డివిజన్ ఆఫ్ సయానమిడ్ ఇండియా లిమిటెడ్

• అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

SSTAS-INC-3068A TEL

తరచుగావచ్చే మురళీనాగేంద్రా-వీరంతా స్నేహితులు కాక ఎవరక్కా?''

నీరసహాసం మెదలి మాయమైంది బృంద పెదవులపై. ''నీ కింకా చిన్న తనంపోలేదు. అర్థంకాదు. తర్కించకు కృష్ణా.''

అక్క మనస్తత్వం తెలిసివున్న కృష్ణ మరి తర్కించలేదు.

చాలాసేపటికి తటపటాయిస్తూ అడిగింది కృష్ణ. "అయితే అక్కా, ఆ రోజు నువ్వు......"

"ఏరోజు?'' బృంద ఎదురుప్రశ్న.

''అదే, నీ పుట్టినరోజునాడు ఎప్పటిలాగా డ్యాన్సు అదీ చేయవా?"

"ఏమో. అమ్మ ఏం చేయమంటే అది చేయవలసిన ఆటబొమ్మలం మనం. అధికారం చెలాయించే పెద్దవాళ్ళ కింద బ్రతికే అల్పులైన చిన్నవాళ్ళ ఆశలూ, ఆశయాలూ ఎలా నెరవేరతాయి?"

"నిజమే." నిస్సహాయంగా నిట్టూర్చింది కృష్ణ. ''కాని అసలు ఆశయమంటూ వుంటే తీరా మార్గోపాయం వుండకపోదక్కా!"

''ఎలాగే? అమ్మ మనస్సు పూర్వకాలపుది. మనం మనేది ఈ కలుషిత కాలంలో. అది ఆమెకు అర్థంకాదు. ఆధునికత ప్రబలినకాలం గనుక అందరూ సుఖాలు జుర్రుకోవచ్చు ననుకొంటుంది వెర్రిది. వేషభాషలలో ఎదరకుపోతూన్న ప్రజ, సంస్కారం విషయంలో ఎంత వెనకబడి వుందో ఆమెకు తెలియదు''

సంభాషణాంశం బరువైనది కావడం వల్ల చకచకా సాగను వీలుకావడంలేదు

అంతలో మురళీ ప్రవేశించాడు ''హల్లో ఏం చేస్తున్నారు?'' అంటూ

అక్కడవున్న ఆహ్వాన పత్రికలన్నిటినీ త్వరగా తీసేసి దాచేయాలని అనుకొన్న బృంద ప్రయత్నం విఫలమే అయ్యింది. మురళి ఎదురుగా రానే వచ్చేశాడు. తనంతతానే ఒక కుర్చీలో కూర్చున్నాడు "ఏమిటి హడావుడి?"అని ప్రశ్నిస్తూ.

కృష్ణ చెప్పింది సమాధానం.

"వెరీగుడ్." అపరిమితానందాన్ని ప్రకటించాడు మురళి, ఒక కార్డును చేతిలోకి తీసుకొని చూస్తూ, "అన్యాయం ఈ సంగతి యింతవరకూ నాకు తెలియకుండా వుంచడం'' అన్నాడు బృందను ఉద్దేశించి.

చిన్నగా నవ్వి వూరుకుంది బృంద ఆమె తరఫున కృష్ణ సమాధానం చెప్పింది ; "అక్కది ఒక విధమైన మందకొడి స్వభావం. ఇటువంటివన్నీ ఎవరో బొత్తిగా నడమంత్రపు సిరి వాళ్ళకీ, ఆధునికత అంటూ ఆర్భాటంగా తిరిగేవాళ్ళకీ, పబ్లిసిటీ కోసం ప్రాకులాడే వారికీ కాని మనవంటివాళ్ళకు కాదు అంటుంది. అమ్మది మాత్రం అంతకు

## నడుము నొప్పా?



## బాధ నివారణ కోసం
# అయొడెక్స్
## రుద్దటం అవసరం

ఇతర ఆయింట్‌మెంట్స్
మీకు బాధనుంచి ఉపశాంతిని
యియ్యవచ్చు. అయొడెక్స్
ఉపశాంతిని యిస్తూ, బాధను
నివారిస్తుంది. దీనిలో
అయొడిన్ ఉంది గనక.

కండరాల నొప్పులకూ,
కీళ్ళ నొప్పులకూ ఒకే ఒక
ఆయింట్‌మెంట్-అయొడెక్స్.






**అయొడెక్స్ మిమ్మల్ని మళ్ళీ చురుకుగా పనిచేసేలా చేస్తుంది.**

లింటాస్ IODEX I 75 TL

పూర్తిగావిరుద్ధం. అందుకే ఈప్రయత్నాలన్నీ."

"మీ అమ్మగారే రైటు!" ఖచ్చితంగా అన్నట్టు అన్నాడు మురళి. ఈ కాలంలో ప్రతికేవాళ్ళం ఈనాటి పద్ధతులలోనే నడవాలి."

"ఔను," విస్ఫారిత వదనంతో ప్రవేశించింది గోపాలరత్నం. "మీరైనా అలా నచ్చజెప్పండి బాబూ. ప్రతి విషయానికీ మా అమ్మాయిలతో-ముఖ్యంగా బృందతో వాదించలేక నా ప్రాణం సిరసపడిపోతోంది...అన్నట్టు ఇదుగో, ముందు ఆహ్వానం మీకే, తీసుకోండి," అంటూ అప్పటికప్పుడు మురళీ పేరు వ్రాసి అందించింది ఒక ఆహ్వాన పత్రికను.

కృతజ్ఞతలు తెలియజేస్తూ అందుకున్నాడు మురళి. కొంచెంసేపు కూర్చుని, సెలవుతీసుకుంటూండగా, "తప్పకుండా రావాలి అమ్మాయి పుట్టిన రోజు పండగ వేడుకలకు మీరు. అమాయకపు పిల్ల. నాలుగు మాటలు రావు కాని, మనస్సులో మీరంటే ఎంతో ఆపేక్ష, గౌరవమూను పాపం!" అన్నది గోపాలరత్నం.

మనస్ఫూర్తిగా నవ్వాడు మురళి. "తప్పకుండా వస్తాను!'' అంటూ నిష్క్రమించాడు.

"అయిందా, వీధిగేటువరకూ హెచ్చరిస్తూ సాగనంపడం?" కొంత నిష్ఠురత, కొంత అయిష్టత మేళవించాయి బృంద కంఠస్వరంలో

"మరెలాగ? ఇంటికొచ్చిన వాళ్ళని నువ్వూ నేనూ ఎవరమూ గౌరవించకపోతే ఎలాగ? అయినా నీ అంత తెలివి తక్కువ నాగమ్మను నేనెక్కడా చూడలేదు. వెదుక్కొంటూ వచ్చిన సదవకాశాన్ని ఎవరైనా ఇలా జారవిడచుకుంటారా? అన్ని హంగులూ వున్న చక్కటి కుటుంబంలో వాడు, చక్కటి వాడు; చదువున్నవాడు. అతడిని వల్లో వేసుకున్నావంటే మనకింక కావలసిందేమిటి?"

"చాల్లే. వ్యర్థపుటాశలూ, పనికిమాలిన సంభాషణలూను." ఛర్రున లేచింది బృంద. "అతడి చుట్టూ అంతా -అన్నీ చక్కదనం గనుకనే మనలాటి వాళ్ళకి కన్నెత్తి అటు చూచే అర్హత గాని, మనసులో ఏ మారుమూలను కూడ ఆశ అనేది నిలపగల యోగ్యతగానీ లేదు." అంటూనే చరచరా నిష్క్రమించింది.

బృందకు తల్లిగడిపే నీచ జీవితం పట్ల గొప్ప వైముఖ్యత. "మురికి కాల్వలోని ఈగలకూ దోమలకూ అయినా కొంత గౌరవం వుంటుందేమో కాని ఈ పతిత స్త్రీ జీవితానికి ఏ విలువా సార్థకతా వుండవు. నాకు ఒక పురుషుని వివాహం చేసుకొని, ఒక ఇంటికి ఇల్లాలినై మగనాలినై మర్యాదగా మన

వలెనని వున్నది కాని వెలయాలిగా బ్రతుకు వెళ్ళదీసి మురికి కూపంలోని కుక్కకంటే కనాకష్టమైన మరణం పొందాలని లేదు.'' అని వాదిస్తుంది తల్లితో.

వికటంగా నవ్వుకుంది గోపాల రత్నం, ''వెర్రిదానా! ఎందుకే లేని పోని ఆశయాలు? చక్కటి కుటుంబా లలో పుట్టిన కన్యలకే దిక్కూమొక్కూ లేకుండా వుంది పెళ్ళిళ్ళు కావటానికి. ఎంతటి సద్వంశంలోని దానినైనా బాని సను చూచినట్టే చూస్తారు కట్టుకున్న వాడూ అతడి పరివారమూ. చిన్న అవకాశం దొరికినా ఆమె శీలాన్ని శంకిస్తాడు భర్త. ఇక నిన్ను వెలయాలి కూతురిగా ఎవరు విస్మరింపగలరే వెర్రిదానా!''

''అమ్మా, నీకు దణ్ణంపెడతాను. అలా మాట్లాడకు. ఎంతైనా శంకించనీ బానిసలాగే చూడనీ. ఒకే పురుషుని భర్తగా, దైవంగా ఆరాధించడంకంటే స్త్రీ జన్మకు అదృష్టకరమైనదేది? నీతి నియమాలు లేకుండా బ్రతుకుతూ ప్రతి పురుషుని క్రూరపు చూపులతో కులటగా ముద్రింపబడే కంటే, కట్టుకున్న భర్త పాదాల చెంత కుక్కగానైనా మరణించ డమే పవిత్రత!''

కుమార్తె యొక్క ఈ తలతిరుగుడు సమాధానాలు కాలక్రమాన సర్దుకుంటా యనే ఆశతో వుంటూ వచ్చింది గోపాల రత్నం. కానీ బృంద ఆశయాలలో మార్పు కన్పించకపోవడంతో గోపాల రత్నం ఆనాటికానాడు విసుగు జెంద తూన్నది. దానికి తోడు ఈమధ్య నాగేంద్ర అనే ఒక లక్షాధికారి ఇంటి చుట్టూ తిరుగుతున్నాడు, బృందను వశం చేసుకోవడానికి. గోపాల రత్నంతో మంతనాలు సాగిస్తున్నాడు.

## 9

ఒక హోటల్ యజమాని కుమారుడు నాగేంద్ర. తండ్రి హఠాత్తుగా చనిపోవ డంతో చదువు మాని తండ్రి స్థానాన్ని అలంకరించాడు. కళాశాలలో మురళీ నాగేంద్రా సహాధ్యాయులే మురళీ బృందలకు గల పరస్పరాభిమానం అతడికి తెలుసు.

నాగేంద్ర నీచులలోకెల్లా పరమ నీచుడు. స్త్రీ విషయంలోనూ, డబ్బు విషయంలోనూ ఎంతటి నీచాతినీచంగా నైనా ప్రవర్తిస్తాడు. అతి సౌందర్యవతి యైన బృందను ఎలాగైనా వశం కావిం చుకొని హోటల్ డాన్సర్‌గాచేసి తద్వారా ఆ హోటల్‌ను బాగా అభివృద్ధిపరచి కోటీశ్వరుడు కావాలని అతడి పథకం. అందుకే వేలకువేలు ఆశ చూపుతు న్నాడు గోపాలరత్నానికి. కానీ బృంద బలవంతపుచావు చస్తానని బెదిరించడంతో గోపాలరత్నం తాత్కాలికంగా నోరు మూసుకోక తప్పలేదు.

బృంద మురళీకృష్ణ వ్యామోహంలో వున్నదనీ, ఎలాగైనా ఆ ఇద్దరి మధ్యా కలతలు సృష్టించితేనే కానీ తమ పని సానుకూలం కాజాలదనీ గోపాలరత్నం నాగేంద్రకు కుటిల సలహా ఇచ్చింది. ఆమె సలహాప్రకారం ఒక పథకం తయారుచేసి అదనుకోసం నిరీక్షిస్తున్నాడు నాగేంద్ర.

అటు మరళీఇంట ఇతడి ప్రణయం సంగతి అందరికీ తెలిసిపోయింది. తల్లి దేవకి సతాయింపు అధికమైంది. భోగలాలసుడైన భర్తవలన మానసికంగా చాలా బాధపడివున్న ఆమె కుమారుని విషయంలో చాలా పెద్ద ఆశలు పెట్టుకున్నది. అతడు పదుగురికీ ఆదర్శప్రాయంగా ఎలాగెలాగో వుండాలనీ అక్షరాలా శ్రీరామచంద్రుడుగా కీర్తి గాంచాలనీ కలలుగన్నది. అటువంటి దేవకికి మురళి ఒక భోగంపిల్లను తన కోడలిగా యింటికే తెస్తానన్నటంకంటె అఘాతమేముంటుంది?

"రండి రండి, సుస్వాగతం" నలుగురు స్నేహితురాండ్రతో కలిసి మెట్లవద్దనే నిలబడివున్న కృష్ణకుమారి అతి ఘనంగా ఆహ్వానించి మురళిని వెంటబెట్టుకు వెళ్ళింది మేడమీదికి.

చాలా కోలాహలంగా వుంది పైన. పురుషులు లెక్కకు అయిదారుగురున్నారు. అంతా ప్రౌఢ స్త్రీలూ, యువతులే. విపరీతంగా, విడ్డూరంగా, వెర్రిగా అలంకరించుకున్నారు పెదవులకూ, బుగ్గలకూ రంగులు పూసుకున్నారు వృద్ధ వనితలు కూడా. తల మోయలేనన్ని పువ్వులు తురుముకున్నారు. చూపరులకు వెగటు పుట్టించేంతగా గారపళ్ళు బయట పెట్టి, అయినదానికీ కానిదానికీ నవ్వుతూ, కిళ్లీలు నములుతూ చాలా వికారంగా కన్పిస్తున్నారు. మోటుహాస్యాలువిసురుకుంటూ పకపకలాడుతున్నారు పురుషులు గిరజాల జుట్టుతో, స్త్రీలలాగమాట్లాడుతూ నడుస్తూ మరీ వికటంగా కనపడుతున్నారు.

అంతకు మునుపెన్నడూ అటువంటి సమాజాన్ని చూచివుండని మురళి కొన్ని నిముషాలపాటు వారిని విచిత్రంగా చూశాడు.

"వచ్చారా బాబూ. రండి రండి కూర్చోండి." అతిథి మర్యాదలతో ఊపిరి సలపకుండా వున్న గోపాలరత్నం ఏమూలనుంచి చూచిందో వగర్చుకుంటూ వచ్చింది

యాంత్రికంగా నమస్కారం చేశాడు మురళి.

(సశేషం)

Printed and Published by A. Sudhakara Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500001. Controlling Editor : "CHAKRAPANI"

YUVA, SEPTEMBER '74 Two Rupees Regd. No. H/HD